# అపరాధ పరిశోధన

రు. 5.50 | సెప్టెంబర్ '84

సప్లిమెంట్ 129



'+' 'PRABHAKAR'

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎర్ర సముద్రము

రచన: చంద్రశేఖర అజాద్

## పాముల పుట్ట

రచన: బి. రాజేశ్వరి

## మూడు ఫోటోలు

రచన: టెంపోరావ్

## డేగ కళ్లు

రచన: బొమ్మిడి అచ్చారావు

కళ్యాణి దుర్గం - చివరి భాగం
అగ్ని కిరీటం - మొదటి భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—129
సెప్టెంబరు, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.




# ఎర్ర సముద్రము

## చంద్రశేఖర అజాద్

సముద్ర జలాన్ని చీల్చుకుంటూ ప్రయాణం చేస్తూంది ఆ నౌక.

ఆకాశం నిర్మలంగా వుంది. కెరటాలు లేస్తూ విరిగి పడుతున్నాయి. అనంతమైన ఆ సముద్రంలో ఆ నౌక గొప్ప చిత్రకారుడి చిత్రంలా వుంది.

వాతావరణంలో కనిపిస్తున్న ప్రశాంతత ఆ నౌకలో లేదు. అక్కడ అందరి కళ్ళలోనూ ఆశ్చర్యం తొంగి చూస్తోంది. వారంతా తలవంచుకొని నిలబడ్డ అయిదుగురు నీగ్రోజాతి వ్యక్తులవంక చూస్తున్నారు. వారు నల్లగా వున్నారు. వారి శరీరం దృఢంగానూ కండలు పుష్టిగానూ వున్నాయి. వారంతా నీగ్రోజాతికి చెందినవారు. వారెలా ఆ నౌకలోకి ప్రవేశించారో, పట్టుబడేదాకా ఎలా గడిపారోగాని వారెవరి దగ్గరా టిక్కెట్లు లేవు. వారే దేశం వెళ్ళాలో వారికే తెలియదు. ఏదో ఒక దేశం వెళ్ళి అక్కడ ఆశ్రయం కోరాలని వారు

భావించారు.

ఆ నౌక కెప్టెన్ కళ్ళనుండి మాత్రం నిప్పులు కురుస్తున్నాయ్!

అక్కడ నిలబడి చూస్తున్న వారిలో కొందరికి నీగ్రోల గురించి అంతగా తెలియదు. వారు పుస్తకాల్లో చదవటమో, సినిమాల్లో చూడటమో జరిగిందిగాని, ఈ రోజు ప్రత్యక్షంగా వారిని చూస్తుంటే అంతులేని ఆశ్చర్యంగా వుంది. మానవ జాతిలో ఇంత నలుపుగా వుండే వ్యక్తుల్ని చూడటం వారికి తొలి అనుభూతి.

నీగ్రోల గురించి వెలువడ్డ అనేక కథలూ, సినిమాలూ వారందరికీ గుర్తొచ్చాయి. నీగ్రోలది బానిస జాతిగా పేరు. ప్రపంచంలోనే వారెదుర్కొన్నంత జాతి వివక్షత మరెవరూ, ఏ జాతీ, ఏ రూపంలో యెదుర్కోలేదు. ప్రాచీన కాలంనుండి ఈనాటివరకూ అనేక తరాలుగా తమ జాతి వివక్షతకు వ్యతిరేకంగా వారు పోరాడుతూనే ఉన్నారు.

కెప్టెన్ కళ్ళు ద్వేషంతో మండిపోతున్నాయి! అతనికి నీగ్రోజాతి అంటే అంతులేని ద్వేషం. అమెరికన్లన్నా, బ్రిటిష్‌వారన్నా అమితమైన ప్రేమ. వారు తెల్లగానూ, అందంగానూ, హుందాగానూ ఉండి, నాగరికతకూ, ఆధునిక జీవితానికి ప్రతిబింబాలుగా ఉంటారనేది అతని దృఢమైన అభిప్రాయం. అందుకే వారిపట్ల ఆరాధనా భావం పెంచుకున్నాడు.

నీగ్రోలమీద అతనికెందుకింత ద్వేషమో అతనికే తెలీదు. ఆ నల్లటి రంగు, ఆ శరీరాలలో వారు మనుషులుగా కనిపించరు. చాలామంది ప్రాచీన రోమన్లలాగా అతనికి కూడా వారి శరీరాల్ని తూట్లు తూట్లు తూట్లుగా పొడిస్తే

కారే ఎర్రటి రక్తం చూడాలని కోర్కె. కొరడాలతో బాది బాది అలిసిపోవాలని ఆరాటం. ఎందుకో వారిని చూస్తుంటే మానవుల్తో సహజీవనం చెయ్యటానికి వారికలాంటి హక్కు లేదని అతని నమ్మకం.

అర్హత అనే సమస్యే రాకూడదని అతనికున్నా చాలా సందర్భాలలో నీగ్రోలు ఆయనకు తటసపడ్డారు. వారంతా నూటుల్లో వుంటే .... తమతో ప్రయాణం చేస్తుంటే అతనికి చాలా అయిష్టంగా వుండేది. అయినా ఏం చెయ్యలేక పోయేవాడు.

ఆ రోజు అతనికి నీగ్రోజాతిమీద తొలిసారిగా చర్య తీసుకునే బంగారు అవకాశం లభించింది. వారంతా నౌకలోకి ఎలా ప్రవేశించారో అంతుబట్టటంలేదు. నౌకలోకి ప్రవేశించటం అంత సులభమయిన విషయంకాదు.

ఏర్పాట్లన్నీ చాలా పటిష్టంగా వుంటాయి. అన్నీ తనిఖీచేసి పూర్తిగా సంతృప్తిచెందితేనే గాని యెవరికయినా ప్రవేశం లభించదు. అలాంటిది యేకంగా అయిదుగురు నీగ్రోలు తమ నౌకలోకి ప్రవేశించటం అతనికి ఆశ్చర్యాన్ని కలగచేస్తోంది. అప్పుడే తమ నౌక బయలుదేరి నెలరోజులు కావస్తోంది. ఇన్ని రోజులు యెవరికీ కనపడకుండా ఎలా గడపగలిగారు?

ఆ రాత్రే భోజనాల గదిలోకి ప్రవేశించి భోజనం దొంగిలించి తీసుకుపోతున్న వ్యక్తిని గమనించి అనుసరించాడు తమ సిబ్బందిలో మనిషి. ఆ పదార్థాలను అవురావురుమంటూ తింటుండగా పట్టుబడి పోయారు.

నౌకలో ఈ విషయం అందరికీ తెలిసిపోయింది. వివిధ దేశాల ప్రజలు ఆ నౌకలో ప్రయాణం చేస్తున్నారు. ఆ అయిదుగురిని కెప్టెన్ ముందు హాజరు పరిగారు. వారి

వివరాలకోసం ఆయన తీవ్రంగా ప్రయత్నించాక ఒక్క విషయం మాత్రం తెలుసుకోగలిగాడు.

వారందరిదీ దక్షిణాఫ్రికా!

దక్షిణాఫ్రికాలో శ్వేత జాతి జాత్యహంకారానికి వ్యతిరేకంగా నల్లవారు పోరాడుతున్నారు. అయినా ఆ పోరాటాన్ని అత్యంత దారుణంగా అణిచివేస్తున్నారు. మొత్తం ప్రపంచమంతా ఆ చర్యను నిరసించింది. అయినా ఆ ప్రభుత్వం మామూలుగానే వ్యవహరిస్తోంది. శ్వేతజాతి ప్రభుత్వానికి అనేక రూపాల్లో నిరసనలందాయి. ఒలింపిక్స్‌లో సైతం వారి ఆటగాళ్ళకు ప్రవేశం కల్పించలేదు.

అవన్నీ గుర్తువచ్చి మరింతగా వణికిపోయాడతను. దక్షిణాఫ్రికా శ్వేతజాతీయుల్ని సమర్థించే కొద్దిమందిలో క్రెటెన్ ఒకడు. వారందరికీ ఏదో దేశానికి టిక్కెట్లు తీసుకోవటానికి కొందరు ముందుకు వచ్చారు.

"వార్ని ఏ దేశంలో వదలాలి" అంటూ ప్రశ్నించాను క్రెటెన్.

"వారిష్టం వచ్చిన దేశాల్లో వదలండి. అక్కడి ప్రభుత్వాలు వారికి ఆశ్రయం ఇస్తే సరి. లేకుంటే వేరే చోటుకి పంపుతాయి."

"వారిని తిరిగి ఆఫ్రికాకు పంపితేనో" అన్నాడు క్రేటెన్.

చివ్వున తలెత్తారు వారంతా!

వారి కళ్ళలో భయం తాలూకు లక్షణాలు కనిపించటంలేదు. ఆఫ్రికన్ అడవుల్లో ఉంటుంది—కింగ్ కోబ్రా. మొత్తం సర్పజాతు లన్నింటిలోకి దాన్ని రారాజుగా భావిస్తారు. ఆరు అడుగులకు పైగా, నల్లగా

వుంటుంది. దాని వేగం అసాధారణంగా వుంటుంది. కోబ్రా కాటుకుగురయితే బ్రతకటమనే సమస్య ఉండదు. మనిషి చావటానికి కావలసిన విషంకంటే రెండింతలు ప్రాదుర్భావమవుతుంది. కింగ్ కోబ్రాను చూసినా, ఆ పేరు విన్నా చాలామందికి గుండె గరగరలాడుతుంటుంది.

కెప్టెన్ కు వారి చూపులు అలానే తోచాయి.

"స్టో లెటజ్ డిస్కస్ దిస్ మేటర్ లేటరాన్" అన్నాడు కెప్టెన్.

"గుడ్. ముందు వారికి భోజనం ఏర్పాటు చెయ్యండి. మనది ఏ దేశమయినా మనమంతా మానవులం."

కెప్టెన్ వెర్రి నవ్వు నవ్వాడు.

## 2

గాఢాంధకారంలో అయిదుగురు కూర్చొని వున్నారు. వారికి ముందు భవిష్యత్ శూన్యంగా కనిపిస్తోంది. అయినా సరే వారెలాంటి పరిస్థితినయినా ఎదుర్కోవ టానికి సిద్ధంగా వున్నారు. శ్వేత జాతివారు తమనెలా ట్రీట్ చేస్తారో జ్ఞాపకం తెచ్చుకుంటే అలాంటి జీవితం కంటే మరణమే మేలు. అయితే ఊరికే మరణించటం వలన ఎవరికి ప్రయోజనం ఉంటుంది. మానవులుగా గుర్తింపబడటానికి పోరాడాలి. ఆ పోరాటంలో ఎందరు మరణించినా ఫర్వాలేదు.

నీగ్రోలు వేటాడబడి బానిసలుగా తేబడుతుండేవారు గతంలో. వారిని పశువుల సంతలో అమ్మినట్లుగా అమ్మటం, కొనటం జరిగేది. రాను రాను పరిస్థితి యెలా తయారయిందంటే ఈ బానిసలు లేనిదే ఏ పని చేయుటం సాధ్యం కాకుండా పోయింది. బానిసలే వారి ఆస్థి. తిరిగి వారికి పుట్టేవారు కూడా ఆస్థిగానే పరిగణించ

బడేవారు. స్త్రీలనయితే తమ కామానికి గురిచేసేవారు. ఇలాంటి వాటిని చరిత్ర గతిలో వారు భరించలేక పోయారు.

బానిస యజమానులకు అనుకూలంగా ఎన్ని చట్టాలు తేబడ్డా, బానిస పోరాటాల్ని ఎంత క్రూరంగా అణిచివేసినా స్పార్టకస్ కాలంనుండి చరిత్రలో అనేకానేక పోరాటాలు జరిగిపోయాయి. రక్తతర్పణాలు.. త్యాగాలు ఒకటేమిటి కనీస మానవ హక్కులకోసం.... స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం వారెందరో శవాలుగా మారి పోయారు.

వారు స్వేచ్ఛ సాధించుకున్నాక వారంతా విశాల ప్రపంచంలోకి వచ్చారు. నీగ్రో జాతినుండి మేధావులు, రచయితలు, కళాకారులు, ఆటగాళ్ళు ప్రపంచం ముందు కొచ్చారు.

ప్రపంచంలో ఏ జాతీ వెనకబడి వుండదని, ఏ జాతీ మరో జాతికంటే ఎక్కువయినది, తక్కువయినది కాదని, యెక్కడ అవకాశాలు ఉన్నా అక్కడ సృజనాత్మక శక్తులు విస్తరించగలవని, ఏ జాతికి చెందిన సంస్కృతి వారికి ప్రత్యేకంగానూ ఉంటుందని, అన్ని జాతుల హక్కుల్ని, అస్తిత్వాన్ని ప్రత్యేకతల్ని గుర్తించాలని వారు ఋజువుచేశారు.

శ్వేత జాతి వాతబడ్డ భారతీయులు కూడా అనేక విధాలుగా అవమానించబడ్డారు. ఆ అవమానాలకూ, అక్రమాలకూ, వలస దోపిడికి వ్యతిరేకంగా, విస్తృతంగా ప్రజానీకం కదిలింది. బ్రిటిష్ పాలకుల పునాదులు కదిలి పోయాయి. రవి అస్తమించని సామ్రాజ్యంలో చీకట్లు నెలకొన్నాయి.

శ్వేతజాతి జాత్యహంకారాన్ని ప్రపంచం అసహ్యించు కుంది. వారి విష కౌగిలినుండి బయటపడి స్వేచ్ఛా వాయువులు పీల్చారు జనం.

ఉరికొయ్యలు, చెరసాలాలు, తుపాకులు, బాంబులు, ఏవీ వారి స్వేచ్ఛా పిపాసను అణచలేకపోయాయి.

అయినా ఆ సర్పం చావలేదు!

కొస ప్రాణంతో తోక జాడిస్తూనే వుంది!

అందుకు సజీవ ఉదాహరణ దక్షిణాఫ్రికా.

శ్వేతజాతి జాత్యహంకార ప్రభుత్వం!

శ్వేత జాతీయుల జాతి వివక్షతను ఆ దేశ ప్రజలయిన నల్లవారు భరించలేకపోయారు. అందుకని ఓ రాజకీయ పార్టీగా ఏర్పడి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకోసం పోరాడాలని నిర్ణయించుకున్నారు. అయితే ఆ పార్టీని ప్రభుత్వం గుర్తించటానికి ఇష్టపడలేదు.

ఆ అయిదుగురి కళ్ళముందు కనపడుతున్నాడు.

బాబీశాండ్స్!

బాబీశాండ్స్‌తో పాటు మరికొందరిని అరెస్టు చేసింది ప్రభుత్వం. అయితే వారెవరినీ రాజకీయ ఖైదీలుగా గుర్తించకుండా సాధారణ నేరస్థుల మాదిరిగా ట్రీట్ చేయటం ప్రారంభించింది. అందుకు నిరసనగా, రాజకీయ ఖైదీగా గుర్తింపుకోసం నిరాహారదీక్ష ప్రారంభించారు బాబీశాండ్స్, అతని సహచరులు.

రోజులు గడుస్తున్నాయి. అయినా ప్రభుత్వం చలించ లేదు. ప్రపంచం నలుమూలలనుండి అనేక దేశాలు విజ్ఞప్తి చేశాయి. వారంతా రోజు రోజుకూ చిక్కి శల్యమై పోయారు.

ఏళ్ళ రోజులు పైబడి... రాజకీయ ఖైదీగా గుర్తింప

బడక....జైలు గోడల నడుమ..ఇనుప చువ్వల నడుమ... ఉరికొయ్యల సాన్నిహిత్యంలో తమ ప్రభుత్వంకంటే ఎంతో మేలయిన వాటి ప్రక్కన, స్వేచ్ఛా వాయువులు మాత్రమే పీలుస్తూ... కోమాలోకి జారిపోయి ప్రాణాలు వదిలాడు బాబీశాండ్స్! ఆ తర్వాత మరికొందరు!

మానవ జాతి హక్కుల్ని ఆ విధంగా కాలరాస్తున్న వారినెంతగా అభిశంసిస్తున్నా ఆ శ్వేత జాతీయులు లెక్క చెయ్యలేదు. నిస్సిగ్గుగానూ, నిరంకుశంగానూ ఆ పోరాటాన్ని అణిచివేయటానికే నిశ్చయించుకున్నారు.

వారి కళ్ళవెంట నీళ్ళు జారిపడ్డాయి. ఆ అయిదుగురు తమ సంస్థ తరఫున తమ సమస్యలను ప్రపంచ ప్రజల ముందుంచటానికి వారినుండి ఆర్థిక, రాజకీయ, నైతిక సహాయం పొందాలని బయల్దేరారు. కాని దురదృష్ట వశాత్తు వారివద్ద డబ్బులేదు. సాహసించి దొంగచాటుగా నౌకలో ప్రవేశించారు....

కెప్టెన్ తన గదిలో అటూ, ఇటూ తిరుగుతున్నాడు. ఆయన నోటిలోని పైపు గుప్పు గుప్పుమంటోంది. అతనికి ఏం చేయాలో అర్థంకావటంలేదు. వాళ్ళలా దొంగ తనంగా వచ్చారంటే ఆ ప్రభుత్వానికి ప్రమాదకరంగానే పరిణమించి వుండవచ్చు. వారిని తిరిగి అప్పగిస్తే బాగుం టుంది. వెధవల్ని చక్కగా ఉరితీస్తారు!

వీరు బ్రతికుంటే యే దేశమో ఆశ్రయం ఇస్తుంది. వారి కోర్కెలకు ప్రాధాన్యత ఏర్పడుతుంది. వీరి పోరాటాన్ని అక్కడినుండే కొనసాగిస్తారు. ఆర్థికం గానూ, నైతికంగానూ వారికి ప్రపంచపు అండదండలు లభిస్తాయి. మరేం చెయ్యాలి? ఈ విషయం అందరికీ తెలిసిపోయింది. కాగా వీరిని ఏం చేస్తే బాగుంటుంది

అనుకున్నాడు.

అతని పెదవులమీద వికృతమైన నవ్వొకటి మెరిసింది. నోటిలోనుండి పైపు బయటకు తీశాడు. తన అనుచరుడ్ని పిలిచాడు. అతని చెవిలో ఏదో చెప్పాడు. అత్యంత రహస్యంగా కార్యక్రమం జరిగిపోయింది.

సమయం దాదాపు రెండు గంటలవుతోంది. ఆకాశంలో చుక్కలు మెరుస్తున్నాయి. వెన్నెల వెలుగులు సముద్ర జలాలమీద పడుతున్నాయి. అలలు నిర్విరామంగా ఎగిరెగిరి పడుతున్నాయి. కెప్టెన్ నోట్లో పైపు నిర్విరామంగా గుప్పు గుప్పుమంటూనే వుంది.

అయిదుగుర్ని నాక పైభాగానికి చేర్చారు.

కెప్టెన్ ఆ వెలుగులో వారివంక చూశాడు.

"నల్లవారెందుకు పుట్టారో తెలుసా? బానిసలుగా వుండటానికి. అది మీ కర్మ. మీరే జన్మలోనో పాపం చేసుకున్నారు. లేకంటే మీరు తెల్లవారిగా పుట్టేవారు. మీరెంత అరిచి చచ్చినా మీరిలా బానిసల్లా చావాల్సిందే. మిమ్మల్ని బానిసలుగా మించి మరో దృష్టితో చూడం. మీరీ నాకలోకి దొంగతనంగా ప్రవేశించారు. ఇది చాలా దారుణమైన విషయం. అంతేకాదు. మీరీ నాకని ప్రేల్చేయాలని కుట్రపన్నారు. అందుకే మీకు శిక్ష విధిస్తున్నా" అన్నాడు కెప్టెన్.

అతని కళ్ళు నల్లగా వున్నాయి. ఆ వెలుగులో పరమ భయంకరంగా కనిపిస్తున్నాడు.

"విసరండి" ఆజ్ఞాపించేను.

అంతే! బలవంతంగా ఒక్కొక్కర్ని సముద్రంలోకి త్రోసెయ్యటం ప్రారంభించారు!

వారు క్రిందకు వాలిపోతూ వేసిన కేకలు ప్రకృతిలో

ప్రతిధ్వనించాయి!

నౌక మాత్రం ముందుకు పోతూనే వుంది.

నౌక అంచునుంచి క్రిందకు చూచిన కెప్టెన్ కళ్ళకు ఏం కనపడటంలేదు.

అతని పెదవులమీద క్రూరంగా నవ్వు!

తృప్తిగా వెనక్కు తిరిగాడు.

## 3

సముద్రంలోకి విసిరివేయబడ్డాక ఆ అయిదుగురు నీగ్రో యువకులు ఒక్కసారిగా అడుక్కిపోయారు. యెక్కడి సముద్రం....ఆ లోతులు చూడటం ఎవరికి సాధ్యం.... అదృష్టవశాత్తూ వారందరికీ ఈత చేతవును. అయితే మాత్రం ఎంతదూరమని ఈదగలరు. వారికి అంతులేని ఆశ్చర్యాన్నీ బాధనూ కలిగిస్తున్న అంశం తమని అంత నిర్దాక్షిణ్యంగా సముద్రజలాలకు ఆహుతికమ్మని విసిరేయటం.

ప్రపంచ ప్రజలంతా మానవత్వంతోనూ, సానుభూతితోనూ తమను అర్థం చేసుకోగలరని, తమ పోరాటానికి మద్దతు యివ్వగలరని భావించారేగాని, ఇలాంటి పరిస్థితి ఎదురవ్వగలదని వారు కలలో కూడా ఊహించలేదు. అంతకన్నా తమను తమ ప్రభుత్వానికి అప్పగించినా బాగుండేది. ఆ ఉరికంబాలకు ఆహుతి కావటం జరిగినా తిరిగి మరోసారి ప్రపంచ అభిప్రాయం మార్మోగేది. కానీ ఇలా అనాథల్లా....దిక్కులేని చావు చావటం యెంత దుర్భరం అనుకున్నారు.

అయితే వారి ఊహాలు సొంతం నిజంకావు. తెల్లవారగానే ప్రయాణీకులంతా కెప్టెన్‌ను నిలదీశారు. వారి సంగతి చెప్పమన్నారు. నాకేం తెలియదంటూ బుకా

యించబోయాడు. కానీ వాళ్ళు పూరుకోలేదు. కొంద రయితే గబగబ వెళ్ళి గాలినింపిన ట్యూబ్స్‌ను.. చెక్కల్ని కొన్నిటిని నీళ్ళలోకి విసిరేశాడు.

ఏం లాభం. వాళ్ళనెప్పుడు తోశేశాడు.

ఈపాటికి శవాలుగా మారి ఉంటారు.

కెప్టెన్ దురాగతం సభ్య ప్రపంచానికి తెలిసి పోయింది. దిగ్భ్రాంతితో అందరూ ముక్కుమీద వేలేసు కున్నారు. అతన్ని తీవ్రంగా అసహ్యించుకున్నారు.

ఆ కెప్టెన్ మాతృభూమిలోనే ఓ నీగ్రో యువకుడు అతన్ని కాల్చి తమ జాతి పగ తీర్చుకున్నాడు.

## 4

ఉదయం ఎనిమిదిగంటలవుతోంది.

అప్పటికి ఆరుగంటలనుండి ఈదుతున్నారు అయిదు గురు. వారికి బ్రతుకుమీద ఆశ లేదు. అనంతమైన సముద్రాన్ని చూస్తుంటే వారికి బ్రతికి బయటపడ గలమనే ఆలోచన సైతం రావటంలేదు. అయినా వారు ఈదుతూనే వున్నారు. తుది క్షణందాకా జీవితంకోసం బ్రతుకుతూ పోరాడాలనేది వారి సిద్ధాంతం! యేదో అద్భుతం జరిగితేగాని వారు బ్రతికి బయటపడటం జరగదు. అద్భుతాలు తరచుగా జరగవు.

ఈదుతున్న అయిదుగురిలో ఓ వ్యక్తి బాగా అలిసి పోయాడు. అప్పటికే మిగతావారికీ అతనికి నడుమ దూరం పెరిగింది. ముందున్న వారంతా వెనక్కి తిరిగి చూశారు. తమ సహచరుడు ఈదలేక మెల్లగా బార్లు వేస్తున్నాడు. గబుక్కున వెనక్కి తిరిగి అతని దగ్గర కొచ్చారు.

ఆ యువకుడి కళ్ళు యెర్రగా తయారయినాయి.

అప్పటికే రెండుమూడుసార్లు ఉప్పునీళ్ళు త్రాగాడు. అంతులేని దాహంగా వుంది. పెదవులు తడుపుకుంటు న్నాడు. మరీ ఇంక భరించలేననుకున్నప్పుడు ఆ నీటికి పుక్కిలించి ఊస్తున్నాడు.

"జెర్రీ....మమ్మల్ని పట్టుకో" అన్నారు.

"నో" అరిచాడు జెర్రీ.

"ప్లీజ్" అభ్యర్థించారు.

"ఫ్రెండ్స్. మీరు నాకోసం చూడకండి. మీరు అనంతమైన ఈ సముద్రాన్ని ఈదాలి. మీలో ఒకరైనా బ్రతికి బయటపడాలి. ఎంత దూరమని నన్ను తీసుకెళ్తారు" అన్నాడు జెర్రీ.

"కొంత దూరం తీసుకెళ్తాం. తిరిగి నువ్వు ఈదగలవు."

"లేదు. ఒకసారి ఈదటం ఆపితే తిరిగి ఈదటం సాధ్యంకాదు. దయచేసి మీరు ముందుకు వెళ్ళండి."

"వీల్లేదు. నిన్నిలా ఒంటరిగా మృత్యువుకొదిలి మేం వెళ్ళలేం" వాళ్ళలో ఓ వ్యక్తి అన్నాడు.

జెర్రీ కళ్ళు ఒక్కసారిగా ప్రేమభావంతో నిండి పోయాయి. వెంటనే కఠినంగా మారిపోయాడతను.

"ఐ హేట్ యువర్ బ్లడీ సెంటిమెంట్స్....మీ అందరికీ ఇలాంటి సెంటిమెంట్సున్నప్పుడు విప్లవంలోకి రావాల్సింది కాదు. పెళ్ళిచేసుకొని పిల్లల్ని కంటూ శ్వేత జాతికి శుశ్రూష చేస్తూ బ్రతకాల్సింది. యూ నో బాబీ శాండ్స్ చచ్చిపోయాడు. మన స్నేహితుల్ని ఉరితీసి ఎన్నోరోజులు కావటంలేదు. వారందరితోబాటు మనమూ పోయామా? లేక వారిని రక్షించటానికి మూర్ఖంగా వెళ్ళామా? విప్లవం అంటే ఏమిటనుకున్నారు. అవి వ్యక్తుల్లో నిలిచేవి కావు. ఓ వ్యక్తి పోతే మరొకడు,

ఇంకొకడు, వేలాది జనం పుట్టుకొస్తారు. ఒక వ్యక్తికోసం విప్లవానికి ద్రోహం చెయ్యటం క్షమించరాని నేరం" కఠినంగా అన్నాడు జెర్రీ.

"జెర్రీ" బాధగా మూలిగారు.

"మీ బాధను నేను అర్థం చేసుకోగలను. మనందరమూ కలిసి చావాలనే కోర్కె నెరవేరదు. మన ఆశయాలు మాత్రమే మనల్ని ఐక్యంగా ఉంచగలుగుతాయి. అంతే గాని ఓసారి పోరాటంలో దిగాక, మిగతావన్నీ మనకు అనుకూలంగా ఉంటాయని భావించటానికి వీలులేదు. పోరాటంలో పెళ్ళాం బిడ్డల్ని, తల్లి తండ్రుల్ని కోల్పోయిన వారెందరో వున్నారు. అలాంటి వారందరినీ గుర్తు తెచ్చుకోవాలి. సోదరులారా! కెలవ్! మీరంతా ముందుకు పోండి. ఏదైనా అద్భుతం జరిగి మనలో ఎవరు మిగిలివున్నా అక్కడ వుండే శ్వేత జాతిమీద పోరాటం మొదలు పెట్టండి. మీరు వెళ్ళండి."

వాళ్ళు గుండె దిటవు చేసుకున్నారు.

"వెళుతున్నాం జెర్రీ. మన అమరవీరుల బాటలోనే మేం పయనిస్తాం. మేం బ్రతికుండటం జరిగితే శ్వేతజాతి మీద మన హక్కులకోసం పోరాడుతాం."

"శ్వేతజాతి జాత్యహంకారం" జెర్రీ ఆవేశంగా అరిచాడు.

"నశించాలి"

"విప్లవం."

"వర్థిల్లాలి."

సముద్రంలో చైతన్యం!

"మిత్రులారా వీడ్కోలు" జెర్రీ చేయి ఊపాడు. వారు ముందుకు కదిలిపోయారు. జెర్రీకి నీరసం ఆవ

హిస్తోంది. దూరంగా అతని మిత్రులు ఈదుకుంటూ పోతున్నారు.

జెర్రీ ఇంక ఈదలేననుకున్నాడు. అతని కళ్ళు మండుతున్నాయి. సముద్ర జలాలమీద సూర్యుడి వెలుగులు పడుతున్నాయి. ఆ కిరణాలకు సముద్ర కెరటాలు మెరుస్తున్నాయి.

జెర్రీలో తెలియని భావావేశం.

మాతృభూమీ నీకు వీడ్కోలు! నీగ్రో జాతిలో పుట్టినందుకు నేను బాధపడటంలేదు. పోరాటంలో చచ్చిపోతున్నందుకు అసలే దిగులులేదు. నీగ్రోజాతి మానవజాతికి మచ్చకాదని, వారికి సంస్కృతిలేదని, వారు బానిసల్లానే బ్రతకాలనే వాదనలకు ఈ రోజు ప్రపంచంలో బలంలేదు. అవన్నీ ఖండించబడ్డాయి. ఈ రోజు చరిత్ర గమనంలో అందరితోపాటు నీగ్రోజాతి వారు తమ వంతు మనుగడను సాగిస్తున్నారు. అయితే నా మాతృ భూమిలో ఇంకా వివక్షత సాగించవచ్చు. మాలో చాలామందిని ప్రభుత్వం చంపి వుండవచ్చు. కానీ చరిత్ర పుటల వెనక్కు వెళ్ళిన అనేక మందిలానే ఈ శ్వేతజాతి ప్రభుత్వం నాశనమై తీరుతుంది. దక్షిణాఫ్రికాలో నీగ్రో జాతీయులు తలెత్తి స్వేచ్ఛావాయువులు పీల్చి తీరుతారు. మాతృభూమీ మరోసారి వందనాలర్పిస్తూ....వీడ్కోలు తల్లీ.

## 5

ఈదుతున్న మొటాంగో ఆలోచనలు పరిపరి విధాల పరుగెడుతున్నాయి.

జెర్రీని వదిలి వారు చాలాదూరం వచ్చారు. ఇప్పటికి పదిగంటలనుండి ఈదుతున్నారు.

మొటాంగోను గజ ఈతగాడుగా పేర్కొనవచ్చు. ఓసారి ఇరవై నాలుగు గంటలు వరుసగా ఈది రికార్డు సృష్టించాడు. దృఢమయిన శరీరం, చురుకయిన కళ్ళుకల మొటాంగో కూడా ఈ సాగరంనుండి బయటపడగలమని భావించటంలేదు. అంతటి స్థితిలోనూ వారికి బాధ కలిగించే విషయం, తమ పరిస్థితి ఇలా కావటమే.

ఈదుతున్న మొటాంగో యథాలాపంగా వెనక్కి తిరిగాడు. అంతే.... చివ్వున వెనక్కి తిరిగాడు.

అంతరంగం తీవ్రమైన బాధకు లోనయింది.

“వెళ్ళకు” “వెళ్ళకు” అని మనసు హెచ్చరిస్తోంది.

అయినా బారలు వేసుకుంటూ ముందుకెళ్ళాడు.

అప్పటికే ఆ ప్రాంతమంతా అల్లకల్లోలంగా వుంది.

సొర చేప దాడిచేసింది.

మొటాంగో ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

ఎర్రని రక్తపు చుక్కలు మెల్లగా నీటిమీదకు తేలటం ప్రారంభమయ్యాయి.

నీటిలో కల్లోలం ఆగిపోయింది.

మొటాంగో అదృష్టం .... సొర చేప ఆ యువకుడ్ని లాక్కొని వెళ్ళిపోయింది.

మొటాంగో ముందుకు చూశాడు.

దూరంగా తన మిత్రుడొకడు మాత్రమే కనిపిస్తున్నాడు.

మరో యువకుడు కనిపించటంలేదు.

అతనేమైపోయాడు!

గుండెలు పిండినట్లయింది. తన కళ్ళముందు ముగ్గురు బలయిపోయారు. సొర చేపలు తిరిగే ప్రాంతంనుండి

బయటపడటం అసాధ్యం. అందులోనూ రక్తం వెలువడింది. ఆ వాసనకు దూరంనుండికూడా రాగలవు. పెద్ద బారలు వేసుకుంటూ అతన్ని కలిశాడు.

"ఫ్రెడ్ మనం ఈ ప్రాంతంనుండి త్వరగా వెళ్ళిపోవాలి. లేకుంటే ఈ సొరచేపలకు మనమూ ఆహారమవుతాం."

ఫ్రెడ్ విరక్తిగా నవ్వాడు.

"మొటాంగో, సొరచేపలకు కాకుంటే మరోవాటికి మనం ఆహుతికాకుండా వుండగలమని నమ్ముతున్నావా?"

"ఖచ్చితంగా."

"నీ విశ్వాసం నాకు నవ్వు తెప్పిస్తోంది."

"మన ఉద్యమం.... ఆశయాలూ నవ్వు తెప్పించటం లేదా ఫ్రెడ్."

"మొటాంగో నా నిజాయితీని శంకించటం దారుణం."

"లేదు ఫ్రెడ్. ఆ అర్థంలో నిన్నడగటంలేదు. సముద్రాన్ని మన శత్రువుతో పోల్చుకో. మన శత్రువు అంత బలంగా వున్నాడు. మన ఉద్యమం ఆ బలంతో పోల్చుకుంటే బాల్యదశలో వుంది. అయినా మన పోరాటం విజయవంతం కాగలదనే మనం నమ్ముతున్నాం. ఆ పోరాటంలో మనవాళ్ళెందరినో కోల్పోయాం. అయినా మన పోరాటం ఆగలేదు.... ఇప్పుడూ అంతే.... ఆ భావమే మనల్ని సాగరాన్ని ఈదిస్తుంది. మనకిప్పుడు కావాల్సింది మంచినీరూ.... ఆహారం కాదు, ఆత్మవిశ్వాసం."

ఫ్రెడ్ చలించిపోయాడు.

"మొటాంగో నీ మాటలు నాలో క్రొత్త ఊపిరి పోశాయి. నిజమే, మనం ఈ సముద్రాన్ని, సొరచేపల్ని జయించితీరాలి. నాకు నమ్మకం ఇప్పుడు కుదిరింది. మరో

రెండురోజులు ఈదగలను."

"గుడ్ .... ఫ్రెడ్ నీ దగ్గరేమైనా ఆయుధం వుందా?"

"మొలలో చిన్న బాకు వుంది మొటాంగో."

"చాలు. ఆ మాత్రం ఆధారం వుంటే మనం ఆత్మ రక్షణ చేసుకోగలం. ఎందుకయినా మంచిది—అది అందు బాటులోకి తెచ్చుకో. యే క్షణం యెలాంటి అవసరం కలుగుతుందో."

"అలాగే మొటాంగో. నీ దగ్గరేముంది."

"నా దగ్గర అంతకంటే ఏం లేవు. మన బ్యాగ్‌లో దాచుకున్న అమ్యూనిషన్ .... కొద్దిపాటి డబ్బు నాకలోనే వుండిపోయాయి."

"ఆ క్రొవెన్ ఎంత నిర్దయుడు."

"ఫ్రెడ్ ప్రపంచమంతటి జనంలో అలాంటివా రుంటారు. ప్రపంచంలోని జనమంతా ఎలా దుర్మార్గులు కారో, అలాగే ప్రపంచంలోని మనుషులంతా మంచి వారూ కాదు."

"మనం మానవ జీవితంలోని వివిధ కోణాల్ని ఇలా సముద్రంలో చర్చించుకోవటం వింతగా వుంది కదూ."

"అవును. మనకు నాలుగు ప్రక్కలా నీళ్ళున్నాయి. దాహం మేతీరంది" అంటూ మొటాంగో ఒక్క గుక్క త్రాగి పుక్కిలించి ఊశాడు.

ఆ తర్వాత వారిద్దరూ మాట్లాడుకోలేదు. వారి దృష్టి అంతా యెంత త్వరగా ఆ ప్రాంతంనుండి బయటపడ దామా అన్నట్లుంది. వేగంగా ముందుకు సాగిపోయారు.

అయితే ప్రమాదం వారి వెంట నడిచి వస్తోందని వారికి తెలియదు.

సరిగ్గా గంట తర్వాత ....

"మొటాంగో" అరిచాడు ఫ్రెడ్.

అప్రయత్నంగా మొటాంగో చెయ్యి బాకు మీద పడింది.

"ఫ్రెడ్."

"బీ రెడీ" అంటూనే నీళ్ళలోకి చటుక్కున మునిగాడు. సార చేప వస్తున్న విసురుకు నీళ్ళు మొటాంగోను ప్రక్కకు నెట్టాయి. అంతలోనే తేరుకొని బారలు వేసుకుంటూ వచ్చాడు. చేతిలో బాకు పదునుగా వుంది.

ఫ్రెడ్ కు సార చేప తాలూకు శరీరం కనిపిస్తోంది ఆదే భాగమో కూడా అర్థంకావటంలేదు. చేతిలో బాకును కసిగా గుచ్చాడు. చిమ్ముతూ రక్తం బయటకు వచ్చింది— నీళ్ళలో కలిసిపోతూ. సార చేప బాధగా కదలబోయింది ఆదే క్షణం మొటాంగో చేతిలోని బాకు పొట్టక ప్రక్కగా దిగింది. అంతటితో ఊరుకోక బలంగా చీరేశాడు. రక్తం వెల్లువలా బయటకు తన్నింది.

చేప గిలగిలలాడిపోయింది. వారికి దాన్ని చూస్తున్న కొద్దీ తమ అనుచరుడు గుర్తొచ్చి మహోద్రేకం కలిగింది. ఇరువైపులా దాన్నెదుర్కొంటూ అందినచోటల్లా పొడవటం ప్రారంభించారు. శరీరంనుండి ధారాళంగా రక్తం కారిపోతుండటంతో దాని శక్తి క్రమంగా క్షీణించిపోసాగింది. ఇంక వుంటే తన ప్రాణాలు పోగలవని భావించింది. వారి నెదుర్కొనే ప్రయత్నం మాని గిర్రున వెనక్కు తిరిగింది. ముందుకు దూసుకుపోయింది. నీళ్ళు ఎర్రగా మారిపోతున్నాయి. ఆయాసంగా నీటిమీదకు చేరుకున్నారిద్దరూ.

"ఫ్రెడ్ నీకేమైనా గాయాలు తగిలాయా?"

"అదృష్టవశాత్తూ లేవు మొటాంగో. నీకేమైనా."

"నాకూ అంతే."

"సముద్రం ఎర్రబడుతోంది మాశావా."

"ప్రపంచంలో యెక్కడో ఎర్రసముద్రం వుందని నేను విన్నాను."

"ఇదీ మన పాలిటి ఎర్రసముద్రమే!"

"ఈ సొరచేప రక్తానికి మరిన్ని రావుకదా."

"లేదు. ఈ ప్రాంతాల్లో సొరచేపలు అంతగా సంచరించవు. బహుశా ఇదొక్కటే ఉండుంటుంది. మన ఇంత్రుడ్ని పొట్టన పెట్టుకొని వచ్చింది. సొరచేపలు యెక్కువగా తిరిగితే ఇప్పటికే మనమీద దాడిజరిగేది."

"కావచ్చు" అన్నాడు ఫ్రెడ్.

వారి శరీరాలు ఉప్పుమూలంగా గట్టిపడిపోయినట్లున్నాయి. వారి వెంట్రుకలు బిగుసుకొని వున్నాయి.

"దాహంగా వుంది మొటాంగో."

"నాకూ అలానే వుంది. ఏం చెయ్యగలం."

ఇద్దరూ నవ్వుకున్నారు.

# 6

"మొటాంగో నా శక్తి క్షీణిస్తోంది. అంతకంటే యెక్కువగా దాహంగా వుంది."

"ఫ్రెడ్ నిరాశపడకు. మనకు ఏదో ఒక ఆధారం దొరుకుతుందని నా మనసు చెబుతోంది."

"నాకు నమ్మకం కలగటంలేదు మొటాంగో. నన్ను క్షమించు."

"ప్లీజ్ ఫ్రెడ్ నిరాశపడకు" అభ్యర్థించాడు మొటాంగో.

అంతకంటే ఏం చేయాలో అర్థంకావటంలేదు. అసలా ప్రాంతం ఏదో కూడా అర్థంకావటంలేదు! యే తీరప్రాంత

మయినా అయితే ఆయా దేశాల జాలర్లు చిన్న పడవుల మీద చేపల వేటకు వస్తుంటారు. వారికి ఎలాంటి నౌకలు కూడా కనపడటంలేదు.

ఎటు చూసినా నీళ్ళు!

“మొటాంగో .... ప్లీజ్ నువ్వు ముందుకెళ్ళు. నేను ఈదలేను” ఫ్రెడ్ వేగం క్రమంగా తగ్గిపోయింది.

“నో....నువ్వు నన్ను పట్టుకో. నీలో అలుపుతీరాక తిరిగి ముందుకు పోదాం.”

“ఎంత దూరం వెళ్ళగలం. మొటాంగో నాకోసం నువ్వాగకు.”

“నేనలాంటి మాటలు వినదలుచుకోలేదు. ఇంతవరకూ నువ్వు తోడుగా వున్నావు కాబట్టి, ఇంత దూరం రాగలిగాను. ఒంటరిగా అయితే నాలోనూ నిరాశ పేరుకు పోయేది. నేనూ ఈ నీటిలోనే సమాధి అవుతాను. ఫ్రెడ్ నా మాటకు ఎదురు చెప్పకు. మనం కలిసే చావాలనేది నా ఆఖరి కోర్కె.”

ఫ్రెడ్ మాట్లాడలేకపోయాడు.

మొటాంగో ఫ్రెడ్ దగ్గర కొచ్చాడు.

ఇప్పుడు ఫ్రెడ్‌కు కొంత ఊపిరి చిక్కింది.

మొటాంగోకు మరింత భారం అధికమయ్యింది. అయినాసరే సంతోషంగా ముందుకు పోతూనే వున్నాడు.

రోమన్ సామ్రాజ్యంలో బానిసలిరువుర్ని యెదురెదురుగా ఉంచేవారు. వారి కండలు....పిక్కలు.... అత్యంత బలంగా వుండేవి. నల్లటి శిల్పాల్లా వుండేవారు. వారు పట్టుకున్న బరిసె మొనలెంత పదునుగా వుండేవో వారంత చురుకుగా వుండేవారు. నీగ్రో జాతీయులకు మొదటినుండి జీవన్మరణ సమస్య. వారి చరిత్ర అంత

రక్తక్షయమయింది. రోమన్ పౌరులు ఆ క్రీడల్ని చూడటానికి ఎంతో ఉత్సాహపడేవారు. రంగంలో వుండేది ఇద్దరు. ఇరువురూ బానిసలే. ఎవరో ఒకరి మరణంతో ఆ క్రీడ ముగిసేది.

వారిరువురు ఎదురెదురుగా.. బ్రతుకుకోసం పోరాటం. ఒకరు బ్రతకాలంటే మరొకరు చావాలి. ఓ వేళ ఈ పోరాటంలో గెలిచినా అది తాత్కాలికమే. మరో పోరాటంలో ఇంకో బలవంతుడి చేతిలో హతంకాక తప్పదు.

వారు జీవించటానికి పడే ఆ రా ట ం చూసేవారికి ఆనందాన్ని కలిగించేది. వారి కసి ఎవరిమీదో! అయినా యాంత్రికంగా కదిలేవారు. వాళ్ళ చేతులు కదిలేవి. ఆయుధాలు కదిలేవి. శరీరాలను చీల్చుకుంటూ....రక్తపు ధారలతో.... వారిద్దరూ పోరాడుతుండేవారు. యెవరో ఒకరు కూలిపోయేవారు.

హర్ష ధ్వానాలు.

వికృతానందం.

నిర్లిప్తంగా కూలిపోయిన తన సోదరుడివంక చూపులు.

అమెరికాలో మరింకొంత భిన్నంగా వుండేది. ఆఫ్రికా నుండి సైతం మనుషుల్ని తెచ్చి బానిసలుగా అమ్మేవారు. వారెప్పుడైనా పారిపోవటానికి ప్రయత్నిస్తే అంగ విచ్ఛేదనం చేసేవారు.

తరతరాల బానిస చరిత్రలన్నీ హృదయవిదారకం.

మానవత్వానికి తీరని మచ్చలు.

వారి జీవితాల్లో వెలుగు ప్రసరింపచేయటానికి యెన్ని పరిమితుల్లోనయినా కృషిచేసిన మహనీయులు తుపాకి తూటలకు గురి అయ్యారు. అయినా ఆ అవశేషాలు మిగిలే

వున్నాయి. ఆ పోరాటాలు సాగుతూనే ఉన్నాయి.

మొటాంగో వాటికే ప్రతినిధిలా వున్నాడు.

అతనికి అంతులేని దాహంగా వుంది. వెంటనే మంచి నీళ్ళు తాగకపోతే ప్రాణం పోతుందేమోననుకున్నాడు. ఒక్కసారి బలవంతంగా గుక్కెడు నీళ్ళు మింగాడు. ఆకలి కరకరలాడ్తోంది. కడుపులోకి వట్టి నీళ్ళు మాత్రమే పోతుండటంతో అంతులేని నొప్పి మొదలయింది. అది ఆకలి బాధ.

ఆకలి బాధను తట్టుకోవటం వారికి అలవాటే.

అజ్ఞాతవాసంలో వారికి రోజుల తరబడి ఆహారం వుండేదికాదు. ఆకులూ, అలములూ తిని రోజులు గడిపేసుండేవారు. ఆ అనుభవాలే ఇరవై గంటల నుండి మొటాంగోనూ అతని సహచరుడ్ని ఈదేట్లు చేసింది.

మొటాంగో కళ్ళు చిట్లించుకు చూశాడు.

ఏదో వస్తువు కొట్టుకొస్తున్నట్లుగా వుంది.

కళ్ళలో ఆశ చిగురించింది.

"ఫ్రెడ్ అటు చూడు."

"ఏమయింది" కంగారుగా అన్నాడు.

అతనికిప్పుడు ప్రాణాలు పణంగా పెట్టడం మినహాయించి, ఎలాంటి ప్రతిఘటన చేసే ఓపిక లేదు.

"ఏదో చెక్కపలక కొట్టుకొస్తున్నట్టుంది."

"చెక్కపలకా" అతనిలో ఉత్సాహం తొంగి చూసింది.

"నువ్వు మెల్లగా ఈదుతుండు. నేను చూసొస్తాను."

"అది వస్తుందిగా."

"అంతవరకు వేచి వుండలేం ఫ్రెడ్."

"వెళ్ళిరా మొటాంగో."

మొటాంగో బారలు వేసుకుంటూ సాగిపోయాడు. వారి అదృష్టం బాగుంది. బలమైన చెక్కపలక. దాని మీద ఒకరు పడుకోవచ్చు కూడా. మొటాంగో దాన్ని చూడగానే సంతోషం పట్టలేక బిగ్గరగా అరిచాడు. ఆ స్వరంలోని ఆనందాన్ని గుర్తించాక ఫ్రెడ్‌లో ఉత్సాహం కలిగింది. తనకు తెలియకుండానే వేగంగా ఈదుకుంటూ మొటాంగో దగ్గరకెళ్ళాడు.

"ఇప్పుడు మనం ప్రపంచాన్ని కలుస్తాం ఫ్రెడ్."

"మొటాంగో....రియల్లీ నీ ఆత్మవిశ్వాసమే మనల్ని ఇప్పటిదాకా బ్రతికించింది."

"ఫ్రెడ్. మనం గమ్యం చేరగలమనే నమ్మకం నాకుంది. తిండి లేకుండా ఇంకా మనం కొంతకాలం బతకొచ్చు."

"మొటాంగో యిప్పుడు నాకు చాలా ఆనందంగా వుంది."

"వెల్. నువ్వు చెక్కమీదకు చేరిపో. నేను పట్టుకొని వస్తాను. నాకూ కొంతసేపు రెస్టు దొరుకుతుంది."

"అవును. అలసట తీరాక, నువ్వూ పడుకుందుగాని" అన్నాడు ఫ్రెడ్.

చీకట్లు కమ్ముకొస్తున్నాయి.

'ప్రకృతిలోని ఈ అంశాల్ని, అనుభూతుల్ని అనుభవించటం ఎంత యాదృచ్ఛికం' అనుకున్నాడు మొటాంగో.

సముద్రంలో పలక మెల్లగా కదులుతోంది.

సందర్భమేదైనా అదో అసాధారణ అత్యద్భుత దృశ్యం.

# 7

నోరు పిడచకట్టుకు పోతుంటే ఆకాశంవంక చూశాడు మొటాంగో.

బల్లమీద ఫ్రెడ్ ఈ ప్రపంచాన్ని మరచి నిద్రపోతున్నాడు. అప్పుడప్పుడు అలలు అతన్ని తడుపుతున్నాయి.

మబ్బులు పట్టుకొస్తున్నాయి. వాన కురిస్తే బాగుండు ననుకున్నాడు మొటాంగో. గాలి బాగా వీస్తే మొదటికే మోసం రావచ్చు. అయినా వర్షం రావటాన్నే ఆహ్వానించాడు మొటాంగో.

అతను కన్నార్పకుండా, ఆకాశంవంక, సముద్రంవంక చూస్తున్నాడు. నల్లటి మేఘాలు ప్రళయంలా విరుచుకు పడుతున్నట్లున్నాయి. సముద్రమంతా చీకటి ఆవరించు కొస్తోంది. ఆ మేఘాలు సముద్రంలో ఐక్యం అయి మహా ప్రళయాన్ని సృష్టించబోతున్నాయా అన్నట్లున్నాయి. అవన్నీ దూరంగా సముద్రంలోకి జారిపోతున్నాయా అన్నట్లున్నాయి.

వాటివంకే చూస్తున్నాడు.

సన్నగా చినుకులు మొదలయినాయి.

"ఫ్రెడ్ .... ఫ్రెడ్" కదిపాడు.

ఉలిక్కిపడి లేచాడు.

"ఏమయింది మొటాంగో."

"వర్షం.... వర్షమొస్తోంది."

"అయితే."

"అయితే ఏమిటి, దోసిటితో పట్టుకొని తాగు ఫ్రెడ్ ఆ నీళ్ళు తియ్యగా వుంటాయి."

"మంచినీళ్ళు" ఆనందంగా దోసిలి పట్టాడు.

సన్నగా చినుకులు పడుతున్నాయి. దోసిలిపట్టి త్రాగేంతగా కాదు.

ఇద్దరూ నోరు తెరిచారు.

ఒక్కో చుక్క నోటిలో పడుతుంటే అంతులేని తన్మయత్వం కలుగుతోంది.

వాన కొంచెం జోరుగా కురవటం ఆరంభమయింది.

ఇప్పుడు దోసిట్లో కొన్ని నీళ్ళు నిలిచాయి.

ఆవురావురుమంటూ వాటిని త్రాగారు.

దాహం తీరుతున్నట్లులేదు. మరలా....మరలా త్రాగుతున్నారు.

ఇద్దరూ నిలువెల్లా తడిసిపోతున్నారు.

నిండా మునిగిన వారికి చలేమిటి!

తమ వంటినంటిన ఉప్పు లవణాల్ని కడుగుతున్నట్లుంది ఆ వాన నీరు.

మంచినీళ్ళు త్రాగాక వారిలో నూతనోత్సాహం వచ్చినట్లయింది.

వాళ్ళు సముద్రంలోకి త్రోయబడి ఎంత కాలమయిందో కూడా వారికి తెలియదు. దాహం తీర్చుకున్నాక వారు కొంచెం సేదతీరారు.

"ఆకలి బాధ తీరేలా కన్పించటంలేదు" అన్నాడు ఫ్రెడ్.

"అవును ఫ్రెడ్. అడవుల్లో అయితే ఏదో ఒకటి దొరుకుతుంది. కానీ సముద్రంలో ఇలా వుంటే ఏం దొరకదు. పడవల్లో అయితే చేపల్ని పట్టుకొని కాల్చుకు తినొచ్చు."

"ఈ ఆకలిని భరించగలమంటావా."

"ఫ్రెడ్, మన బాబీకాండ్స్ ఏభై రోజులు ఏం

తీసుకోకుండా బ్రతికాడు."

"అది జెలుగోడల నడుమ. కానీ ఈ సముద్ర గాలికి ఆకలి ఎక్కువవుతుంది. పైగా మనం శ్రమిస్తున్నాము. మొటాంగో."

"నిజమే ఫ్రెడ్. అయినా ఏం చెద్దాం చెప్పు."

"ఏం చేద్దాం మొటాంగో. అంతగా ఆకలి భరించలేకపోతే ఈ చెక్కను చెరోముూల తిందాం."

"గుడ్ జోక్ ఫ్రెడ్" అభినందించాడు మొటాంగో.

ఫ్రెడ్ అభిమానంగా చూశాడు మొటాంగో వంక.

మొత్తంగా ఈ విజయానికి కారణం మొటాంగో ఆత్మవిశ్వాసంతో కూడిన కృషి. తానయితే నిరాశతో ఎప్పుడో ఈదటం తగ్గించేవాడు. ఆ నీళ్ళు త్రాగి...త్రాగి తాను ఓ కళేబరంలా తయారయ్యేవాడు.

సముద్రంలో తనసు ఏ చేపలో పీక్కు తినగా మిగిలిన కట్టె ఏ తీరానికో కొట్టుకుపోయేది.

ఇప్పుడు తాను ప్రశాంతగా కబుర్లు చెబుతున్నాడు. తాము బయటపడగలమనే ఆలోచనే గొప్పది. సాహసంతో కూడుకున్నదీనూ.

అత్యంత పేదరికంలో పుట్టిన మొటాంగో క్రమక్రమంగా నాయకత్వ స్థానాని కెదిగాడు. అతను మొత్తంగా ప్రపంచ దేశాల రాజకీయాల గురించి వివరిస్తుండేవాడు. మిగతా దేశాల్లోని వ్యక్తుల్తో, పార్టీలతో అతనికి సంబంధాలుండేవి. ఎప్పటికప్పుడు వారికి వారి నుండి సలహాలు అందుతుండేవి.

మొటాంగో నాయకత్వంలో తమను పంపించటానికి కారణం అదే. అతను మొత్తంగా ప్రపంచ ప్రజానీకపు అభిప్రాయాన్ని బలంగా ప్రసరింప చేయగలడనే పార్టీ

అతన్ని ఎంపిక చేసింది.

మొటాంగో రాజకీయంగానే కాకుండా శారీరకంగా కూడా అసమాన బలశాలి. చిన్నప్పటినుండి కాయ కష్టంతో ఆ శరీరం గట్టిపడింది. గుర్రపు స్వారీ.... అడవుల్లో ప్రయాణం.... ఈతకొట్టడం.... ఒక టేమిటి అన్నింటిలోనూ అతనికి ప్రవేశముంది.

దక్షిణాఫ్రికా ప్రభుత్వం అత్యంత ప్రమాదకర వ్యక్తులుగా భావించిన వారిలో మొటాంగో ఒకడు.

అతన్ని బంధించటానికి ఎందరినో చిత్రహింసలకు గురిచేశారు. అయినా ఎవరూ ఆ రహస్యాన్ని బయట పెట్టలేదు.

అతన్ని సజీవంగాగానీ నిర్జీవంగా గాని ఎవరు తెచ్చినా వారికి గొప్ప బహుమతి ప్రకటించింది ప్రభుత్వం.

అలాంటి మొటాంగో తన ముందున్నాడని కెప్టెన్‌కు తెలిస్తే ఖచ్చితంగా ఏదో విధంగా ప్రభుత్వానికి అప్పగించటానికి ప్రయత్నించేవాడు. వాడికి నీగ్రోలమీదున్న అసహ్యమే కాని. ఆ దేశంలో జరుగుతున్న విషయాలు తెలియవు.

లేకుంటే వాడి వికృతరూపం మరో రకంగా వుండేది.

"ఏమిటి ఫ్రెడ్ ఆలోచిస్తున్నావు."

"ఏంలేదు మొటాంగో. అమ్మవాళ్ళు గుర్తొచ్చారు."

మొటాంగో మాట్లాడలేదు.

"మొటాంగో నువ్వు బయటపడితే ... నా తల్లికి నా తుది నమస్కారాలు అందించు."

"ఫ్రెడ్. ఈ సముద్ర జలాల్లో ఈదటంకన్నా నీ మాటలే నాకు బాధాకరంగా వున్నాయి."

"వాస్తవాలు బాధాకరంగానే వుంటాయి. మనమేం

చెయ్యగలం."

"ఫ్రెడ్ నువ్వెందుకో చావు గురించే ఆలోచిస్తున్నావు."

"మృత్యు గ్రహంలోకి వెళ్ళాక మరి దేన్ని గురించి ఆలోచించాలంటావు."

"మన ఆశయాల్ని మరిచావా."

"మరిచిపోవటం ఏమిటి మొటాంగో. మన ఉద్యమాన్ని నిర్దయగా అణిచివేశారు."

"చరిత్రలో ప్రతి అపజయం తర్వాత విజయం వుంది ఫ్రెడ్."

"ఏమైనా నాకు చాలా నిరాశగా వుంది."

"అది సహజమే. వాటన్నింటిని మనం అధిగమించాలి."

"ప్రయత్నిస్తాను" అన్నాడు ఫ్రెడ్.

కొంచెం సేపు నిశ్శబ్దం.

"మొటాంగో కొంచెంసేపు ఇలా వచ్చి దీనిమీద విశ్రాంతి తీసుకో."

"అలాగే ఫ్రెడ్" అన్నాడు మొటాంగో బల్లపైకి చేరుతూ.

## 8

మధ్య మధ్య ఉలిక్కిపడి లేస్తున్నా, వేడికిరణాలు ముఖంమీద పడుతుంటే మెలకువ వచ్చింది మొటాంగోకి. చెక్క నీటిమీద వాలుగా, వేగంగా ప్రయాణం చేస్తూంది. కళ్ళు విప్పుకుంటూ "ఫ్రెడ్" అంటూ లేచాడు.

సమాధానం లేదు.

అప్పుడు గమనించాడు.

తనను ఒంటరిగా మోసుకెళ్తోంది బల్ల చెక్క.

మొటాంగో గుండెల వేగం హెచ్చింది.

నలువైపులా చూశాడు.

సముద్ర కెరటాలు కనపడుతున్నాయి.

అకస్మాత్తుగా గొంతు చించుకు అరిచాడు.

"ఫ్రెడ్....ఫ్రెడ్....ఫ్రెడ్."

ఆ ప్రకృతిలో తిరిగి ఆ శబ్దాలు ప్రతిధ్వనించాయి.

ఏం జరిగింది? ఫ్రెడ్ ఏమయిపోయాడు? ఏ జలచరం బారిన పడ్డాడు? తనెలా మిగిలాడు? ఫ్రెడ్ తననెందుకు లేపలేదు? అన్నీ ప్రశ్నలే! పిచ్చెక్కేటట్లుంది!

"ఫ్రెడ్....ఫ్రెడ్....ఫ్రెడ్" పిచ్చెక్కిన వాడిలా అరిచాడు.

ఎలాంటి జవాబు రాలేదు.

గొంతెత్తి బిగ్గరగా ఏడ్చాడు.

"వెళ్ళిపోయారు మీరంతా నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళిపోయారు. నేను ఏకాకినయిపోయాను."

వెక్కిళ్ళతో ఏడుస్తున్నాడు మొటాంగో హృదయ విదారంగా.

ప్రకృతి గంభీరంగా వుంది.

అలలు లేచి పడుతున్నాయి.

చెక్క పలక వేగంగా వెళుతూనే వుంది.

సూర్యకిరణాలు ప్రసరిస్తూనే వున్నాయి.

పోరాటమా నువ్వెంత నిర్దయురాలివే!

ఆ పుల్ని ఒకటీసుకుంటావ్....రక్తం కోరుతావ్....త్యాగాలు కోరుతావు....అనుకోని పరిస్థితుల్ని సృష్టిస్తావ్!

పరీక్షిస్తావ్! అహా! నువ్వెంత కఠినురాలివే.

మొటాంగో పిడికిలి బిగుసుకుంది.

"శ్వేత జాతి జాత్యహంకారం."

"నశించాలి."

"జోహార్ అమర వీరులకి."

"జోహార్ వీర జాతికి."

"మానవత్వం వర్ధిల్లాలి."

మొటాంగో కంఠంనుండి పిడుగులు వస్తున్నాయా అన్నట్లుంది. సముద్రం కంపించిపోతుందా అన్నట్లుంది.

చెక్కబల్ల ప్రయాణం చేస్తోంది.

అరిచి.... అరిచి. .. ఏడ్చి. ... ఏడ్చి..... సొమ్మసిల్లి పడిపోయాడు.

నీటి తెమ్మెరలు అతన్ని తడుపుతున్నాయి!

కళ్ళు ఆకాశంలోకి తీక్షణంగా చూస్తున్నాయి.

మొటాంగోకి ఆ తర్వాత ఈ ప్రపంచం గురించే తెలియదు.

* * *

సముద్రతీరంలో కొట్టుకొచ్చిన మొటాంగో శరీరాన్ని తడుపుతూ వెనక్కు వెళుతున్నాయి కెరటాలు.

సూర్యకిరణాలు సూటిగా ముఖంమీద పడుతుంటే మెల్లగా కదిలాడు. సముద్రపు హోరు వినిపిస్తోంది. చల్లటిగాలి అనుభవంలోకి వచ్చింది. మొటాంగోకు ఏం జరిగిందో తెలియదు. తను ఎక్కడున్నాడో అర్థం కావటం లేదు. అతి ప్రయత్నంమీద ప్రక్కకు తిరిగాడు.

దూరంగా చెట్లు కనపడుతున్నాయి. పచ్చదనాన్ని చూడగానే ఒక్కసారి ఓపిక వచ్చింది. బలవంతంగా లేచాడు.

అడుగులు ముందుకు పడుతున్నాయి.

"ప్రపంచాన్ని జయించావు నేస్తం" ఫ్రెడ్ చెవిలో చెవిలో చెబుతున్నట్లుంది.

"విదేశాలనుండి మీరు పోరాటం జరపాలి" చెవిలో ఏవేవో ధ్వనులు.

అవే మొటాంగోను నడిపిస్తున్నాయి.

దూరంగా చెట్లకు కనపడుతున్న ఫలాన్ని చూశాడు.

అదే దేశమో! ఏ ప్రాంతమో!

అయినా మొటాంగో ముందుకే నడుస్తున్నాడు.

"పోరాటం అస్తమించదు" పిడికిలి బిగించాడు ఎర్ర బారిన నేత్రాలతో.

—:అ యి పో యిం ది:—

# పాముల పుట్ట

## బి. రాజేశ్వరి

పరుగెడుతున్న ట్రెయిన్ రాడ్ పట్టుకొని పెట్టెలోకి ఎక్కేశాడు సుబ్బారావు. కాస్తంతలో ప్రమాదం తప్పింది. లేకుంటే అతని శరీరం రైలు చక్రాల కిందపడి తునాతునకలయిపోయుండేది. అతన్ని పడకుండా పట్టుకున్న యువకుడు కూడా దాదాపు సుబ్బారావు వయసువాడే!

"ఏమిటీ దూకుడు? బతకాలని లేదా?" చనువుగా మందలించాడతను.

"థాంక్సండీ! బతకాలనే ఈ ట్రెయిన్ ఎక్కాను" అన్నాడు సుబ్బారావు.

"మంచివాడవే, ఇంతకీ ఏ వూరు?"

"ఇదే వూరు వెళ్తుందండీ?"

"హైదరాబాదు."

"నేనూ అక్కడికే ననుకోండి!"

"అదేమిటి? అనుకోవట మేమిటి? ఇది కావాలని

చేసే ప్రయాణం కాదనుకుంటాను!"

"అలాగే, కాదనుకోండి, నాకేం అభ్యంతరం లేదు!"

ఆ యువకుడికి సుబ్బారావు ధోరణి విచిత్రంగా తోచింది. "ఇంతకీ మీరెవరు? ఎక్కడ్నుంచి వస్తున్నారు? ఇంత అర్జంటుగా ఎందుకీ ట్రెయిన్ ఎక్కారు!" అడిగాడు.

"లోపల కూచుని మాట్లాడుకుందామండీ?"

"లోపల కూచోవటానిక్కాదు, నించోటానిక్కూడా యెక్కడా జాగాలేదు. అందుకే నేను గుమ్మం దగ్గర జపం చేస్తున్నాను!"

"పోనీలెండి, చోటు లేకపోవటమే మంచిదయింది."

"అదేం?"

"లోపల కూచుని వుంటే నన్ను రక్షించగలిగేవారా! నేను బతికే వాడినా?"

"ఓహో, అదా! మీరు అమాయకులనుకున్నాను, ఘటికులే!"

"అమాయకుడి నేనండి బాబూ! లేకపోతే నా కిష్టం లేని పెళ్ళి మా మామయ్య చేయగలిగేవాడేనా?"

"ఇంట్రెస్టింగ్! ఇష్టంలేని పెళ్ళి తప్పించుకోవటానికి ఆడపిల్లలా పారిపోవటమెందుకు? ఇష్టంలేదని ధైర్యంగా తెగేసి చెప్పి తప్పించుకోవాలిగాని!"

"తప్పించుకునే అవకాశం దొరక్కపోతే....?"

"ఎందుకు దొరకదు? ఆడపిల్లవు కాదుగా!"

"ఆడపిల్లనైతే ఆత్మహత్య చేసుకుని వుండేవాడ్ని!"

"అంత ఆపదేం వచ్చి పడింది? నాకు చెప్పు, నా చేతనైన సహాయం చేస్తాను....అన్నట్టు, మిమ్మల్ని 'నిన్ను' అనేస్తున్నాను, ఏమనుకోవద్దు!"

"అనుకోను!"

"దట్స్ గుడ్, చెప్పు!"

"జనం వింటారేమో?"

"అందరూ యెవరి గొడవల్లో వాళ్ళున్నారు. మన సోది పట్టించుకునేంత తీరిక ఎవరికీ లేదు!"

"అదుగో, ఆ పక్కనున్నాయన మనవంకే పరిశీలనగా చూస్తున్నాడు!"

"మైడియర్ ఫ్రెండ్, నువ్విలాంటి అనుమానాలేం పెట్టుకోవద్దు....ఊఁ, మొదలెట్టు!" అంటూ ప్రోత్సహించాడు.

"అలాగేనండీ, యింతకీ మీ పేరు?"

"ప్రసాద్. నన్ను మీరు అనవసక్కర్లేదు. నాలాగే నువ్వు అని పిలు, ఫర్లేదు."

"అలాగే....మీరు—నువ్వు ఏం చేస్తూంటావు?"

"బిజినెస్!"

"బిజినెస్ అంటే....?"

"ఎక్స్పోర్ట్స్ అండ్ యింపోర్ట్స్!"

"ఏ వూరు?"

"హైదరాబాద్‌లోనే."

"బిజినెస్ హైద్రాబాద్ అనుకోండి, అసలు నీ స్వస్థలం....?"

"పెంటపాడు!"

"అదెక్కడుంది?"

"తాడేపల్లిగూడేనికి నాలుగు కిలోమీటర్లు."

"ఓహో, అలాగా!"

"నన్ను యింటర్వ్యూ చేయ్యటమయిందిగా, ఇక నా మీద అనుమానాలేం లేనట్టేగా....?"

"ఛ....ఛ....అనుమానమా? అదేం లేదు. స్నేహం సుఖం దామనడిగాను."

"దట్స్ గుడ్! ఇప్పుడు స్నేహితులమయిపోయాం దా! ఇక అన్ని సంగతులు ఫ్రీగా మాట్లాడేసు ందాం."

"అలాగే! అసలు జరిగిందేమిటంటే... !"

## 2

"అబ్బాయ్, సుబ్బారావు, మీ అమ్మతో అంతా ాట్లాడేశానోయ్, ముహూర్తం యెప్పుడు పెట్టు ందాం?" అడిగాడు వెంకట్రామయ్య.

"దేనికి మామయ్యా....?" అడిగాడు సుబ్బారావు.

"దేనికంటావేమిటోయ్? నీ పెళ్ళికి...."

"నా పెళ్ళికేం తొందర మామయ్యా?"

"అదే....అమ్మాయి పెళ్ళికి తొందరేకదా!"

"ఓ, హనుమాయమ్మ సంగతా? అవును మామయ్యా ొందరగా చేసెయ్యాలి మరి! అబ్బాయిని చూశావా?"

"వేరే ఎవరో ఎందుకోయ్? నువ్వున్నావుగా?"

"నేనా....? ఏమిటి మామయ్యా నువ్వనేది?"

"ఇా తేముంది? మొదట్నుంచీ అనుకుంటున్నదేగా! ా అనూ పుట్టినప్పుడే నీ పెళ్ళాం అనుకున్నాం. ఈ ంగతి నిన్ననే మీ అమ్మతో మాట్లాడేశాను! ఆమె ప్పుకుంది!"

"నాకుద్యోగం లేదుగా! ఉద్యోగం సంపాయించు నేవరకు పెళ్ళి చేసుకోను."

"ఓస్, అదే కదా నీ అభ్యంతరం? నాకు అనూ క్కగానొక్క కూతురు. నా ఆస్తంతా అమ్మాయిదే. ాగే నా ఆస్తిపై నీకూ హక్కుంటుంది?!"

"స్వతంత్రంగా బతకాలనుంది మామయ్యా!"

"అలాగే! ఎవరు కాదన్నారు? నీకెలాంటి ఉజ్జోగం కావాలో చెప్పు. హైదరాబాదెళ్ళి మినిష్టర్‌తో మాట్లాడి వేయించేస్తాను. ఆర్డరు కాగితం పట్టుకుని మరీ వస్తాను."

"రికమెండేషన్ మీదొచ్చే ఉద్యోగం వద్దు మామయ్యా! నా స్వశక్తిమీద నేను స్వయంగా సంపాదించుకుంటేనే దానికి విలువుంటుంది. నాకూ తృప్తిగా వుంటుంది."

"పోనీ అలాగే కానియ్‌... పెళ్ళయ్యాక నీ యిష్టమొచ్చినంత కాలం ఉజ్జోగం కోసం తిరగొచ్చు. నే కాదన్నానా."

ప్రతి మాటకూ మామయ్య ఏదోకటి సర్ది చెప్పెయ్యటంతో యేమనాలో తోచక, యింట్లో తల్లి ముందు చిందులు వేశాడు సుబ్బారావు.

"అమ్మా, నాకిప్పుడు పెళ్లేమిటి?"

సుబ్బారావు తల్లి కొంచెం ఆశ్చర్యంగా కొడుకువంక చూసి, "అదేమిట్రా అబ్బాయ్, ఏ వయసుకా ముచ్చట!"

"ఉద్యోగం వచ్చాక చేసుకుంటాను."

"నేను మీ మామయ్యకు మాటిచ్చేశాను."

"వెంటనే తీసేసుకో!"

"అదెలాగురా?"

"మరి ఎవర్నడిగి మాటిచ్చావు?"

"చిన్నప్పట్నుంచీ అనుకున్న సంబంధమేగా?"

"చిన్నప్పట్లాగుందేమిటి ఆ అమ్మాయి?"

"పెద్దవకుండా ఉండిపోతుందేమిటి?"

"పెద్దదవటమంటే మరీ అలా పర్వతంలా యెదిగి పోవటమేనా? అసలావిడగారి ముందు నేను ఏనుగుముందు

ఎలకపిల్లలా వుంటాను! ఆ మాటకొస్తే హానుమాయమ్మకి కొడుకులా వుంటాను."

"ఛ, అవేం మాటల్రా? ఏదో సదుపాయంమీద కా స్సంత ఒళ్ళు చేసిందంతే!"

"మరీ అంత హోల్ సేల్ గానా? పగలు చూస్తే రాత్రికి కల్లోకొచ్చేలా వుంటుంది ఆకారం! నా కిష్టం లేదమ్మా!"

"అలా అంటే యెలారా బాబూ! మామయ్యా హానూ యిద్దరూ నీమీదే ఆశ పెట్టుకున్నారు"

"యికమీదట పెట్టుకోవద్దని చెప్పు!"

"నా మాట విను బాబూ! లక్షల ఆస్థి వలచి నిన్ను వరిస్తుంటే కాదంటావా?"

"అమ్మా, డబ్బుకన్న మనిషి ముఖ్యం నాకు! నేను పెళ్ళాడే అమ్మాయి ఎంత బీదదయినా ఫరవాలేదు. నా ఆత్మగౌరవానికి భంగం కలక్కుండా నా మనసు తెలిసి మసలుకు నేదయితే చాలు?"

"నువ్వు మాట్లాడేదేమీ నాకర్థం కావటంలేదు."

"అమ్మా! హానుమాయమ్మకి ధనవంతురాలిననే గర్వం, అహం అణువణువునా జీర్ణించుకుపోయాయి. నన్ను యేనాడూ గౌరవంగా చూడలేదు. నన్నో బానిసగా వాళ్ళింట్లో పనిచేసే పరిచారకుడిలాగా ట్రీట్ చేస్తూంది. అలాంటి దాన్ని చేసుకుని నేను జీవితాంతం ఆమె కాళ్ళ ముందు పెంపుడు కుక్కలా పడివుండటం నీకిష్టమా అమ్మా...?"

"నువ్వనవసరంగా యేవేవో ఊహించుకుంటున్నావు? హానూ అలాంటి పిల్ల కాదు. కావాలని కాస్త చనువుగా వుంటే వుండొచ్చు. దాన్ని నువ్వు లోకువ చేస్తున్నట్టుగా

గోరంతలు కొండంతలుగా చేసుకుంటున్నావు, అంతే!"

"అమ్మా! నాకేం చెప్పొద్దు. మొన్న అటెండయిన యింటర్వ్యూలో ఖచ్చితంగా సెలక్టవుతాను. వెయ్యి రూపాయలకు తక్కువకాని జీతం! ఫరవాలేదు, మనిద్దరికీ హాయిగా సరిపోతుంది. నా ఆశయాలకు అనుగుణంగా వున్న పిల్లను చూసి ఎప్పుడో పెళ్ళాడతాను!"

తల్లి ఏం సమాధానం చెప్పలేదు. భారంగా నిట్టూర్చింది.

## 3

"అంత ధైర్యంగా తల్లితో చెప్పి మామ నెదిరించ గలిగిన వాడవి, ఎందుకిలా పరుగెత్తుకొచ్చావు?" ప్రసాద్ కొద్దిగా ఆశ్చర్యం కనబరుస్తూ అన్నాడు.

"అదే చెప్తాస్తున్నాను...మా అమ్మతో ఖచ్చితంగా చెప్పేశాక, మా అమ్మ మామయ్య ఒత్తిడి చేస్తుంటే నా అభిప్రాయం చెప్పేసింది. మా మామ వీరభద్రుడు, రుద్రుడు అయిపోయాడు. నిప్పులు తొక్కిన కోతిలా గంతులు వేశాడు. నీ కొడుకు నా కూతుర్నెలా చేసుకోడో చూస్తాను—అన్నాడు. నన్నెదిరించినవాడు ఇప్పటిదాకా బతికి బట్టకట్టలేదన్నాడు. ఇంకా ఏమేమో అన్నాడు. అని వూరుకున్నా సరిపోయేది. అప్పటికప్పుడు పెళ్ళికి ముహూర్తం పెట్టించుకు వచ్చాడు.

"నన్ను ఎంతో సౌమ్యంగా తనింటికి పిలిచి, అకస్మాత్తుగా గది తలుపులు బంధించాడు. నన్ను ఖైదీగా చేసిన మా మామని ఆ క్షణమే మొదటిసారిగా ద్వేషించాను. అతని చర్యలకు కోపంతో నిలువెల్లా వూగిపోయాను. మర్నాడే అంటే రేపే ముహూర్తం. నన్ను బలవంతాన మెడలు వంచి, ఆడపిల్లను పెళ్ళికి ఒప్పించి

నట్టు కర్కశంగా నా జీవితంతో ఆడుకోవాలను కున్నాడు మా మామ.

కాని, నేను బానిసను కాదని, మా మామ చేతిలో కీలుబొమ్మను కాదని నిరూపించదలచుకున్నాను. భోజనం తీసుకొచ్చిన పనిమనిషితో బయటకు వెళ్ళాలని నమ్మించాను. వేళ్ళు చూపించాను. నమ్మేసింది. తలుపు తియ్యగానే దాన్ని గదిలోపలికి లాగి, అరవకుండా నోట్లో గుడ్డలు కుక్కి, యింట్లోంచి బయటపడ్డాను. సమయానికి మామ యింట్లో లేడు. పెళ్ళి పనులమీద బయట తిరుగుతున్నాడు.

"ఒక్క అంగలో గోడెక్కి రిక్షాలో పడ్డాను. స్టేషన్ కొచ్చేసరికి ట్రెయిన్ సిద్ధంగా వుంది. అది యే వూరు పోతుందో, యెక్కడ్నించి వస్తున్నదో నా కనవసరం. యెక్కేశాను. జారిపోబోతుంటే నువ్వు పడకుండా రక్షించావు....ఇదీ జరిగిన సంగతి!" ముగించాడు సుబ్బారావు.

ప్రసాద్ ఆసక్తిగా విన్నాడు. చివర్లో చిన్నగా నవ్వి, "అంత ధైర్యవంతుడివి, మామకు భయపడి పారిపోయి వచ్చావెందుకు? ఎదిరించి నిలబడి యీ పెళ్ళి చచ్చినా చేసుకోను అని తెగేసి చెప్పలేకపోయావా?" అన్నాడు.

"చెప్పానుగా, మా మామ ధనమదాంధుడని. దానికి తోడు దుర్మార్గుడు. నన్ను ప్రాణాలతో వదిలిపెట్టడు. నేను తన కూతురికి దక్కపోయాక నా ప్రాణాలు నాకు దక్కనివ్వక పోవటమే ఆయన పాలసీ. అందుకవసరమైన అన్ని ఏర్పాట్లు పెళ్ళి ఏర్పాట్లకన్న స్పీడుగా జరిపించేస్తాడు. ఆయన దుర్మార్గానికి దౌష్ట్యానికి నా నిందు

జీవితం బలిచేసుకోవటం నా కిష్టంలేదు. అందుకే యిల్లు వదిలి వచ్చేశాను" అన్నాడు సుబ్బారావు.

"నేనేమో అనుకున్నాను. నువు అమాయకుడివికాదు, అసాధ్యుడివే!....ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నావు?"

"టి.టి.యి. వస్తే బాత్రూంలోకి పారిపోవాలా, సీటు కిందికి దూరాలా అని ఆలోచిస్తున్నాను!"

సుబ్బారావు జోక్‌కి గట్టిగా నవ్వబోయి, అందరు తిడతారని భయపడి, "అయితే యింతకీ నువ్వు టికెట్ తీసుకోలేదా?" అన్నాడు ప్రసాద్.

"ప్రస్తుతానికి టికెట్‌లెస్ ట్రావెలర్ని. టికెట్ కోసం డబ్బులు కూడా వెంట తెచ్చుకోలేదు."

"డోంట్ వర్రీ. విజయవాడ రాబోతోంది. నేను దిగి టికెట్ తీసుకొస్తాను. అందాకా నా టికెట్ నీదగ్గ రుంచుకో!"

"ప్లాట్‌ఫాం దాటి బయటికి వెళ్ళేటప్పుడు గేటు దగ్గర టి.సి. అటకాయించాడా?"

"నేనంత దూరం ఆలోచించలేదు సుమా. సరే, కాసేపు నువు ప్లాట్‌ఫాంమీద వెయిట్ చెయ్యి. ఈ లోపల ఎవరైనా స్క్వాడ్ నిన్ను పట్టుకునే ప్రమాదం లేకపోలేదు. అంచేత ఎవరో ఫ్రెండుని రిసీవ్ చేసుకోవ టానికి వచ్చినట్టు సీరియస్‌గా ట్రెయిన్ ఆ చివర్నుంచి యీ చివరికి హడావిడిగా తిరిగేస్తూ వుండు. స్క్వాడ్ చూసినా నిన్ను పట్టించుకోరు. కనీసం నీ చేతిలో సూట్‌కేసుకూడా లేదుగా! మనమెలాగూ స్టాండింగ్ పాసింజర్స్ కాబట్టి మన సీట్లు పోతాయనే బెంగలేదు. ఏమంటావు?"

సుబ్బారావు స్నేహపూర్వకంగా ప్రసాద్ వంక

చూశాడు.

ట్రెయిన్ పెద్ద చప్పుడు చేస్తూ విజయవాడ జంక్షన్‌లో ఆగింది.

తర్వాత ప్రయాణం హాయిగానే జరిగింది. ఎందుకంటే ఓ టి.టి.ఇ. దయతలచి, బెర్తుకి పదిరూపాయలు చొప్పున ఆదనంగా వసూలుచేసి వాళ్ళిద్దరికి త్రీటైర్ కంపార్టు మెంట్లో రెండు బెర్తులు దానంచేశాడు. జాగారం చెయ్యనక్కర్లేకుండానే సుబ్బారావు, ప్రసాద్ హాయిగా తెల్లవార్లు బెర్తుల మీద హాయిగా పడుకొని నిద్ర పోయారు.

సికింద్రాబాద్ చేరేసరికి తెలతెలవార్తోంది.

## 4

"నువ్విప్పుడు నాతో మా యింటికొస్తున్నావు" అన్నాడు ప్రసాద్. సుబ్బారావు మొహమాట పడ్డాడు.

"మైడియర్ యంగ్ మేన్! ఊరికే అభిమానపడి కొండపాలు కావొద్దు. నేను నీ మంచి కోరి చెబుతున్నాను. నా మాటమీద నమ్మకముంటే నాతో రా! లేకుంటే, నీ దారి నీది—నా దారి నాది!" నిష్కర్షగా చెప్పేశాడు ప్రసాద్.

సుబ్బారావుకి ఆ క్షణంలో ప్రసాద్‌కన్న ఆత్మీయుడు శ్రేయోభిలాషి లేడనిపించింది.

"అలాగే ఫ్రెండ్! నీకు భారం కాకూడదనే ఉద్దేశంతో వద్దన్నానుగాని, నాకు నీకన్న కావలసినవారు లేరు. అంతేకాదు, ఓ గమ్యమంటూ లేని ప్రయాణం నాది! ప్రస్తుతానికి నీ సంరక్షణలో నాకు రిలీఫ్ దొరుకుతుందనే నమ్మకం నాకుంది."

"దట్స్ గుడ్! నాంపల్లి వచ్చింది, దిగు!" ప్రసాద్

సూట్ కేసుతో దిగాడు.

సుబ్బారావు ఉత్త చేతుల్తో దిగాడు. ప్రసాద్ అప్పుడే గుర్తు వచ్చినట్టు, "అన్నట్టు నీకు గుడ్డలు లేవు కదూ! అయినా ఫరవాలేదు, మనిద్దరం దాదాపు ఒకే ఒడ్డుపొడవు వున్నాం. నా గుడ్డలు నువు యధేచ్ఛగా వాడుకోవచ్చు!" అన్నాడు.

సుబ్బారావుకి ప్రసాద్‌పట్ల కృతజ్ఞతతో నిండిపో యింది మనసు.

ఆటోని పిలిచి, యిద్దరు యెక్కాక చాంద్రాయణ గుట్ట పొమ్మన్నాడు ప్రసాద్. ఆటో కదిలింది.

సుబ్బారావుకి హైదరాబాదు బొత్తిగా కొత్తకాదు గాని, ఏవో కోఠీ, లక్డీకాపూల్, చార్మినార్ వంటి ప్రదేశాలే తెలుసు. అంతకుమించి నగరం యే చివర యేముందో వివరాలు తెలియవు. ప్రసాద్ చెప్పిన చాంద్రాయణ గుట్ట దగ్గర్లోనే యెక్కడో వుండి వుం టుందనుకున్నాడు. కాని అరగంట దాటినా ఆటో ఇంకా అలాగే పరుగెడుతుంటే చాలా దూరమే అనుకున్నాడు.

ప్రసాద్ యెక్కడకు వెళ్ళాలో సూచనలిచ్చాడు ఆటో డ్రయివర్‌కి.

ఓ పాత యింటి ముందాగింది ఆటో. ఆ యింటి ప్రక్కనే ఒక పెద్ద పాముల పుట్టను చూసి భయ పడ్డాడు సుబ్బారావు. పాములన్నా, పాముల పుట్టలన్నా సుబ్బారావుకు అంతులేని భయం.

ప్రసాద్ దిగి, సుబ్బారావు వంక చూశాడు. సుబ్బా రావు తనూ దిగాక, ఆటో ఫేర్ చెల్లించి, రా అన్నట్టు అతనికి సైగ చేసి, కాంపౌండ్ వాల్‌కున్న యినపగేటు తెరుచుకొని లోపలికి నడిచాడు.

సుబ్బారావు పరిసరాల్ని ఆశ్చర్యంగా పరిశీలిస్తూ అత న్ననుసరించాడు.

చుట్టుపక్కల యిళ్ళు లేవు. అదొక చేటు విసిరేసి నట్టుగా వుంది. హైదరాబాదు నగరంలో ఆ యింటి సమీపంలో యిళ్ళు యెవరూ కట్టుకోక పోవటం అతనికి చాలా విచిత్రంగా అనిపించింది.

ప్రసాద్ తలుపులు తట్టాడు. చాలా సేపటి వరకు తెరుచుకోలేదు. తర్వాత ఓ జానెడు మేర మాత్రం తెరుచుకున్నాయి. అందులోనించి కనీ కనపడకుండా ఓ మొహం కనిపించింది.

తరవాత తలుపులు తెరుచుకున్నాయి. ప్రసాద్ లోపలికి అడుగు పెట్టాడు సుబ్బారావు చేయిపట్టుకుని. సుబ్బారావు బెరుగ్గా లోనికడుగుపెట్టాడు ప్రసాద్‌తో. తలుపులు తెరిచిన వ్యక్తి వాళ్ళు లోనికి రాగానే మూసే శాడు యధావిధిగా. లోపల వాతావరణమే వేరుగా వుంది.

ముందు హాల్లో కొన్ని కుర్చీలు టేబిల్సు వున్నాయి. హాలు దాటి వెళ్ళాక గాడ్రెజ్ కంపెనీ తయారుచేసిన గుమ్మం, తలుపులు వున్నాయి. తలుపులు బంధించి వున్నాయి. ప్రసాద్‌కి తలుపులు తీసిన వ్యక్తి గాడ్రెజ్ తలుపులమీద చిన్నగా శబ్దం చేశాడు. టిక్....టిక్.... టకా....టకా....లయబద్ధంగా ఏదో కోడ్ భాషలా వుంది ఆ శబ్దం.

గాడ్రెజ్ తలుపులు తెరుచుకున్నాయి. క్రిందికి వెళ్ళ టానికి మెట్లు కనిపించాయి.

ప్రసాద్ వెంట భూగృహంలోని కడుగుపెట్టిన సుబ్బారావుకి కళ్ళు తిరిగినట్టనిపించింది.

లోపల పొడవాటి టేబిల్సు, వాటి ముందు స్టూల్సు మీద కొందరు మనుషులు కూర్చుని వున్నారు. టేబిల్సు మీద కంప్యూటర్ వంటి అత్యాధునికమైన సాధనలు, టి.వి. సెట్టులాంటి స్క్రీన్ వున్న సాధనాలు వున్నాయి. స్క్రీన్ మీద ఏవో గీతలు, చుక్కలు, అంకెలు ప్రత్యక్షమై క్షణంలో మాయమవుతున్నాయి. వాటి ముందు కూచుని వున్న వ్యక్తుల చేతుల్లో స్టెనోగ్రాఫర్స్ ఉపయోగించే లోక పుస్తకాలున్నాయి. వాటిమీద షార్ట్ లెన్స్‌తో ఏవో చకచక నోట్ చేస్తున్నారు.

అది ఓ ప్రత్యేక ప్రపంచంలా వుంది. ఆ పొడవాటి పెద్ద హాలులో ఎటు చూసినా మిషన్‌లు, వైర్లు దర్శనమిస్తున్నాయి.

సుబ్బారావుకంతా అయోమయంగా వుంది. ప్రసాద్ తననిక్కడికెందుకు తీసుకవచ్చినట్టు? తనేదో ఎక్స్‌పోర్ట్సు యింపోర్ట్సు ఉద్యోగం చేస్తున్నానన్నాడు. మరి యిదేమిటి?

అదే అడగబోయాడు. కాని ప్రసాద్ మాట్లాడవద్దని సైగచేశాడతనికి. సుబ్బారావు మౌనంగా వుండిపోయాడు. తిన అనుమానాల్ని తనలోనే దాచుకున్నాడు.

ప్రసాద్ రాకను అక్కడి వాళ్ళెవరూ గుర్తించినట్టే లేదు. ఎవరి పని వారు మెషీన్‌లకు మల్లే చకచక చేసుకుపోతున్నారు.

సుబ్బారావుని చెయ్యిపట్టి నడిపించుకు వెళ్ళాడు ప్రసాద్. లోపల గదులున్నాయి. అన్నీ బయట తాళాలు పెట్టబడి వున్నాయి.

ఆ గదుల్లో ఏముందో? సుబ్బారాకి జిజ్ఞాస.

ప్రసాద్ ఆ గదుల్లో ఓ దానిముందు ఆగాడు. జేబు

లోంచి తాళం తీశాడు. తలుపులు తెరిచాడు. సూట్ కేసుతో గది లోపలికి అడుగు పెట్టాడు.

లోపల గది చాలా అందంగా వుంది. ఆధునికమైన ఫర్నిచర్. రూమంతా మొజాయిక్ ఫ్లోర్ లో, గోడలు డిస్టెంబర్ తో చాలా నీట్ గా వుంది.

సుబ్బారావు ఆశ్చర్యపోతున్నాడు. గదిలోకి అడుగు పెట్టగానే చల్లగా వుంది. ఏ.సి. చేయబడ్డ గది. ఇల్లు బయటనుంచి చూస్తే పాడుబడ్డ భవంతిలా వుంది. కానీ లోపలికొస్తే ఆదేదో దేవేంద్ర భవనంలాగా చాలా కాస్ట్లీగా, ఆధునికంగా అందంగా వుంది. గదులు యింకా అందంగా వున్నాయి.

ప్రసాద్ మెత్తటి ఫోం పరుపులు పరిచిన మంచం చూపించి, "రెస్టు తీసుకో! ఇప్పుడే వస్తాను" అన్నాడు.

"ఫరవాలేదు, యిక నిద్రపోనిప్పుడు. బాత్ రూం చూపించు. స్నానాదికాలు పూర్తిచేస్తాను" అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు ఆలోచిస్తున్నాడు. అసలీ ప్రసాద్ ఎవరు? హాల్లో మెషీన్లు ఏమిటి? వాళ్ళంతా ఎవరు? ప్రసాద్ కి వాళ్ళతో ఏమిటి సంబంధం? ఇంత రిచ్ గా వున్న ప్రసాద్ కి ఆర్డనరీ కంపార్టుమెంట్లో నించుని ప్రయాణం చేయాల్సిన ఖర్మేం పట్టింది?

అన్నీ ప్రశ్నలే! సమాధానంలేని, సమాధానం రాని ప్రశ్నలు. ప్రసాద్ ని ఎలా అర్థం చేసుకోవాలా అని ఆలోచిస్తున్నాడు సుబ్బారావు.

ఎక్కడికో వెళ్ళి మళ్ళీ లోనికొచ్చిన ప్రసాద్ అతనింకా అలాగే ఆలోచిస్తూ వుండిపోవటం చూసి ఆశ్చర్యంగా, "ఏమిటి, బాత్రూంకి వెళ్తానన్నావు కదా..?"

అన్నాడు.

సుబ్బారావు సర్దుకొని, "ఆ, అదే నువ్వు చూపిస్తావని కూచుండిపోయాను...." అన్నాడు.

"అన్నీ ఎటాచ్డ్" అంటూ చూపించాడు ప్రసాద్.

సుబ్బారావు అన్యమనస్కంగా లేచి, అటు నడిచాడు.

## 5

స్నానంచేసి వచ్చేటప్పటికి ప్రసాద్ తన గుడ్డలు పైకి తీసి కుర్చీమీద వేశాడు.

"అవి వేసుకొని చూడు. సరిపోతాయనుకుంటాను" అన్నాడు ప్రసాద్, సుబ్బారావుతో.

సుబ్బారావు యిబ్బందిగా ఫీలయ్యాడు. అవి వేసుకోవటానికి అభిమానం అడ్డొచ్చింది. అయినా, తప్పదు! తనకి మరో జత గుడ్డలేవు. ప్రయాణంలో బాగా మాసిపోయిన తన గుడ్డల్ని ఉతికి ఆరేసుకున్నాడు. అవి ఆరేదాకానైనా ప్రసాద్ గుడ్డలు కట్టుకోక తప్పదు.

మౌనంగా ప్రసాద్ యిచ్చిన బట్టలు ధరించాడు. ఇంతలో నౌకరు టిఫిన్ పట్టుకొచ్చి టేబిల్ మీద పెట్టాడు. సుబ్బారావుకి బాగా ఆకలిగా వుంది. మొహమాటం లేకుండా టిఫిన్ తిన్నాడు. పొగలు కక్కే కమ్మటి కాఫీతో నౌకరు మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు.

కడుపు బరువెక్కగానే నిద్రతో కళ్ళు మూరుకుపోసాగాయి—ప్రయాణ బడలిక, తిండి అతన్ని నిద్రపోవటానికి పురిగొల్పాయి. ఒళ్ళెరగకుండా నిద్రపోయాడు సుబ్బారావు.

అతను నిద్రలేచేసరికి గదిలో ప్రసాద్ లేడు. అసలు ఎవరూ లేరు. లేచి, కంప్యూటర్ వంటి సాధనాలున్న హాల్లోకి వెళ్ళాలని, అవేమిటో తెల్సుకోవాలని అతని

మనసు తహ-తహలాడుతోంది. లేచి గుమ్మంవైపు నాలు గడుగులు వేశాను. అయితే యింతలోనే ఎక్కడున్నంచో ప్రసాద్ వూడిపడ్డాడు.

"నిద్ర బాగా పట్టిందా?" అన్నాడు చిన్నగా నవ్వి, ప్రసాద్. సుబ్బారావు నవ్వుతూ తలూపాడు.

"నీకూ్కడా ఏదైనా ఉద్యోగం మాడమంటావా?" అన్నాడు ప్రసాద్.

"ఉద్యోగమా? ఏమిటి, ఎక్కడ?"

"ఇక్కడే. నా దగ్గరే. నువు బాగా చదువుకున్న వాడివే కదా!"

"అవును. డిగ్రీ పూర్తిచేశాను."

"గుడ్. అయితే మాకు చాలా బాగా ఉపయోగ పడతావు."

"ఎలా?"

"మాకు ఫారిన్ కంట్రీస్‌లో ఏజెన్సీలున్నాయి. అదే, ఎక్స్‌పోర్టింగ్ ఏజెన్సీస్. వాళ్ళతో కరస్పాండెన్స్ వుంటుంది. అయితే మామూలుగా పోస్టల్ కరస్పాండెన్స్ కాదు. అంతా వైర్‌లెస్ పద్ధతి. నువ్వు హాల్లో చూసిన టి.వి. తెరలమీద కోడ్ వర్డ్సు పడతాయి. వాటిని డీకోడ్ చేసి ఇంగ్లీషులో రాసుకోవాలి. ఆనక మన జవాబు గ్రీఫ్ చేసుకొని యిక్కడ్నించి కోడ్‌లో మెసేజ్ పంపాలి, అదీ జాబ్. వెరీ సింపుల్."

సుబ్బారావుకిది బాగానే వున్నట్టనిపించింది. వెరైటీ జాబ్. సరదాగా వుంటుంది.

ప్రసాద్ — సుబ్బారావు ముఖకవళికలు గమనించి, "ఈ ఉద్యోగానికి నీ జీతం నెలకి మూడు వేలు"

అన్నాడు. సుబ్బారావు గుండె ఒక్క క్షణం ఆగి కొట్టుకుంది. "మూడు వేలా?!" అన్నాడు గుండెలమీద చెయ్యి వేసుకొని.

"బోర్డింగు, లాడ్జింగు యిక్కడే. అన్నీ ఉచితం!"

"నేనున్నది ఇండియా నా, అరేబియన్ కంట్రీ ఏదైనా నా?" నమ్మలేకపోతున్నాడు సుబ్బారావు.

"ఇండియా నే. ఆంధ్రప్రదేశ్ రాజధాని లో వున్నావు" నవ్వి అన్నాడు ప్రసాద్.

సుబ్బారావు మనసు మధురోహల్లో తేలిపోతోంది. యే జీతానికాశపడి ఇండియాలోని యువకులు అరేబియా దేశాలకు వలసపోతున్నారో అంతకన్న మంచి జీతం, ఆకర్షణీయమైన జీతం—ప్రసాద్ తనకు యిప్పించటం చాలా ఆనందకరంగా వుందతనికి. దీంతో తన దశ తిరిగి పోతుంది. ఎలాగూ మామయ్య నెదిరించి వచ్చేశాడు గాబట్టి కొన్నాళ్ళు యిక్కడే అజ్ఞాతంగా కాలం గడిపి, వేలకు వేలు గడించవచ్చు. ఈ లోపల మామయ్య హేమమామయ్యకు ఎటూ పెళ్ళి చేసేస్తాడు. ఆ తర్వాత తను యింటికి వెళ్ళినా ఏం చెయ్యలేడు. కాకపోతే, అమ్మ తనకోసం బెంగ పెట్టుకుంటుంది.

అమ్మ గుర్తుకు రాగానే అతని కళ్ళు చెమర్చాయి. తల్లిని వదిలిరావటం అతనికేమాత్రం యిష్టంలేదు. కాని రాక తప్పలేదు. అక్కడే వుంటే యీ పాటికి తనను మెడలు వంచి, హేమమామయ్య మెడలో మూడు ముళ్ళు వేయించేవాడు మామయ్య.

ముందు హేమమామయ్య పెళ్ళి అయిపోవాలి. ఆ తర్వాత తనకి ముఖ్యమైన బెడద తీరిపోయినట్టే అప్పుడు తనంతట తాను ఏలూరు వెళ్ళినా మామయ్యేం చెయ్య

లేదు. పైగా తను వేలకు వేలు సంపాదించాక గాని, యింటికి వెళ్ళడు! తన కాళ్ళమీద తను నిలబడగలిగిన స్తోమత సంపాదించుకున్నాక మామయ్య కూడా ఏం చెయ్యలేడు. అమ్మను తీసుకొని తను హైదరాబాదు వచ్చేసి, శాశ్వతంగా యిక్కడే వుండిపోవచ్చు.

ఈ ఆలోచన అతనికి చాలా రిలీఫ్ యిచ్చింది. సంతోషంగానూ అనిపించింది.

"ఏమిటి, వున్నట్టుండి ఆలోచనల్లో పడిపోయావు? ఉద్యోగం యిష్టంలేదా? మూడువేల జీతం సరిపోదా? చెప్పు, యింకా కావాలంటే...." అంటున్న ప్రసాద్ మాటల్ని మధ్యలోనే తుంచేశాడు.

"నో..నో! ఉద్యోగం, జీతంకూడా బాగా నచ్చాయి. కూచున్న చోటినుంచి కదలక్కర్లేని అందమైన ఉద్యోగం. జీతంకూడా నేనెప్పుడూ ఆశించనంత యెక్కువ....అమ్మ గుర్తు వచ్చింది, అంతే!" అన్నాడు సుబ్బారావు.

"దానికింత ఆలోచనెందుకు? నీకు కావాలంటే చెప్పు, అమ్మని క్షణాలమీద ఏలూరునించి యిక్కడికి రప్పిస్తాను అడ్రసిస్తే ..."

"నో....నో....ఇప్పట్లో వద్దు. మామయ్యకి నా ఉనికి తెలియకూడదు. కొంత పాతబడ్డాక నేనే స్వయంగా వెళ్ళి అమ్మను తీసుకొస్తాను."

"అలాగే....సిక్కీ భవనంలో ఓ గది కేటాయిస్తున్నాను. రూం నెంబర్ ఎయిటీన్ ...."

"అలాగే. చాలా థాంక్స్ నీకు. పిలిచి ఉద్యోగం యిచ్చావు. అదీగాక పెద్ద జీతం ఫిక్సుచేశావు."

"దానికేముంది? నాకు నువ్వు సమర్థుడవని నమ్మకం కలిగింది. అందుకే యీ జాబ్ కి నిన్నెన్నుకున్నాను. జీత

మంటావా, నీ పట్ల నాకు గురి కుదుర్తే యింకా పెంచుతాను."

సుబ్బారావు నమ్మలేనట్టు చూశాడు.

"ఎస్....ఆర్నెల్లలో మరో వెయ్యి పెంచుతాను!"

సుబ్బారావు ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"అయామ్ సో లక్కీ! నీకు ఋణపడిపోతున్నాను. నువ్వు నా యజమానివి. నిన్ను నిన్నని పిలవటానికి సిగ్గుగా వుంది!"

ప్రసాద్ సుబ్బారావు భుజం చరిచి, "ఛ ఛ, అలాగేం అనుకోవద్దు. మనిద్దరం స్నేహితులం. స్నేహితుల మధ్య మన్ననలెందుకు? 'నువ్వు' అనే పిలుపు, నాకూ అదే ఆనందాన్ని కలగజేస్తుంది. రా, నిన్ను మన మిత్రులకు పరిచయం చేస్తాను" అన్నాడు.

# 6

"డియర్ ఫ్రెండ్స్ ఈయన మన కొత్త ఫ్రెండు. పేరు సుబ్బారావు. ఈ క్షణంనించీ మీ కొలీగ్" అన్నాడు ప్రసాద్.

హాల్లో మెషిన్లలో మెషిన్లలాగా పనిచేస్తున్న దాదాపు పదిహేనుమంది యువకుల తలలు ఒక్కసారిగా సుబ్బారావువైపు చూశాయి. వాళ్ళ చూపులు నిర్లిప్తంగా వున్నాయి. మౌనంగా తిలలూపారు—వాళ్ళెందుకో తన వంక జాలిగా చూస్తున్నట్టు సుబ్బారావుకి అనిపించింది. అదంతా తన భ్రమ..వాళ్ళెందుకు జాలిపడతారు? ఇంకా అసూయపడతారు. ఒక్కసారిగా తనకు పెద్ద జీతంతో ఉద్యోగం దొరికినందుకు. బహుశా వాళ్ళందరికన్నా తనకే ఎక్కువ జీతం ఫిక్సుచేసి వుంటాడు ప్రసాద్!.... అయినా తనకి వాళ్ళ జీతాల సంగతి తెలీదుగా. తనతో

సమానంగానే ఇస్తున్నాదేమో! లేదా ఇంకా ఎక్కువే నేమో.

సుబ్బారావు గజిబిజిగా ఆలోచిస్తున్నాడు.

ప్రసాద్ అతని చెయ్యి పట్టుకొని ఓ కంప్యూటర్ లాంటి మెషిన్ దగ్గరకు తీసుకువెళ్ళి కూచోబెట్టి. "నీకీ రోజు యీ మెషిన్ ఎలా పనిచేస్తుందో దీన్నెలా ఆప రేట్ చెయ్యాలో, వచ్చే మెసేజ్‌ని ఎలా రిసీవ్ చేసు కోవాలో, అంతా వివరంగా చెప్తాను!" అంటూ స్విచ్‌లు నొక్కి వివరించసాగాడు.

రెండు రోజులు గడిచాయి.

ఆ మెషీన్‌నెలా ఆపరేట్ చెయ్యాలో తెలిసింది సుబ్బారావుకి. దాంతోబాటు నమ్మశక్యంగాని మరో ఘోరమైన నగ్న సత్యం కూడా తెలిసి ఒళ్ళు జలదరిం చింది.

ప్రసాద్ చేస్తూన్న బిజినెస్ చాలా ప్రమాదకర మైనది. అది ఎక్స్‌పోర్ట్స్ అండ్ ఇంపోర్ట్స్ కానే కాదు. అది గూఢచారి సంస్థలాగా వుంది. ఏవో మెసేజ్‌లు రావటం, వాటిని డీకోడ్ చేసి రాయటం సుబ్బారావుకి బాగానే అలవాటయింది.

ఆ డీకోడ్ చేసిన మేటర్ చదివితే అతనికి మొదట మతి భ్రమించినట్టయింది. అందులో ఇండియాకి సంబం ధించిన అతి కీలకమైన రహస్యాల గురించి అవతలి సంస్థ వివరాలు కోరుతోంది. ఆ సంస్థ పేరేమిటో, అదే దేశమో, అసలు భారతదేశమో, విదేశమో—అదంతా ఉద్యోగులెవరికీ తెలియదు. అంతా ప్రసాద్ చూసు కుంటాడు. ప్రసాద్ యిచ్చిన మెసేజ్‌ను మళ్ళీ తాము కోడ్ భాషలో అవతలి వాళ్ళకు పంపాలి!

ఆ మెసేజ్ అతి ప్రమాదకరమైనది. ఇండియా గుట్టుమట్లు — అతి కీలకమైన రహస్యాలు — ఎప్పటికప్పుడు తాజాగా మెసేజ్ వెళ్ళిపోతున్నది. దాన్నిబట్టి ఆ అంతలి సంస్థ శత్రుదేశాల్లో యేదో కావచ్చునని, ఇండియా మాత్రం కాదని సుబ్బారావుకి అర్థమయిపోయింది.

అతని మనసు ఎదురు తిరిగింది. ఇలాంటి దేశద్రోహానికి పూనుకున్న ప్రశాద్ ఎంత భయంకరమైన వ్యక్తో అతనికి మొదటిసారిగా తెలిసి వచ్చింది. ఆ దేశద్రోహంలో తనూ పాలు పంచుకుంటున్నాడన్న నిజం తెలియగానే అతని శరీరం రోమాంచితమైంది. అతనిలోని దేశభక్తి ఎదురు తిరిగింది.

నో....తనీ పని వెంటనే మానెయ్యాలి. ప్రసాద్‌కి చెప్పి విరమించుకోవాలి. తన దారిన తను పోవాలి.

కాని .... కాని ... ఇదొక విష వలయం. దీన్నుంచి ఛేదించుకొని బయటపడటం అంత తేలికైన విషయం కాదు. ప్రసాద్ చాలా ముందు చూపుతో తమందర్నీ ట్రాప్ చేశాడు. అక్కడ పనిచేస్తున్న వాళ్ళందరూ దాదాపు తన యీడు వారే. తనలాగే వీళ్ళని కూడా నమ్మించి తీసుకొచ్చాడు. మంచి జీతంతో ఉద్యోగమిస్తామంటే ఎగిరి గంతెయ్యని నిరుద్యోగి వుంటాడా? జీతం ఎరవేసి వీళ్ళని తీసుకొచ్చి యీ అందమైన ఉక్కు పంజరంలో బందీలని చేశాడన్నమాట!

ఇక్కడ్నుంచి తప్పించుకోవటం జరిగే పనికాదు. అందుకే బలమైన గాడ్రెజ్ తలుపులతో కోటలా నిర్మించాడీ హాలుని, లోపలి గదుల్ని.

అవి గదులు కావు. బందిఖానాలు. అందమైన చెరసాలలు. తామందరు అందులో ఖరీదైన ఖైదీలు. సుబ్బా

రావుకి యిప్పుడర్థమవుతోంది. అందులోని వ్యక్తులు యెప్పుడూ బయట ప్రపంచానికి ముఖం చూపించి వుండరు. బహుశా బయటి సూర్యుడ్ని చూసి ఎన్నాళ్ళయివుంటుందో....!? వీళ్ళు ఎప్పటికీ బయటికి పోలేరు, ప్రసాద్ పోనివ్వడు.

ఎదురుతిరిగితే చివరికి వాళ్ళని ఆ కోటలోనే సమాధి చేస్తాడేమో ప్రసాద్....కాని, అతను అంత దుర్మార్గుడిలా కనిపించడే....? అయినా యే పుట్టలో యే పాముందో యెవరికి తెలుసు. పైకి కనిపించేంతటి సౌమ్యుడు కాదు ప్రసాద్. ఇంటర్నేషనల్ స్మగ్లర్స్ కన్న ప్రమాదకరమైన వ్యక్తి. వాళ్ళు కేవలం దొంగ వ్యాపారులు మాత్రమే! కాని యితను....? భయంకరమైన అంతర్జాతీయ రహస్య గూఢచారి. దేశాన్ని వెన్నుపోటు పొడుస్తున్న మహా ద్రోహి!

ఎలా....ఎలా తను తప్పించుకోవాలి? యే సంగతి తెలియనట్టు, అతనికేమాత్రం అనుమానంరాని విధంగా తప్పించుకోవాలి. అది సాధ్యమా? అదే సాధ్యమయితే యీ పదిహేను — యిరవై మంది యువకులు యిదివరకే పరారై పోయుండరా? లేక వీళ్ళు ప్రసాద్ యిచ్చే బ్రహ్మాండమైన జీతానికి లొంగిపోయారా....

తను వచ్చిన రెండో రోజే ప్రసాద్ విడియోలో మంచి మంచి సినిమాలు చూపించాడు తన సభ్యులకి. అందులో సెన్సారుకాని సెక్సు సినిమాలు కూడా ఉన్నాయి. బయటికి పోని కారణంగా సభ్యులకి చక్కటి వినోదం కోట లోపలే యేర్పాటుచేస్తున్నాడన్నమాట!

అదేవిధంగా భోజన సదుపాయాలు. ఖరీదైన ఫర్నిచరున్న గదుల్లో, ఏసి చేసిన గదుల్లో-వసతి సౌకర్యం!

ఇవన్నీ ముందు యీ ఉద్యోగంలో చేరేవాళ్ళకు మహా వరప్రసాదాల్లా కనిపించటం అతి సహజం.

కాని లోపలికి కాలు పెట్టిన మరుక్షణం యిదొక పాముల పుట్ట అనీ, అందరికీ గ్రహింపుకొస్తోంది. తమ చెయ్యి దాటిపోయి. యంత్రాల్లో యంత్రంగా యాంత్రికమైన జీవితాలకి అలవాటు పడిపోయారందరు.

సుబ్బారావు తల విదిలించాడు. యెంత మోసంలో తనెంత సులభంగా యీ విష వలయంలో చిక్కుకు పోయాడు?

....అతని ఆలోచనలు ప్రసాద్ రాకతో తెగిపోయింది.

"హల్లో ఫ్రెండ్, ఎలా వుంది నీకే జీవితం? ఫెంటాస్టిక్‌గా లేదూ....?" అన్నాడు.

ఫెంటాస్టిక్ కాదు, పెంటాపాడూ కాదూ అని మనసులోనే తిట్టుకొని .... "ఆఁ .... చాలా బాగుంది. కాని, మా అమ్మను చూడాలని వుంది!" అన్నాడు సుబ్బారావు.

ప్రసాద్ నవ్వి, "నీకీపాటికి అర్థమయ్యే వుంటుంది. నీకెవరైనా కావలసివుంటే వాళ్ళని యిక్కడికి రప్పించటమే గాని, మీరెవరూ బయటికి వెళ్ళే అవకాశం లేదని....నీకంతగా చూడాలని వుంటే వీలుచూసుకుని ఓసారి మీ అమ్మగార్ని పిలిపిస్తాను. నువు మాట్లాడేదేమైనా వుంటే అది నా సమక్షంలోనో, నా అనుచరుల సమక్షంలోనో మాట్లాడాల్సి వుంటుంది. అవసరమైన దానికన్న ఒక్క మాట ఎక్కువ మాట్లాడినా, అసందర్భంగా మాట్లాడినా నువ్వు వుండవు, నీ తల్లి వుండదు. అర్థమైందనుకుంటాను!" అన్నాడు.

సుబ్బారావు నివ్వెరపోయి, "మాకు నేనెప్పుడైనా హైదరాబాదు వదిలి వెళ్ళాల్సి వస్తే ?" అన్నాడు.

"ఆ అవసరం ఎన్నటికీ రాదు. ఆ అవకాశం ఎప్పటికీ లేదు!"

"మరి ఎంతకాలమైనా యిక్కడేనా....?"

"నా మాటల్లో చెప్పాలంటే చచ్చేవరకూ యిక్కడే...."

"ఘోరం మరి యిక్కడి వాళ్ళెవరికీ పెళ్ళి పెటాకులు.... భార్యా పిల్లలూ...."

"పెళ్ళి, పిల్లలూ....ఎందుకయ్యా నీకీ సంసార లంపటం? పెళ్ళి దేనికి? కోరికలు తీర్చుకోవటానికే కదా! పిల్లలు ఆ కోరికల నిదర్శనంగా కలుగుతారు. ఆ పిల్లలు, వాళ్ళ రోగాలు, రొచ్చులు, వాళ్ళకోసం జీవితమంతా పాకులాడటం—యిదంతా దేనికి? ఇక్కడి సభ్యులకి అమ్మాయి అవసరమయినప్పుడల్లా ఆ సరదా మేమే తీర్చే ఏర్పాటు చేస్తాం.

"అందమైన అమ్మాయిలు, ప్రొఫెషనల్స్ కాదు—గొప్పింటి అమ్మాయిలే—ఎవరి క్కావాలంటే వాళ్ళకి మా స్వంత ఖర్చులతో యిక్కడికి రప్పిస్తాం. వాళ్ళకి ఎక్కడికి వచ్చారో, ఎట్నుంచి వచ్చారో, యెక్కడ వున్నారో తెలీకుండా ఏర్పాటు జరుగుతాయి. బయట ప్రపంచంలో మూసిన కళ్ళు యీ దేవలోకంలో నే విప్పుతారు. మన సభ్యులను అలరించి, స్వర్గ సౌఖ్యాలు చూపించి, తర్వాత మాయమైపోతుంటారు. అప్సరసలు వీళ్ళముందు దిగదుడుపన్నమాట! మేం కూడా వాళ్ళకి చాలా పెద్ద మొత్తంలో 'పేమెంటు' చేస్తాం కాబట్టి ఎగిరి గంతేసి వస్తారు. వచ్చిన వాళ్ళను మళ్ళీ మర్యాదగా

వాళ్ళు యెక్కడికి కావాలంటే అక్కడికి తీసుకుపోయి విడిచి వస్తుంటారు మా వాళ్ళు. ఎలా వుంది మన ఏర్పాటు?

"కాబట్టి, నీకు అమ్మాయి కావాలన్నా, రిలీఫ్ కోసం మందు కావాలన్నా, అన్నీ .... అన్నీ .... క్షణాల్లో నీ కాళ్ళ దగ్గరికే వస్తాయి. ఇక బయటి ప్రపంచంతో నీకేం పని చెప్పు బ్రదర్!"

అతని సుదీర్ఘోపన్యాసానికి కోపం వచ్చినంత పని యింది సుబ్బారావుకి.

"నీకీపాటికి తెలిసే వుంటుంది-మనం చట్టం హారించని, యీ దేశం క్షమించని నేరం చేస్తున్నామని! నేరమే, దేశద్రోహమే! అవన్నీ ట్రాష్ అనుకొని పక్కకి నెట్టే కామనుకో, యిది బంగారు బాతులాంటి చక్కటి వృత్తి తిరుగులేని వ్యాపారం! మనం రహస్యాలు కొన్ని కోట్ల రూపాయలు చేసే బంగారానికి అమ్ముతున్నాం. వాళ్ళు కొంటున్నారు కాబట్టే మనం అమ్ముతున్నాం....జస్ట్ బిజినెస్... ద్రోహం, పాపభీతి, నేరంలాంటి పదాలకి మన డిక్షనరీలో అర్థాలే వేరు బ్రదర్ ....

"రెస్టు తీసుకో! ఈ రోజుకిక పనేంలేదు. చాలా రాత్రయింది. భోంచేసి పడుకో. నీ గదిలో భోజనం సిద్ధంగా వుంచి. మనవాళ్ళు పిలిస్తే పలుకుతారు. నేను ఉదయం కలుస్తా!" ప్రసాద్ వెళ్ళిపోయాడు.

సుబ్బారావు తేరుకోవటానికి చాలా సేపు పట్టింది.

## 7

ఆ రాత్రంతా సుబ్బారావుకి నిద్రపట్టలేదు.

ఇక్కడ్నుంచి ఎలాగైనాసరే తప్పించుకుపోవాలి! కాని ఎలా? ఇది ఉక్కు పంజరం. బయటపడాలను కుంటే మరింత బిగుసుకుపోయే ఉక్కు పిడికిలిలాంటిదీ

భవనం. ప్రసాద్‌కి బలగం చాలానే వుంది. బయట పనులు చక్కబెట్టడానికి, లోపలి విద్యార్థులకి వసతి సదుపాయాలు చూడటానికి దండిగా వున్నారు జనం.

ప్రసాద్ చాలా తెలివైనవాడు. పనివాళ్ళందర్నీ చదువురాని వాళ్ళనే కావాలని ఎంచుకొని పనిలో పెట్టుకున్నాడు. చదువురాని వాళ్ళు కాబట్టి యీ మెషీన్ల గురించి, యిక్కడి విషయం గురించి వాళ్ళకేమీ అర్థం కాదు. వాళ్ళు బయటి ప్రపంచంలో స్వేచ్ఛగా తిరిగినా, యిక్కడి రహస్యాలు బయటికి పొక్కే అవకాశంలేదు. అదీగాకుండా ప్రసాద్ పనివాళ్ళు నమ్మినబంట్లు. ప్రసాద్ చెబితే పది అంతస్థుల మేడమీదనుంచి కూడా నిస్సంకోచంగా కిందికి దూకేయటానికి సిద్ధమయ్యే తెగింపుగల వాళ్ళు. వాళ్ళవలన అతనికి ప్రమాదంలేదు.

ఇలాంటి సేవకులు ఆ భవనంలో అడుగడుగునా వున్నారు. వాళ్ళ కళ్ళు కప్పి తప్పించుకోవటం దుస్సాధ్యం. తను ఆ ప్రయత్నం చేసినా, అసలు ఆ ఆలోచనే మనసులోకి వచ్చిందని వాళ్ళు పసిగట్టినా, తరువాతి క్షణం తన శరీరంలో ప్రాణముండదు. అది మాత్రం నూటికి నూరుపాళ్ళు నిజం!

ఆలోచనలతో సుబ్బారావు మెదడు వేడెక్కిపోయింది. కాని, పరిష్కారం దొరకలేదు. ఆలోచన ఓ కొలిక్కి రాలేదు. ప్రసాద్ చేస్తున్న దేశద్రోహం అతనిలోని రక్తాన్ని మరిగిస్తోంది.

అసలు అతను స్వదేశీయుడా లేక విదేశీయుడా అనే అనుమానం తలెత్తుతోంది. చూడగా అతను నూరుపైసల తెలుగువాడిలాగానే వున్నాడు. భారతీయుడే అనటానికేమాత్రం అనుమానంలేదు. ఇలాంటి దేశద్రోహుల

వల్లనే దేశంలో అంతర్యుద్ధాలు చెలరేగేది.

సుబ్బారావుకి మొన్న మొన్నటి స్వర్ణ దేవాలయం వద్ద జరిగిన దారుణ మరణకాండ గుర్తువచ్చింది. విదేశీయులు ఆయుధాలు సరఫరా చేసి శిక్కులను ఖలిస్థాన్ కోసం రెచ్చగొట్టడం, తత్ఫలితంగా ఎన్నో వందల ప్రాణాల్ని భింద్రన్ వాలే, అతని అనుచరులు పొట్టన పెట్టుకోవటం, అది చిలికి చిలికి గాలి వానయి, చివరికి భింద్రన్ మరణానికేకాక, అతని అనుచరులు మరణానికి, సైన్యం ఆహుతికి, చివరికి జగత్ప్రసిద్ధి చెందిన స్వర్ణ దేవాలయం దెబ్బతినటం—యివన్నీ మనసులో ఫిల్ము రీలులా తిరిగింది.

ఇలాంటి దేశద్రోహులే భారతదేశ ప్రతిష్ఠను దెబ్బ తీస్తున్నారు. ఇలాంటి వాళ్ళవల్లనే భారతదేశం చుట్టు పట్లు శత్రు దేశాలకు అందటం వాళ్ళు దేశాన్ని ఎలా కబళించాలా అని ఎదురుచూడటం యీ దేశాన్ని అల్లకల్లోలం చేసి మత ప్రాతిపదిక పై భారతీయుల సఖ్యతను వెన్నుపోటు పొడిచి, విడదీయాలనుకోవటం— జరుగుతోంది.

ఇకమీదట యీ అరాచక కృత్యాల్ని కొనసాగనివ్వ కూడదు. ప్రసాద్‌ని ప్రభుత్వానికి పట్టించాలి. అతని ద్రోహానికి ఉరితీయించాలి. తన దేశాన్ని శత్రువుల బారి నుంచి కాపాడుకోవాలి.

అందుకు పకడ్బందీగా ప్లాన్ చేసుకోవాలి. తనతో బాటు బందీలయిపోయిన తక్కిన పదిహేనుమంది అభాగ్యుల్ని యీ చెరసాలనుంచి విడిపించాలి.

కాని....ఎలా? కనీసం ఒకరితో మరొకర్ని మాట్లాడు కోవటానికి కూడా ప్రసాద్ అనుమతించడు. ఎవరి గది

వాళ్ళదే. ఎవరి పక్క వాళ్ళదే. ప్రతి గదికీ ఎటాచ్డ్ బాత్ లేవెట్రీ. అంచేత ఒకరితో మరొకరికి ఎలాంటి సమయంలోను కల్సుకోవలసిన అవసరం వుండదు. భోజనాలు కూడా గదులకే సరఫరా చేయబడతాయి.

ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నాడు ప్రసాద్!? కాని... కాని....ఇక్కడి సైంటిస్టు కుర్రాళ్ళ అవసరాల కోసం ఆడపిల్లల్ని తీసుకొస్తామన్నాడుకదా, సైంటిస్టు కుర్రాళ్లు ఆ ఆడపిల్లల్తో యిక్కడి రహస్యాలు చెప్పేసే అవకాశ ముంది కదా! వాళ్ళకి ఎంతగా కళ్ళకు గంతలు కట్టి తెచ్చినా, రహస్యం అంటూ తెలిసిపోయాక యేదో విధంగా పోలీసులకి తెలియజేయకుండా వుంటారా? పోలీసులు నిఘావేసి ఈ స్థావరాన్ని పట్టుకోలేక పోతారా? కొంత కాకపోయినా కొంతయినా ఈ గుట్టు రట్టయ్యే అవకాశం లేకపోలేదు.

కాని....ఎవరికీ ఆ ఆలోచనే రాలేదా? ఈ అవకాశాన్ని తనుపయోగించుకోవాలి, అది త్వరలోనే జరగాలి.

తెల్లవారుఝామున ఎప్పుడో నిద్రపట్టిందతనికి.

## 8

ఉదయం ప్రసాద్ సుబ్బారావు రూంకి వచ్చాడు.

"హల్లో ఫ్రెండ్, రాత్రి నిద్ర సరిగ్గా పట్టలేదు కదా!" అన్నాడు, చిన్నగా నవ్వుతూ.

సుబ్బారావు ఉలిక్కిపడి చూశాడతని వంక.

"నాకెలా తెలిసిందా అని ఆశ్చర్యపోతున్నావు కదూ!? ప్రతి గదిలోను ఏమేం జరుగుతున్నదో, యెవరెవరు మేలుకొని వున్నారో లేక, మరేదైనా కార్యక్రమంలో వున్నారో అవన్నీ నాకు యెప్పటికప్పుడు

తెలిసిపోతుంటాయి" అన్నాడు ప్రసాద్.

సుబ్బారావు ఆశ్చర్యంనించి యింకా తేరుకోలేదు.

"ఇదిగో చూడు, యిది మైక్రోఫోన్. ఇలాంటి మైక్రోఫోన్ ఈ గదిలో—ఆ మాటకొస్తే ప్రతీ గదిలో అమర్చబడి వున్నాయి గోడల్లో. ఎక్కడ అమర్చబడి వుందో ఎవరికీ తెలియదు. నాకు తప్ప! అలాగే ఆటోమాటిక్ కెమెరా కూడా అమర్చబడి వుంది. అవసరమైనప్పుడలా ఫోటోలు తీసి జాగ్రత్తగా పదిలపరుస్తాయవి. అనుమానం వచ్చినపుడు నేను వాటిని వెరిఫై చేసుకొని ముద్దుగా వున్న వాటిని ప్రింట్లు వేయిస్తాను."

"ముద్దుగా వుండట మేమిటి?"

"నీకు తెలియదు కదూ, వివరంగా చెపుతాను. ఓసారి సైంటిస్టు కుర్రోడొకడు, అమ్మాయి కావాలన్నాడు. అమ్మాయిని తెప్పించాం. ఆ అమ్మాయి సహాయంతో తప్పించుకోవాలని వాడు ప్లాన్ చేశాడు. రహస్యంగా ఆ అమ్మాయితో యిక్కడి కార్యకలాపాలన్నీ చెప్పేశాడు. అవన్నీ యిక్కడ అమర్చిన మైక్రోఫోన్ వల్ల నా చెవిలో చెప్పినంత స్పష్టంగా నాకు వినిపించాయి. ఆ తర్వాత వారిద్దరి రాసక్రీడలు ఆటోమాటిక్ కెమేరా ప్రింట్లుతీసింది.

"ఆనక ఆ సైంటిస్టు బతికి బట్టకట్టలేదని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. ఆ పిల్లను మాత్రం చంపలేదు. ఎందుకో తెలుసా? ఆ పిల్ల గౌరవమయిన కుటుంబంలో నుంచి వచ్చింది. పాకెట్ మనీకోసం అప్పుడప్పుడు ఇలా చిల్లరవల్లరగా జరుగుతుంది.

"ఆ పిల్ల ఫోటోలు—పూర్తి నగ్నంగా రాసక్రీడలో తేలియాడుతున్న రసవత్తరమైన ఫోటోలు — ఆ పిల్లకు

చూపించాం. దాంతో బెంబేలెత్తిపోయింది. అది బయట పడితే తను ఆత్మహత్య చేసుకుంటానంది. అయితే యిక్కడి విషయాలు యిక్కడితోనే మర్చిపో, లేక పోతే నీ ఫోటోలు లక్షలకొద్దీ ప్రింట్లు వేయించి కర పత్రాల్లా పంచి పెడతామని చెప్పాను. ఆ పిల్ల ఏడ్చింది. చెప్పనంది.

"నిన్ను మా మనుషులు అనుక్షణం వెంటాడుతూ వుంటారు. ఏదయినా అలాంటి పిచ్చిపని చెయ్యాలని ప్రయత్నిస్తే మరుక్షణం నువ్వూ మిగలవ్, నీ పరువూ మిగల్దు అని బాగా భయపెట్టాం. తర్వాత వదిలేశాం. ఆ పిల్ల బుద్ధిగా నడుచుకుంది యిప్పటిదాకా. పాపం సైంటిస్టు బాబు స్వర్గంలో వేరే అప్సరసల్తో సరసా లాడుకుంటున్నాడు, అంతే!"

సుబ్బారావుకి ముచ్చెమట్లు పోశాయి. తన మనసులో ఆలోచనల్ని కూడా ప్రసాద్ కనిపెట్టేశాడా? లేక ముందు జాగ్రత్తకోసం చెపుతున్నాడా? రాత్రి తను ఈ విషయం గురించే ఆలోచిస్తున్నట్టు అతనెలా కనిపెట్టే శాడు? తను నిద్రపోకపోవటం గురించి ఖచ్చితంగా ఎలా తెల్సుకోగలిగాడు? బహుశా తన గదిలోని ప్రతివిషయం అతని గదిలోకి స్పష్టంగా కనిపిస్తాయా, ఏమో!

"నాతో రా!" అన్నాడు ప్రసాద్ లేచి.

సుబ్బారావు మౌనంగా అనుసరించాడు. అప్పటికి ఆ భవంతిలోని అందరు నిద్రలేచినట్టున్నారు. కాని తలుపులు తెరిచి ఎవరూ బయటికి రాలేదు. ఎవరి పనులు వారు గదుల్లోనే మౌనంగా చక్కబెట్టుకుంటున్నట్టుంది!

ప్రసాద్ ఓ విశాలమైన గదిలోకి తీసుకువెళ్ళాడు. ఆ గదిలోకి వెళ్తూనే విస్తుపోయి చూశాడు సుబ్బారావు.

ఆనో మాంత్రికుడి మాయామందిరంలా వుంది.

గదిలో ఓ పక్కగా పెద్ద, టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో వుండేలాంటి మెషీన్ వుంది. దానిపైన నంబర్లు వేసి వున్నాయి. ఒకటినుంచి యిరవై వరకు. ప్రతి నంబరు కింద అంగుళం పైకి పొడుచుకొచ్చిన మీటలున్నాయి. వాటికింద ఎర్రటి చిన్న బల్బులు వెలుగుతున్నాయి.

"ఈ బల్బులు చూశావా? ప్రతి గదిలోను వున్న ఎలక్ట్రానిక్ పరికరాలు పనిచేస్తున్నాయనటానికి యీ ఎర్రటి కాంతి నిదర్శనం. ఇది ఆరిపోతే అక్కడి పరికరాలు పాడయిపోవటమో, ఎవరైనా దాన్ని కనిపెట్టి పాడుచేయటమో జరిగి వుండాలి. వెంటనే ఆ రూంకి వెళ్ళి దాన్ని చెకప్ చేస్తాం.

"ఇదిగో ఈ మీట కింద చిన్న స్క్రీన్ వుంది చూడు, దీనిమీద ప్రతి రూంలో జరుగుతున్న కార్యక్రమమంతా కనిపిస్తుంది. ఉదాహరణకు ఏడో నంబరు చూడు." అంటూ ఏడో నంబరు మీట నొక్కాడు. ఎర్రటి బల్బు కింద వున్న ఆరంగుళాల టి.వి. స్క్రీన్ మీద బొమ్మ పడింది.

అందులో వున్న యువకుడు షేవ్ చేసుకుంటున్న బొమ్మ స్పష్టంగా కనిపిస్తోంది. గదంతా ఆ ఆరంగుళాల స్క్రీన్‌మీద స్పష్టంగా కనిపిస్తోంది.

ప్రసాద్ ఎనిమిదో నంబరు మీట నొక్కాడు. ఆ యువకుడు అప్పుడే గుడ్డలు మార్చుకుంటున్నాడు. సుబ్బారావు కళ్ళు మూసుకున్నాడు ఆ దృశ్యం చూడలేక.

"ఈ మాత్రానికే కళ్ళు మూసుకుంటావెందుకు? వుస్సూ మాస్తానంటే రాత్రి సమయంలో రా! కనీసం అయిదారు రూంస్ లో పద్రాళ్ళు అమ్మాయిలతో

మొంచి బిజీగా వుంటారు. అప్పుడు చూద్దువుగాని, జన్మ తరించిపోతుంది!" అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

సుబ్బారావు యిబ్బందిగా నవ్వాడు.

ప్రసాద్ మీట పక్కనున్న స్విచ్ నొక్కాడు. ఇప్పుడు శబ్దాలు వినిపిస్తున్నాయి. ఆ యువకుడు సన్నగా యీలవేస్తున్నాడు. నోటితో హమ్మింగ్ శబ్దం చేస్తున్నాడు. అన్నీ స్పష్టంగా వినిపిస్తున్నాయి.

ప్రసాద్ సుబ్బారావు వంక చూసి, "ఈ పదిహేను నంబర్లు మీ ఫ్రెండ్సువి, నీది. పదహారో నంబరు కిచెన్ పదిహేడో నంబరు అంగరక్షకుల గది. పద్దెనిమిది సర్వెంట్ మెయిడ్స్ రూం. పంతొమ్మిది స్టోర్సు. ఇరవై ప్రయోగశాల. మొత్తం యిరవై రూంస్‌లో జరిగేదీ నేనిక్కడి నుంచి కాలు కదలకుండానే చూడొచ్చు, వినొచ్చు. అవసరమైన సందేశాలుకూడా పంపొచ్చు— ఇదిగో, విను!" అంటూ పదహారో నంబరు స్విచ్ నొక్కి, "బ్రేక్ ఫాస్టు రెడీయా రహీం?" అనడిగాడు.

వంటగదిలో ఆమ్లెట్లు ప్లేట్సులో సర్దుతున్న రహీం, "జీ సాబ్. రెడీ!" అంటూ సమాధాన మిచ్చాడు. స్క్రీన్ మీద రహీం, వంటగది అన్నీ కనిపించాయి.

"అది సరే, నేను మొన్నట్నుంచీ అడగాలని మర్చిపోతున్నాను. గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో ఫస్టు క్లాసులో ప్రయాణం చేయగలిగీ సెకండ్ క్లాసులో, కనీసం రిజర్వేషన్ కంపార్టుమెంటులో కూడా కాకుండా నువ్వెందుకు ప్రయాణం చేశావు మొన్న?" అనడిగాడు సుబ్బారావు.

"ఓ, అదా! ఈ భవనంలో ఆపరేట్ చెయ్యవలసిన

మెషీన్‌లు పనిహేను వున్నాయి. పదిహేనో వ్యక్తి స్వర్గానికి దారి వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు. ఆ ఖాళీని భర్తీ చేయటానికి తగిన అర్హతలున్న వ్యక్తికోసం వెతుకుతున్నాను. ఇది నేనే స్వయంగా ఎన్నుకోవటం మొదట్నుంచీ అలవాటు.

కోస్తా ప్రాంతంలోని వద్రాళ్ళు బుద్ధిమంతులు. ఉద్యోగం కోసం కడుపు చేతబట్టుకొని హైదరాబాదు వచ్చే నిరుద్యోగ యువకులు గోదావరి ఎక్స్‌ప్రెస్‌లోని అన్‌రిజర్వుడు (జనరల్) కంపార్టుమెంటులోనైతే పుష్కలంగా దొరుకుతారు. అందుకే సామాన్య ప్రయాణీకుడిలాగా జనరల్ కంపార్టుమెంట్లో నిలబడి ప్రయాణం చేశాను. నువ్వు దొరికావు. మాటల సందర్భంలో నాకావలసిన వ్యక్తివి నువ్వేనని గ్రహించాను .... నువ్వు నన్ను నమ్మి నా వెంట వచ్చావు. పదిహేనో నంబరు మెషీను నీ రాకతో కళకళలాడింది" అన్నాడు ప్రసాద్ నవ్వుతూ.

సుబ్బారావుకీసారి నవ్వు రాలేదు. మొత్తం పదిహేను మెషీన్‌లకు యిప్పటివరకు ఎంత మంది యువకులు మారారో, ఎందరు ప్రసాద్ ఘాతుకాలకు బలైపోయారో అంచనా వెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడు. తనకి ద్రోహం చేస్తారని అనుమానం వచ్చిన యువకుడ్ని అతను నిర్దాక్షిణ్యంగా చంపేస్తున్నాడన్నమాట!

ఎంత దారుణం! ఎంత రాక్షసత్వం! ఇంత పకడ్బందీగా ఏర్పాట్లు చేసుకున్నాడు కాబట్టే అతను తన రహస్యం బయటి ప్రపంచానికి తెలియకుండ జాగ్రత్తపడగలిగాడు. లేకుంటే ఎప్పుడో ఇతని చరిత్ర సమాప్తమయి వుండేది.

ప్రసాద్ సుబ్బారావు వంక ఆదరంగా చూసి,

"ఇంకా స్నానం చెయ్యలేదనుకుంటాను!?....పోయి, ఆ పని చూడు. బ్రేక్‌ఫాస్టు సర్వ్ చేస్తున్నారు. చల్లారి పోతుంది!" అన్నాడు.

ఏడీ అతిధి సత్కారం మండినట్టే వుంది—అను కున్నాడు మనసులో కసిగా. అంతలోనే నాలిక్కరచు కున్నాడు. ఇన్ని ఎలక్ట్రానిక్ పరికరాలు అమర్చిన అసాధ్యుడు మనసులోని ఆలోచనల్ని బయటపెట్టే యంత్రం కూడా ఏదొకటి గదుల్లో అమర్చలేదు కదా! అన్న అనుమానం వచ్చింది.

అన్యమనస్కంగా పదిహేనో నంబరు గదికి వచ్చాడు సుబ్బారావు.

# 9

ఆ రోజు సాయంత్రం సుబ్బారావు ప్రసాద్‌నడిగాడు "నా మనసేం బాగోలేదు. ఎవరయినా అమ్మాయిని ఏర్పాటు చేయగలవా?" అన్నాడు.

ప్రసాద్ పరిశీలనగా చూశాడు సుబ్బారావు వంక.

"నీ ముందు—స్వర్గం చేరుకున్న యువకుడి విషయం నీకు తెలుసనుకుంటాను!?" అన్నాడు.

"ఆ విషయం యిప్పుడెందుకు?" అన్నాడు సుబ్బా రావు చాలా నిదానంగా. ముఖంలో ఎలాంటి భావాలు కనపడనీయకుండా.

"అకస్మాత్తుగా అమ్మాయి కావాలంటే, ముందు జాగ్రత్తకోసం" ఆ సంగతి గుర్తుచేశానంతే!

"నీకు తెలియకుండా నేను అడుగుతీసి అడుగు వెయ్య గలనా? నా ప్రతి చర్యా నాకన్న బాగా నువ్వే పరిశీ లించగలవు. నా సంగతి పరిసమాప్తం చెయ్యగలవు.... అదీగాకుండా నన్నింత ఆదరంగా ఆప్యాయంగా చూస్తు

న్నావు. నేను నిన్ను వదిలి వెళ్ళగలనా? నీకు ద్రోహం తలపెట్టగలనా?"

"సందర్భం వచ్చింది కాబట్టి చెపుతున్నాను. ఇది వరలో యిలాగే ఓ యువకుడు మాటలు, చేష్టలు తెలుపాయని, చాలా తెలివిగా, అంతక్రితమే వివరంగా రాసిన చీటీ ఒకటి ఆమె దుస్తుల్లో దాచేశాడు. చెవిలో మాకు కూడా వినపడకుండా కోడ్ భాషలో ఏదో చెప్పాడు.

తర్వాత ఆ పిల్లని గుడ్డ లూడతీసి ఆపాదమస్తకం వెతికాం. జుట్టులో ఎక్కడో ఆ కాగితం పదిలంగా దాచుకుంది. ఆ తర్వాత కథ నేను చెప్పనక్కర్లేదు. ఆ కుర్రాడు ఆ పిల్లకూడా ఆత్మహత్య చేసుకుని యిక్కడే సమాధి అయిపోయారు, పాపం!" అన్నాడు ప్రసాద్.

"నేను అలాంటి పరిస్థితి రానివ్వను! నాకు స్వాంతన, లాలన కావాలి. అందుకే అడిగాను...."

"ఆల్ రైట్, అలాగే పంపిస్తాను. అమ్మాయిలు ఎవరి గదుల్లోకి వచ్చినా వాళ్ళు వెళ్ళేవరకు ఆ గదుల్లో జరిగే ప్రతి చిన్న సంఘటన నేనిక్కడ స్క్రీన్స్ మీద చూస్తూనే వుంటాను. వాళ్ళ మాటలు వింటూనే వుంటాను. వారి చర్యలు గమనిస్తూనే వుంటాను. అంతే కాదు. ఈ భవంతి వదలి వెళ్ళిపోయేముందు ప్రతి అమ్మాయిని దుస్తులు ఒలిచి మరీ మా సర్వెంటు మెయిడ్స్ పూర్తి పరీక్ష చేసిగాని వదలరు" అన్నాడు నవ్వుతూ ప్రసాద్.

"నీకు తెలియదా బ్రదర్, యింతగా చెప్పాలా? నేనంత తెలివితక్కువ వాడిని కాదు!" అన్నాడు సుబ్బారావు.

రాత్రి పది గంటలకు కళ్ళకు గంతలు కట్టబడిన

అమ్మాయి రూం నంబర్ పదిహేనుకి తీసుకురాబడింది. అమ్మాయిని వదిలేసి అనుచరులు వెళ్ళిపోయారు.

సుబ్బారావు ఆమె కళ్ళ గంతలు విప్పాడు. ఆ క్షణం నించీ ఆ గదిలో జరిగే ప్రతి విషయం ప్రసాద్ తీక్ష్ణంగా చూస్తాడనీ, ప్రతి సంభాషణా పొల్లుపోకుండా వింటాడనీ అతనికి తెలుసు.

ఆ అమ్మాయి కళ్ళు విప్పి సుబ్బారావు వంక చూసింది. ఆమెనే పరీక్షగా చూస్తున్నాడు సుబ్బారావు. ఆమె చాలా అందగత్తె అనే చెప్పాలి.

సామాన్యమైన వాయిలు చీర కట్టింది. నీలాకాశం రంగు చీరకు మేచ్ కాని, గోల్డుస్పాట్ జాకెట్టు ధరించింది. మెడలో సన్నటి గొలుసు. చెవులకు రింగులు. అంతే, ఆమె అలంకరణ. కాని దివ్యమైన తేజస్సు ఆమె కళ్ళల్లో వెలిగిపోతోంది. నుదుట దోసకాయంత సింధూర బొట్టు ప్రళయ రుద్రుడి మూడో కన్నులా భాసిస్తోంది. ఆరోగ్యంతో కళకళలాడుతున్న బుగ్గలు నన్ను మలినం చేయవద్దని వేడుకుంటున్నట్టున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే మసిగుడ్డకు చుట్టిన మాణిక్యంలా వుందామె.

"ఇలా రా, ఈ మంచంమీద కూచో" అన్నాడు సుబ్బారావు. ఆమె అలాగే నిల్చుని వుంది. సుబ్బారావు వంక ఒక్కసారి కళ్ళెత్తి చూసి మళ్ళీ వాల్చుకుంది.

"రా అమ్మాయ్....నీ పేరేమిటి?" అడిగాడు.

"పద్మ" అన్నది ఆమె గొంతు విప్పి. ఆమె గొంతు చాలా శ్రావ్యంగా వుంది. చాలా అణకువ, మర్యాద ధ్వనించింది.

"రమ్మంటే అలాగే నిల్చుండిపోయావేం?" అన్నాడు. ఆమె కదిలి వచ్చి అతని చెంత నిల్చుంది.

"కొత్తా?" అడిగాడు.

ఆమె మౌనంగా తలూపింది.

"చదువుకుంటున్నావా?"

"బి.ఎస్సీ. ఫస్టియర్."

"మరి ఈ వృత్తి అలవాటా, హాబీయా?"

"రెండూ కాదు. నన్ను క్షమించి ఏ ప్రశ్నలు వేయకండి. మీరు నన్ను పిలిపించిన పని పూర్తిచేసి నన్ను పంపించండి. అవతల నాన్నగారి పరిస్థితికి బావుండలేదు. మందులు కొనుక్కుని వెళ్ళాలి!"

సుబ్బారావు ఒక్కక్షణం నిటారుగా అయ్యాడు.

"అంటే, మీ నాన్నకు మందులు యిప్పించటం కోసమే ఈ పనికి ఒప్పుకున్నావా?"

"అవునండి."

"ఇదే మొదటి అనుభవమా?"

అవునన్నట్టు తలూపింది. ఒక్కక్షణం ఆలోచించిన సుబ్బారావు లేచి ఆమె దగ్గరగా వెళ్ళాడు. అతనిలో మానవత్వపు ఊరుకి గండిపడి, అది ఆమె మనసు వరకు ప్రవహించి, ఆ అమ్మాయిని అందులో ముంచెత్తటానికి సిద్ధంగా వుంది.

ఆమెని కౌగలించుకున్నాడు. ఆమె ప్రతిఘటించలేదు. పరవశించలేదు. అతనిమీద వాలిపోలేదు. కర్రలా బిగుసుకొని కళ్ళు మూసుకుంది.

ఆమెని దగ్గరగా హత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు. తర్వాత ఆమెని వదిలేశాడు.

"మరి ఆ మాట ముందే చెప్పావు కాదేం?" అన్నాడు కోపంగా.

"ఏ మాట?" అన్నదామె తెల్లబోయి.

"అదే....నువ్విప్పుడు పిరియడ్సులో వున్నావని, అందుకు వీలుకాదని...."

పద్మ ముఖంలో రంగులు వేగంగా మారాయి. ఆ తర్వాత వెంటనే పెద్ద గొంతుతో, "ఏం చెయ్యాలో చెప్పండి. నాకు డబ్బు కావాలి. నా తండ్రి జబ్బు నయం కావాలి. అందుకే నేను మెనుస్ట్రువల్ పిరియడ్స్‌లో వున్న నిజం చెప్పకుండా వచ్చాను. మీరు ఆ సంగతి కనిపెట్టేశారు" అన్నది.

"వెళ్ళు, వెంటనే వెళ్ళిపో యిక్కడ్నుంచి" చీదరించుకుంటూ అన్నాడు సుబ్బారావు.

"మరి నాకు డబ్బివ్వరాండీ? నా తండ్రికి నయం చేసుకోవటంకోసం నా శీలాన్ని కూడా పణం పెట్టుకోవటానికి సిద్ధపడ్డాను! ఆయన మాకు దక్కకపోతే మా కుటుంబమంతా వీధిలోపడి అడుక్కోవాలి!"

"సరె, సరె! ఆ సోదంతా దేనికి? మా గురువుగార్ని అడుక్కో. ఏదోకటి యివ్వకపోరు. ఆయన చాలా మంచివారు. నీలాంటి వాళ్ళకు ఎందరికో సాయం చేశారు.... వెళ్ళు వెళ్ళు...నా మూడ్ అంతా పాడు చేశావు" అంటూ తలుపులు తీశాడు.

పద్మ అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తూ గుమ్మం దగ్గర ఓ క్షణం ఆగి, అతని కళ్ళలోకి ఆరాధనగా చూసి, ఏమనూ వెళ్ళిపోయింది.

ఇదంతా ప్రసాద్ టి. వి. స్క్రీన్‌మీద చూస్తున్నాడని సుబ్బారావుకి తెలుసు.

## 10

సరిగ్గా మరో గంట తర్వాత సీభయినుండి సాయుధులైన పోలీసులతో చాంద్రాయణగుట్టలో వున్న ఆపాత

భవనంమీద పోలీసులు అకస్మాత్తుగా దాడిచెయ్యటం, కాల్పులు జరపటం, ప్రసాద్‌తోబాటు అతని అను చరులు పట్టుబడిపోవటం, క్షణాలమీద జరిగిపోయింది.

పోలీసుల వెంట వున్న పద్మను చూడగానే ప్రసాద్ నిర్ఘాంతపోయి, "ఇంతకూ కారకురాలివి నువ్వా? నీకు వచ్చేటపుడు, వెళ్ళేటపుడు గంతలు కట్టి అన్ని జాగ్రత్తలూ తీసుకున్నారే మా వాళ్ళు? ఎలా జరిగిందిది?" అన్నాడు తలపట్టుకుని.

పద్మ నవ్వి, సుబ్బారావు వంక చూసింది. ఓ చిన్న కాగితం స్లిప్ ప్రసాద్‌కి చూపించింది. దానిమీద రెండే పదాలున్నాయి. "చంద్రాయణ గుట్ట, పాడుపడిన పెద్ద భవంతి!" అని "ఈ కాగితం ముక్క గుమ్మందగ్గర జిగురు రాసి తిరగేసి పెట్టి వుంచారు సుబ్బారావుగారు. నన్ను ముద్దుపెట్టుకుంటూ చెవిలో చిన్నగా ఈ సంగతి చెప్పి, నన్నేం చేయనని ధైర్యంచెప్పి, నన్ను అరికాలికి అది అంటుకునేలాగా నడవమని చెప్పారు.

ఆయన చెప్పినట్టే చిన్న నాటకమాడి, రూంనించి బయటికొచ్చేటప్పుడు ఆ కాగితాన్ని నా అరికాలికి అంటేలా జాగ్రత్తపడ్డాను. మీ వాళ్ళు నన్ను నఖశిఖ పర్యంతం పరీక్షించారుగాని, అరికాలికున్న కాగితం వారి దృష్టిలో పడలేదు!" అన్నది పద్మ.

ప్రసాద్ తినేసేలా చూశాడు సుబ్బారావు వంక.

సుబ్బారావు చిన్నగా నవ్వి, "మీట్ మై వుడ్ బి, మిస్ పద్మ!" అన్నాడు ప్రసాద్‌తో.

ప్రసాద్ ఉక్రోషంగా చూస్తుంటే, పద్మ సిగ్గుతో తలవంచుకుంది.

—:అయిపోయింది:—

# మూడు ఫోటోలు

## టెంపోరావ్

హోటల్ అట్లాంటిక్‌లో వాలిగారి కెదురుగా కూర్చున్నాను. మేం మద్రాసు వచ్చి యిరవై నాలుగ్గంటలైనా దాటలేదు.

వాలిగారు పడక కుర్చీలో వెనక్కి వాలి కూర్చున్నారు. నోట్లో పొడగాటి చుట్ట వెల్గుతోంది. ఆయన వైపు భక్తితో చూస్తున్నాను.

"గిరీ!"

"చెప్పండి!" అన్నాను.

"మనం రెండు మూడు రోజుల్లో అమృతసర్ వెళ్లాలి" అన్నారాయన.

ఏం చెప్పాలో తోచక మౌనం వహించాను. అమృతసర్‌లోని స్వర్ణ దేవాలయంలోకి అన్ని మారణాయుధాలు ఎలా చేర్చబడ్డాయో వాలిగారు పరిశోధిస్తున్నారు.

నెలరోజులపాటు ఆయనా, నేనూ అమృతసర్‌లో

వున్నాం. మధ్యలో ఒకసారి కాశ్మీర్ వెళ్ళి వచ్చాం. అమృతసర్ నుంచి యేదో కారణం మూలంగా ఆయన మద్రాసు వచ్చారు.

ఎందుకు వచ్చారో నాకు తెలియదు. అడిగితే ఒకంతట ఆయన చెప్పరు. ఆయన ఏదైనా చెప్పినా మనకు అర్థం కాదు.

"నిజాన్ని తెల్సుకోడానికి నలువైపులా తిరగాలి" అన్నారాయన ఒకసారి.

టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ని యెత్తి ఆయన "హలో" అన్నాడు.

అటువైపున ఎవరున్నారో నాకు తెలియదు.

"నేనే, రామన్ భాయ్" అని ఆయన అనగానే ఫోన్ చేసినది ఎవరో తెలుసుకున్నాను.

ఇన్‌స్పెక్టర్ రామన్ అయివుండాలి!

వాలిగారు టైమ్ చూశారు. తొమ్మిది దాటింది. రిసీవర్ని పెట్టేసి ఆయన నా వైపు చూశాడు.

"గిరీ, వెళ్దాం, పద" అని ఆయన లేచారు.

XYZ కారును అమృతసర్‌లో వదిలేశాం. ఆయన బయటకు నడిచారు. గది తలుపు మూసి తాళం వేశాను. ఆయన వెనకనే వెళ్ళాను.

వాలిగారు హోటల్ ముందు నిలబడ్డారు. హోటల్ నౌకరు టాక్సీని పిల్చాడు. ఇద్దరం టాక్సీలో ఎక్కాం.

డ్రయివర్ యెక్కడికన్నట్లు మా వైపు తిరిగి చూశాడు.

"నంబర్ 10, గారి అమ్మాల్ స్ట్రీట్, తేనాం పేట" అన్నారాయన.

టాక్సీ కదిలింది. రోడ్డు వారగా వున్న సోడియమ్

కాపర్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

"వాలిగారూ, ఏమైంది?" ప్రశ్నించాను.

"కాస్సేపట్లో చూస్తావు గా!" అన్నారాయన నవ్వుతూ.

టాక్సీ వేగంగా పోతోంది. ఆలోచిస్తూ కూర్చున్నాను. ముప్ఫయి ఏళ్ళుగా వాలిగారితో కలిసి తిరిగి అనేక కేసుల్లో పనిచేశాను. ఇంతకాలం ఆయనకు దగ్గరగా వున్నా ఆయనమీద నాకుండే భక్తి శ్రద్ధలు ఏమాత్రం తరగలేదు. నిజం చెప్పాలంటే అవి పెరుగుతూ వచ్చాయి.

ఆయనొక మేధావి. ఆయన ప్రదర్శించే ధైర్య సాహసాలు యెక్కడా మనకు అగుపించవు.

కళ్ళు తెరిచి ఓరగా ఆయనవైపు చూశాను. చుట్ట పొగ టాక్సీ కిటికీలోంచి బయటకు పోతోంది.

ఒక యింటిముందు టాక్సీ ఆగింది. వాలిగారు కిందకు దిగారు. మా ముందు పోలీసు జీప్ ఆగివుంది. మీటరు చూసి టాక్సీవాడికి డబ్బు యిచ్చాను. అతడిని వెళ్ళిపొమ్మన్నాను.

ఇన్స్పెక్టర్ రామన్ వాలిగారితో మాట్లాడుతున్నాడు. ఒక కాన్స్టేబుల్ యింటిముందు నిలబడి వున్నాడు.

ఇన్స్పెక్టర్ రామన్, వాలిగారు లోపలకు వెళ్లారు. గబగబా నేనూ వెళ్ళాను.

విశాలమైన హాలు. ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి. డైనోరా టి.వి.కి ఎదురుగా పెద్ద సోఫాలో ఒక స్త్రీ చచ్చిపడి వుంది. చీర కొంగు ఆమె నోట్లోకి కుక్కబడింది. ఎవరో కత్తితో గుండెల్లోకి పొడిచి ఆమెను

చంపారు.

వాలిగారు శవాన్ని చూస్తూ వుండిపోయారు. ఆమె వయస్సు నలభై దాటివుండదు. నల్లటి రంగు. అంత అందమైన స్త్రీ కాదు.

సోఫామీద ఆమె తల పక్కకు పడివుంది. వాలిగారు దగ్గరగా వెళ్ళారు.

"రామన్ భాయ్, ఒంటి మీద నగలు లేవు!" అన్నారు వాలిగారు.

"లేవు, సార్" అన్నాడతను.

హాల్లో దూరంగా ఒక యువకుడు నిలబడి వున్నాడు. అతడి కళ్ళల్లో భయం, దుఃఖం మిళితమై వున్నాయి. అతడి దగ్గరకెళ్ళాను. అతడు నా వైపు గాభరాగా చూశాడు.

"మిష్టర్ నీ పేరు?" అన్నాను.

"రవికాంత్" అన్నాడతను.

అదే సమయంలో వాలిగారు అక్కడికొచ్చి అతడి భుజంమీద చెయ్యి వేశారు.

"అబ్బాయి, ఈ విధంగా నీ తల్లి చంపబడినందుకు విచారిస్తున్నాను" అన్నారాయన.

అతను వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. ఇన్‌స్పెక్టర్ రామన్ మా దగ్గరకు వచ్చాడు.

"నీకు తోబుట్టువులున్నారా?"

"లేరు సార్. నేనొక్కడినే."

"జరిగినదంతా చెప్పు!"

"నేను ఫ్రెండ్స్‌తో బీచ్‌కి వెళ్ళి 8-30కి తిరిగి వచ్చాను. అమ్మను ఈ స్థితిలో చూసి హడలిపోయాను. గోష్ఠి కోసం అర్చాను."

"ఎవరతను?"

"వంటచేసే వస్రాడు. వాడు పలకలేదు. వంట గదిలోకి వెళ్ళాను. గోపీని ఎవరో తాళ్ళతో కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కారు."

"వాలిగారూ, గోపీ ఇంకా అదే స్థితిలో వున్నాడు. మీరు చూడ్డం మంచిదని తాళ్ళు విప్పించలేదు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అందరం లోపలున్న వంట గదిలోకి వెళ్ళాం. పెద్ద డైనింగ్ టేబుల్‌కి గోపీని నైలాన్ తాళ్ళతో కట్టేశారు. నోట్లో గుడ్డలు యిప్పుడు లేవు!

"తాళ్ళను విప్పేయించు!" అన్నారు వాలిగారు.

ఒక కానిస్టేబులు తాళ్ళను విప్పేశాడు. గోపీ అమ్మయ్య అనుకుంటూ అలసటతో మావైపు చూశాడు.

గోపీ వస్రాడు. అతని వయస్సు యిరవై లోపున వుండొచ్చు. అతడు సన్నగా, శుభ్రంగా వున్నాడు. అతడిలో ఏదో ఆకర్షణ వుంది.

"అబ్బాయి, నిన్నెవరు యిలా తాళ్ళతో కట్టారు?" వాలిగారు ప్రశ్నించారు.

"అతడు మాస్కు ధరించాడు సార్. నన్ను బలంగా పట్టుకొని, నోట్లో గుడ్డలు కుక్కి, తర్వాత నన్ను కట్టేశాడు" అన్నాడు గోపీ.

"అతడు ఈ గదిలోకి యెలా వచ్చాడు, హాల్లో నుంచా?"

"కాదు సార్. ఆ తలుపు తెర్చి వుంది. వెనకవైపు నుంచి అతడు ఈ గదిలోకొచ్చాడు. నన్ను కట్టేశాక అతడు హాల్లోకి వెళ్ళాడు."

"హాల్లో అప్పుడు ఎవరున్నారు?"

"రాధమ్మగారు మాత్రం వున్నారు. తమిళ సినిమా టి.వి.లో చూస్తున్నారు."

"నువ్వు సినిమా చూడ్డంలేదా?"

"అంతవరకూ చూసి నేను వంటగదిలోకి వచ్చాను. నా పని పూర్తవ్వాలిగా! వంట కాస్త ఆలస్యమైతే రవికాంత్ కి కోపం వస్తుంది" అన్నాడు గోపి.

"మాస్క్ ధరించిన మనిషి హాల్లో వెళ్ళాక నువ్వు ఏ చప్పుడైనా విన్నావా?"

"వినలేను, సార్. సినిమాలో టప్ టప్ కొట్టుకోవడం వినబడుతోంది."

వాలిగారు అతడివైపు సూటిగా చూశాడు.

"ఈ నైలాన్ తాడు ఎక్కడ దొరికిందతనికి?"

"అతడి బాగ్ లో వుంది, సార్."

"అతడు ఎలా వుంటాడు?"

"పొడుగ్గా, బలంగా వుంటాడు. పాంటు, స్లాక్ ధరించాడు. కాళ్ళకు బూట్లు వున్నాయి."

"రవికాంత్ వచ్చినదాకా నువ్వు యిలాగే వున్నావన్నమాట!"

"అవును సార్. ఇన్ స్పెక్టర్ గారొచ్చారు. తాళ్ళు విప్పవద్దన్నారు. మీరు వచ్చాక నాకు విముక్తి లభించింది, సార్."

వెనుక తలుపు మూసి వుంది. వాలిగారు గుమ్మంవైపు నడిచారు.

"ఈ తలుపును ఎవరు మూశారు?"

"నేను సార్. నేను వచ్చేసరికి అది తెర్చేవుంది. తలుపు మూసి గడియపెట్టాను. పోలీసు రిపోర్టిచ్చాను" అన్నాడు రవికాంత్!

తలుపు తెరిచి వాలిగారు పెరట్లోకి వెళ్ళారు. ఆయన వెనకనే నేనూ కదిలాను.

రవికాంత్ స్విచ్ నొక్కాడు. వెనుక లైటు వెలిగింది. నుయ్యి, పక్కనే రెండు అరటి చెట్లు, తులసి మొక్క, కొన్ని పూల మొక్కలు మాకు కనిపించాయి.

కొంచెం దూరంలో కాంపౌండు వాల్ వుంది. వాలిగారు గోడ దగ్గరకు వెళ్ళి అటువైపుకు చూశారు. అటువైపు ఏదో యిల్లుంది. ఇంటి చుట్టూ పెద్ద తోట వుంది.

"ఆ యిల్లు ఎవరిది?"

"ఆ ఇంట్లో ఏదో కంపెనీ వుంది, సార్" అన్నాడు రవికాంత్.

వాలిగారు పక్కనున్న ఇన్‌స్పెక్టర్ రామన్ వైపు చూశారు.

"రామన్ భాయ్, హంతకుడి వెనుక నుంచి వంట గదిలోకి వెళ్ళాడు. ఈ యింటి వెనక భాగానికి వెళ్ళాలంటే హాల్లోనుంచి యిలా రావాలి."

"అవును సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"హంతకుడు అటువైపునుంచి గోడదూకి యిక్కడకు వచ్చి వుండొచ్చు" అన్నారు వాలిగారు.

"అలాగే జరిగుండాలి" అన్నాడు రామన్.

వాలిగారు వెనక్కు తిరిగి, నూతి పక్కనే నిలబడి నూతిలోకి చూశారు. నీళ్ళకోసం ఎక్కువ లోతుకి వెళ్ళనక్కరలేదు. వర్షాల మూలంగా నూతిలో నీళ్ళు బాగా వున్నాయి.

ఆలోచిస్తూ వాలిగారు నూతిపక్కన కొంతసేపు పచార్లుచేశారు. ఆరిపోయిన చుట్టను లైటర్తో వెలిగించి,

పొగ పీల్చి వదుల్తూ ఆయన లోపలకు నడిచారు. నేనూ, గాామన్, రవికాంత్ వెనకనే వెళ్ళాం.

## 2

రవికాంత్ గది అందంగా వుంది. గోడలకు అంద మైన యువతుల ఫోటోలు అంటించబడినాయి. టేబుల్ మీద గిటార్ వుంది.

గదిలో వాలిగారు పచార్లుచేస్తూ అంతా చూస్తు న్నారు. నేనూ, రవికాంత్ తప్ప గదిలో మరెవరూ లేరు.

"అబ్బాయి, నీ తల్లి ఒంటిమీద చాలా నగలు వుండేవా?"

"వుండేవి, సార్. ఆమె ఒంటిమీదుండే నగల విలువ కనీసం ముప్ఫయి వేలుపైన వుంటుంది" అన్నాడు రవి కాంత్.

వాళ్ళ మాటల్లోని ముఖ్య అంశాలను నేను రాసు కుంటున్నాను.

"గోపీ ఎంత కాలంనుంచి ఇక్కడ పనిచేస్తున్నాడు?"

"రెండేళ్ళయింది, సార్, అతడు వచ్చి."

"అతడు యిక్కడికెలా వచ్చాడు?"

"అమ్మ ఎక్కడో అతడిని చూసింది. మంచివాడని భావించి యిక్కడకు తీసుకొచ్చింది. మొదటి రోజుల్లో ఛండాలంగా వండేవాడు. అతడికి అమ్మే వంట నేర్పింది."

"నీ తండ్రి లేడని విన్నాను. యేమయ్యాడతను?" అడిగారాయన.

"ఏడేళ్ళ క్రితం నాన్నగారు చాలా డబ్బు తీసుకుని వ్యాపారంమీద వెళ్ళారు. ఆయన తిరిగిరాలేదు. అమ్మ

పోలీసు రిపోర్టు యిచ్చింది. కాని పోలీసులు ఏమీ కను క్కోలేక పోయారు. డబ్బుకోసం యెవరో ఆయన్ని హత్య చేసి వుంటారని మా అనుమానం?"

"ఎవరి అనుమానం?"

"అమ్మ అలా అనుమానించింది. అప్పట్లో అటువంటి హత్యలు, దోపిడీలు జరుగుతూ వుండేవి."

"పత్రికల్లో మీ నాన్న ఫోటో ప్రచురించారా?"

"లేదు, సార్. అమ్మకు అంత డబ్బు ఖర్చు పెట్టడం గిట్టదు. బతికుంటే అతడే తిరిగివస్తాడని ఆమె వూరు కుంది."

"నువ్వు ఏం చేస్తున్నావు?"

"డి. ఎస్. యి. పాసయ్యాను. ఉద్యోగం కోసం వెతుకుతున్నాను."

వాలిగారు నవ్వుతూ అతడివైపు చూశారు.

"అబ్బాయి, నీ తలిదండ్రుల దాంపత్య జీవితం అన్యో న్యంగా సాగేదా?"

రవికాంత్ విచారంగా మా వైపు చూశాడు.

"అమ్మ ఒక్కగా నొక్క కుమార్తె. తలిదండ్రులు పోయాక వాళ్ళ ఆస్తంతా అమ్మకే వచ్చింది. ఈ యిల్లు అమ్మది. ఆమె డబ్బు చూసి నాన్న పెళ్లాడాడు అను కుంటారు. అమ్మంటే నాన్నకంతగా యిష్టం లేదని నా అభిప్రాయం."

"నీ తండ్రి నీకు బాగా గుర్తున్నాడా?"

"ఆయన వెళ్ళిపోయేసరికి నా వయస్సు పదిహేను సంవత్సరాలు, సార్. ఆయన అమ్మనూ, నన్నూ కూడా నిర్లక్ష్యంగానే చూసేవారు."

"అతడు ఏం వ్యాపారం చేసేవాడు?"

"ఆయన కమిషన్ యేజంటుగా వుండేవారని అమ్మ చెప్పింది."

"గోపీ గురించి నువ్వు ఏమంటావు?"

"కుర్రాడు సార్. చదువుకునే అవకాశం అతడికి లేకుండా పోయింది. అటువంటి వాళ్ళు దొరికిన అవకాశాన్ని వుపయోగించుకుంటారు. అదే చేస్తున్నాడు గోపీ" అన్నాడతను.

వాలిగారు చిరునవ్వుతో నావైపు చూశారు.

"గోపీని వంటవాడిగా నువ్వు యింట్లో వుంచుకుంటావా?"

"అమ్మ పోయాక నాకు వంటవాడు అవసరం అంతగా వుండదు, సార్. నాకెక్కడో ఉద్యోగం దొరుకుతుంది. అమ్మ మూలంగా యింతకాలం గోపీ యిక్కడ వుండగల్గాడు. ఇటుపైన వుండడు!"

"మీ అమ్మను గురించి నువ్వు ఏమంటావు?"

"నా తల్లి మంచిది. ఎవ్వరికీ ఆమె హాని చెయ్యలేదు. ఆమెకు శత్రువులు లేరని నా అభిప్రాయం. ఆమెను గురించి ఇంకా తెల్సుకోవాలంటే గోపీని అడగండి. నా కంటె యెక్కువగా అమ్మ గురించి అతడికి తెలుసు."

"బాగా చెప్పావు! గోపీని అడుగుతాను" అని వాలిగారు కొంతసేపు గదిలో పచార్లు చేశారు.

అమాంతంగా ఆయన రవికాంత్ వంక చూశారు.

"ఈ హత్యలో గోపీకి ఏదేనా సంబంధం వుందని నువ్వు అనుమానిస్తున్నావా?"

"గోపీ అంటే నాకంతగా యిష్టంలేదు. అయినా లేనిపోని అనుమానాలు వెలిబుచ్చి అతడిని బాధపెట్టడం

నాకు నచ్చదు. అమ్మను చంపవలసిన అవసరం అతడికి లేదని నా నమ్మకం. దిక్కులేని అతడిని ఆమె యింటికి తీసుకొచ్చింది. ఇంట్లో వుండమంది. వంట నేర్పి వంట వాడుగా వుండమంది. అమ్మ బ్రతికుంటే అతడు యిక్కడే వుండేవాడు. బయటకు పోవలసి వచ్చేది కాదు."

"నగల విషయం నువ్వు మర్చిపోయావు. ఆ డబ్బుతో ఏదో వ్యాపారం చేయొచ్చు" అన్నారు వాలిగారు.

"గోపీ వ్యాపారం చేయలేడు. అందుకు అనుభవం కావాలి. గోపీకది లేదు. గోపీ ఒక్కడూ ఇదంతా చేయడం అసంభవం, సార్. తన్ను తాను ఆ విధంగా నైలాన్ తాడుతో కట్టుకోలేడుగా!"

"అవును. అతడి చేతులు వెనక్కు లాగి కట్టబడి వున్నాయి. అతని సహచరుడు ఇదంతా చేసివుండొచ్చు."

"అంతవరకూ నా ఆలోచన వెళ్ళలేదు, సార్" అన్నాడు రవికాంత్.

"అబ్బాయి, హత్య కేసుల్లో అన్ని కోణాలనుంచీ చూడాలి. నీ తల్లి నీకు కావలసినంత డబ్బు యిచ్చేదా?"

"అమ్మ పిసినారని చెప్పానుగా! అమ్మను నూరు రూపాయలు అడిగితే ఐదు రూపాయలు ఆమె ఇస్తుంది. డబ్బును ఖర్చుపెట్టడం కంటె కూడబెట్టడంలో ఆమె కెంతో ఆనందం."

"ఇటుపైన నీ యిష్టమొచ్చినట్లు నువ్వు ఖర్చు పెట్టొచ్చు!" అన్నారాయన.

"ఆఫ్ కోర్స్, మీరు చెప్పింది నిజమే. కాని యింత కాలం తక్కువలో జీవించడానికి నేను అలవాటుపడ్డాను. ఒక్కసారి వేలకు వేలు ఖర్చుపెట్టలేనేమో అనిపిస్తోంది."

"ఒక విధంగా అదీ సత్యమే!" అన్నారు వాలిగారు.

చుట్ట పొగ పీల్చి వదుల్తూ అతడివంక చూశారు.

"నీ తల్లి ఏ గదిలో పడుకుంటుంది?"

"రండి, చూపిస్తాను" అన్నాడు రవికాంత్.

హాలుకి ఎడంవైపునున్న గదిలోకి వాలిగారు నడిచారు. వెనకనే వెళ్లాను.

విశాలమైన పడగ్గది. గదిలో లైట్లు వెల్గుతున్నాయి. గోడవారగా పెద్ద డబుల్ కాట్ వుంది. కాట్ పైన రెండు పరుపులు, తెల్లటి దుప్పటి నాకు అగుపించాయి.

టేబుల్ మీద కాసెట్ ప్లేయర్ వుంది. ఎన్నో కాసెట్లు రొటేటింగ్ స్టేండ్ లో అమర్చబడి వున్నాయి.

"ఆమెకు సంగీతమంటే చాలా ఇష్టమా?" వాలిగారు అడిగారు.

"సినిమా పాటలంటే ఎంతో యిష్టం. రాత్రిళ్ళు ఏవో పాటలు వింటేగాని ఆమెకు నిద్రరాదు" అన్నాడు రవికాంత్.

పడగ్గది నలువైపులా తిరిగి వాలిగారు అంతా చూశారు. ఒక ఫోటోమీద ఆయన చూపు నిల్చింది.

"ఎవరితను?"

"ఆయనే నా తండ్రిగారు రామారావుగారు" అన్నాడతను.

## 3

రాధమ్మ పడగ్గది పక్కనే ఒక గెస్టు రూమ్ వుంది. అందులో వుంటున్నాడు గోప్పి.

వాలిగారూ, నేనూ గోప్పి గదివైపు అడుగులు వేశాం. ఆయన మధ్యలో ఆగారు. కోటు జేబులోంచి రెండు రూపాయి కాయిన్స్ తీసి నాకిచ్చారు.

"గిరీ, గోప్పితో నేను మాట్లాడుతూ వుంటాను. రహ

స్వయంగా వంట గదిలోకి వెళ్ళి ఈ రూపాయి కాయిన్స్‌ను వుప్పు డబ్బాలో పడేసిరా" అన్నారు వాలిగారు.

ఆయన వైపు ఆశ్చర్యంగా చూశాను.

"ఎందుకు సార్?" అన్నాను.

"వుప్పులో ఈ రూపాయి కాసులు కరుగుతాయేమో చూద్దాం" అన్నారాయన.

ఆయన గోపీ గదిలోకి వెళ్లారు. నేను నవ్వుకుంటూ వంటగదిలోకి నడిచాను. వుప్పు డబ్బా యెక్కడుందో వెతికి అందులో రూపాయి కాయిన్స్ పడేశాను.

డైనింగ్ టేబుల్ పక్కనే నేలమీద పడున్న నైలాన్ తాడువైపు చూశాను. హంతకుడు ఈ తాడును బాగ్‌లో పెట్టుకొని తెచ్చాడు. దాన్ని బట్టి ఆలోచిస్తే ఈ హత్య ఏదో ప్లాను ప్రకారం జరిగి వుండాలి అనిపిస్తోంది.

రాధమ్మను చంపిన హంతకుడు గోపీని ఎందుకు చంపలేదు? చంపాలనే ఉద్దేశం అతడికి లేదేమో? గోపీని కట్టిపడేసి ఆమె నగలు పట్టుకుపోడం కోసం అతడు వచ్చుండాలి!

రాధమ్మ ఎదురుతిరిగి వుంటుంది. అతడితో పోట్లాడి వుండాలి! మరేం గత్యంతరంలేక అతడు ఆమెను చంపి వుండాలి!

ఈ ఇంట్లోకి గోడ దూకి వచ్చినవాడు సాధారణ దొంగ. కాని పరిస్థితులు అతడిని హంతకుడిగా మార్చాయి. ఇదంతా వాలిగారితో చెప్పాలి!

ఆలోచిస్తూ గోపీ గదిలోకి వెళ్లాను. గోపీ భయంగా వాలిగారివైపు చూస్తున్నాడు.

"నేను కాకినాడ సమీపంలో వున్న ఒక పల్లెటూరు

నుంచి యిక్కడకు వచ్చాను, సార్" అన్నాడు గోపీ.

"ఇంత దూరం ఎందుకొచ్చావు?"

"నా తండ్రి మళ్లా పెళ్లాడాడు. రోజూ నన్ను చావ దన్నేవాడు. అది భరించలేక కొంత డబ్బు దొంగతనంగా తీసుకొని ఇక్కడకు వచ్చేశాను."

"రాఘమ్మతో నీకు పరిచయం ఎలా అయింది?"

"మద్రాసు పట్నంలో ఏం చెయ్యాలో తోచక నేను పేవ్‌మెంటుమీద నడుస్తున్నాను. నా ముందు నడుస్తున్న ఒక స్త్రీ అరటిపండు తొక్కమీద కాలు వేసి కిందపడింది. పరుగెత్తుకెళ్ళి నేను ఆమెను లేవ దీశాను. హేండ్ బాగ్‌నుతీసి ఆమెకిచ్చాను. తర్వాత ఇద్దరం పక్కపక్కనే నడిచాం. నా పరిస్థితి ఆమెకు చెప్పాను. నన్నామె తన యింటికి తీసుకువెళ్ళింది. నాఖరుగా అక్కడ వుండమంది. అప్పటినుంచీ ఇక్కడే వుంటున్నాను, సార్" అన్నాడు గోపీ.

"ఆమె నిన్ను బాగా చూసేదా?"

"ఆమె చాలా మంచిది సార్. దేవతలాంటిది. నన్ను యెంతో ప్రేమతో చూసేది. ఈనాడు ఆమె లేనందుకు చాలా బాధపడుతున్నాను."

"రవికాంత్ గురించి ఏం చెప్పగలవు?"

"అతనూ తల్లీ డబ్బు గురించి పోట్లాడుకునేవారు. తక్కువలో జీవించడం నేర్చుకోమని ఆమె అతడిని హెచ్చరించేది. అది ఆతడికి ఇష్టంగా వుండేది కాదు.

"రవికాంత్ నిన్నెలా చూస్తాడు?"

"మొదటినుంచీ నేనంటే అతడికి, గిట్టదు, సార్. తన తల్లి నెలాగో ఆకర్షించి నేను ఇంట్లోకి చేరాననీ, ఎప్పుడో ఆమెను మోసం చేస్తాననీ అతడు అనేవాడు.

కాని ఆమె నవ్వి పూరుకు నేది."

అతడివైపు వాలిగారు సూటిగా చూశారు.

"ఈ ఇంట్లోకి వచ్చిన హంతకుడితో నీకు ఎటువంటి సంబంధమూ లేదా?"

"అతనెవరో నాకు తెలియదు, సార్. మీతో నేను జరిగినదంతా చెప్పాను."

ఇన్‌స్పెక్టర్ రామన్ గదిలోకి వచ్చాడు.

"వాలిగారూ, రాధమ్మ శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించాను."

"గుడ్ వర్క్" అన్నారాయన.

"మీరు ఏదైనా కనుక్కున్నారా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"రామన్ భాయ్, ఇంకా చీకట్లో తిరుగుతున్నాను" అన్నారు వాలిగారు, చుట్ట పొగ పీల్చి వదుల్తూ.

## 4

రవికాంత్ నా వైపు నవ్వుతూ చూశాడు.

"మీరు ఒంటరిగా వచ్చారా? వాలిగారు ఏరీ?" అన్నాడతను.

"ఆయన మరో పనిలో వున్నారు. ఆయన ప్రతిరోజూ ఇక్కడకు రాలేరు" అన్నాను సగర్వంగా.

హాల్లోని టి.వి. పక్కనే కాసెట్ ప్లేయర్ వుంది. అందులోంచి వెస్టర్న్ మ్యూజిక్ వినబడుతోంది. రవికాంత్‌కి ఒక సిగరెట్ ఇచ్చి, మరో సిగరెట్ నేను తీసుకున్నాను. ఇద్దరం సిగరెట్లు వెలిగించాం.

అతడు నా వంక నవ్వుతూ చూశాడు.

"వాలిగారంటే నాకెందుకో భయం!" అన్నాడతను.

"ఆయన్ని చూసి భయపడివలసిన అవసరం లేదు" అన్నాను.

అతడు సిగరెట్ పొగపీల్చి వదలడంలో నిమగ్ను డయ్యాడు.

"నువ్వు తరచు బీచ్‌కి వెళ్తూ వుంటావా?"

"చేతిలో బాగా డబ్బు ఆడితే మరెక్కడికేనా వెళ్ళొచ్చు. లేకపోతే, బీచ్‌కే వెళ్లాలి."

"నిన్న నువ్వు ఎవరితో వెళ్లావు?"

"గోపాల్, శ్యామ్‌లతో."

"వాళ్ళ అడ్రెసు చెప్పు."

"ఇదంతా ఎందుకు సార్?"

"ఫార్మల్‌గా అడుగుతున్నాను. చెప్తే నీకు ప్రమాదం రాదు. వాళ్ళతో నేను మాట్లాడాలి" అన్నాను.

రవికాంత్ గాభరాగా నా వైపు చూస్తూ వుండి పోయాడు.

"బీచ్‌కి వెళ్ళలేదా?"

"బీచ్‌కి వెళ్లాను, కాని గోపాల్, శ్యామలతో కాదు!"

అతనివైపు సూటిగా చూశాను.

"ఎవరితో వెళ్లావు?"

"లలితతో."

"ఎవరామె?"

"ఆమె ఒక ఫర్నిచర్ కంపెనీలో వుద్యోగం చేస్తోంది."

"ఆమెతో నీకెలా పరిచయమైంది?"

"బస్సులో ఒకేచోట ఇద్దరం బస్సు ఎక్కేవాళ్ళం. ఆమె వెనక నేను నిలబడేవాడిని. గతుకుల రోడ్లు, బస్సు

ప్రేమలు మమ్మల్ని ఇంకా దగ్గరగా లాక్కెళ్లేవి. ఆ విధంగా మా పరిచయం ప్రారంభమై ఇప్పుడు ప్రేమలోకి దిగింది."

"ఆమెను గురించి నీ తల్లికి తెలుసా?"

"ఇంతవరకూ తెలియదు."

"లలిత ఇంటికి వెళ్లావా? ఆమె ధనవంతుల బిడ్డా?"

"కాదు, ఆమె తండ్రి వుద్యోగం చేస్తున్నాడు, టైపిస్టుగా. ఆతడికి ముగ్గురు కూతుళ్ళు. పెద్దది లలిత. ఆమె ఇంటికి ఒకసారి వెళ్లాను. ఆమె తండ్రి నాతో చక్కగా మాట్లాడాడు."

టెలిఫోన్ మ్రోగింది. రవికాంత్ ఫోన్ దగ్గరకు వెళ్లాడు. నేను వేగంగా వంట గదిలోకి వెళ్లాను. అక్కడ గోప్పి లేదు. వుప్పు డబ్బాను పరీక్షించి తిరిగొచ్చాను.

రవికాంత్ ఇంకా మాట్లాడుతూనే వున్నాడు. అటువైపు వ్యక్తి లలిత అయివుండాలి!

మెల్లిగా రాధమ్మ పడగ్గదిలోకి వెళ్లాను. టేబుల్ మీదున్న రామారావు ఫోటోను నా కోటు జేబులో పడేసుకున్నాను.

హాల్లోకి తిరిగి వచ్చాను. రవికాంత్ ఉద్రేకంతో వాగేస్తున్నాడు. ప్రేమలో పడినవాళ్ళు ఎంతసేపైనా మాట్లాడుకోగలరు!

ఆఖరికి రసీవర్ పెట్టేసి రవింత్ సోఫాలో కూర్చున్నాడు.

"గోప్పి ఏడీ?"

"కూరలు కొని తెస్తానని వెళ్లాడు. కాస్సేపట్లో రావచ్చు."

రవికాంత్ సోఫాలోంచి లేచాడు.

"గిరి గారూ, క్షమించండి. స్నానం చేసి నేను బయట కెళ్ళాలి" అన్నాడతను.

"వెళ్ళి స్నానం చేయి. నేనొక ఫోన్ కాల్ చేసి వెళ్ళి పోతాను" అన్నాను.

అతడు విజిల్ వేస్తూ తన గదివైపు వెళ్ళిపోయాడు.

కాసెట్ ప్లేయర్ ఆగిపోయింది. ఫోన్ దగ్గర కెళ్ళి రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాను. అటువైపునుంచి ఆపరేటర్ కంఠం వినపడగానే, "రూమ్ నంబరు 40 కి కనెక్షన్ యివ్వండి" అన్నాను.

కాస్సేపట్లో కనెక్షన్ వచ్చింది.

"వాలి స్పీకింగ్!"

ఆయన కంఠం కంచులా మ్రోగింది.

"గిరిని, సార్. రవికాంత్ కి ఒక ప్రియురాలు వుంది. పేరు లలిత. నిన్న అతడు ఆమెతో బీచ్ కి వెళ్ళాడు. తన ఫ్రెండ్స్ తో వెళ్ళలేదని ఒప్పుకున్నాడు."

"గోపీ వున్నాడా?"

"ప్రస్తుతం అతను యింట్లో లేదు. కూరలు కొనడానికి వెళ్ళాడు. వుప్పు డబ్బాలో నేను పడేసిన రూపాయి కాసులు లేవు!"

"ఇంకా చెప్పవలసింది ఏదైనా వుందా?"

"రాధమ్మ భర్త రామారావు ఫోటో తీసుకున్నాను."

"గుడ్! గిరీ, వెంటనే యిన్ స్పెక్టర్ రామన్ ఆఫీసుకు వెళ్ళు. రాధమ్మ ఎప్పుడు మరణించిందో మనకు కావాలి."

"వెళ్ళి కనుక్కుంటాను" అన్నాను.

"అంతే" అన్నారాయన..

రిసీవర్ని పెట్టేసి బయటకు నడిచాను. రోడ్డమ్మట నడుస్తున్నాను. సంచి పట్టుకొని గోపీ వస్తున్నాడు.

"హలో సార్!" అన్నాడతను.

ఇద్దరం రోడ్డువారగా నిలబడ్డాం.

"ఇవాళ ఇంకా వంట చేయలేదా?"

"చెయ్య బుద్ధి కాలేదు సార్. ఇద్దరం కాఫీ తాగాం. ఆ ఇంట్లో నేను యెక్కువ రోజులు వుండలేను సార్."

"ఈ హత్య గురించి ఏదో తేలేవరకూ నువ్వు అక్కడే వుండాలి" అన్నాను.

## 5

రవికాంత్ యింట్లో లేడు.

హాల్లోకి వాలిగారూ, నేనూ వెళ్ళగానే గోపీ ఎదురయ్యాడు. తెల్లటి పైజామా, జుబ్బా ధరించాడతను. ఎవరేనా అతడిని చూస్తే వంటవాడని అనుకోరు.

"గోపీ!" పిల్చారు వాలిగారు.

అతను ఆయనవంక భయంతో చూశాడు.

"ఏదో నువ్వు నానుంచి దాస్తున్నావు!"

"దాచడానికి ఏముంది సార్?"

"వుప్పు డబ్బాలో నీకు రెండు రూపాయి కాయిన్స్ దొరికాయి. వాటిని ఏం చేశావు?"

"నేనే అక్కడ ఎప్పుడో పెట్టి వుంటానని భావిస్తూ వుంచుకున్నాను."

"నీలాటి కుర్రాడికి అంత మందమతి వుందంటే నేను నమ్మను!"

అతను మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయాడు.

"ఈనాడు రెండు రూపాయిలు తీసుకున్నట్లే ఆ నగల్నికూడా నువ్వే ఎక్కడో పెట్టివుండాలి!"

"సార్, ఏమిటి మీర నేరం?"

"ఆమెను హత్య చేసింది నువ్వే అయివుండాలి!"

అతడు కళ్ళు మూసుకున్నాడు.

"నన్ను తాళ్ళతో ఎవరు కట్టారో కూడా చెప్పండి, సార్!"

"రవికాంత్ నిన్ను తాళ్ళతో కట్టి వుండవచ్చు. మీలో మీకు పడకపోయినా మీ ఇద్దరికీ డబ్బు కావాలి. డబ్బుకోసం మీరు చేతులు కలిపి వుండొచ్చు" అన్నారు వాలిగారు గంభీరంగా.

అతడు వాలిగారివైపు కన్నీళ్ళతో చూశాడు.

"నన్ను ఇంటికి తీసుకొచ్చి ఎంతో ప్రేమతో చూసింది, సార్. ఆమెను చంపవలసిన అవసరం నాకు లేదు. ఆమె నాకు చాలా దగ్గరైంది సార్!"

"ఏ విధంగా?"

"అన్ని విధాలా. మనుషులకు కొన్ని అవసరాలు ఏర్పడుతూ వుంటాయి. ఆమె భర్త వెళ్ళిపోయి ఏడేళ్ళు దాటింది. ఆమె వయస్సులో నాకంటె పెద్దది. అయినా ఇద్దరం దగ్గరయ్యాం. తన సర్వస్వాన్నీ ఆమె నాకిచ్చింది."

"ఇది రవికాంత్‌కి యిష్టం లేదేమో!"

"ఇష్టం లేకపోయినా అతడు ఏం చేయగలడు? రవికాంత్ మా గురించి యెక్కువగా పట్టించుకునే వాడు కాదు."

వాలిగారు హాల్లో పచార్లు చేయసాగారు. చుట్టపొగ రింగుల్లో పైకి లేస్తోంది.

"వాలిగారూ, నేను హంతకుడినీ కాను, దొంగనూ కాను. ఆమె నగలమీద నాకు ఆశ వుంటే ఏ రాత్రో వాటిని పట్టుకొని పారిపోయి వుండేవాడిని" అన్నాడు

గోష్ఠి.

ఆయన నా వైపు తిరిగారు.

"గిరీ, పోదాం, పద!" అన్నారాయన.

# 6

పద్మినీ ఫర్నిచర్ మార్ట్ బోర్డు చూసి టాక్సీ డ్రయివర్ని ఆగమన్నాను. టాక్సీలోంచి దిగి లోపలకు వెళ్ళాను.

విశాలమైన గదిలో తళతళ మెరుస్తూన్న కుర్చీలు, బీరువాలు, సోఫాసెట్లు అందంగా అమర్చబడి వున్నాయి.

నలువైపులా చూశాను. యెక్కడా ఆడ ముఖం కన బడలేదు. ఒక ముసలతను కుర్చీలో కూర్చుని ఉత్తరాలు చూస్తున్నాడు. అతడి ముందుకు వెళ్లాను.

అతను నా వైపు ఎగాదిగా చూశాడు.

"ఏం కావాలి?" అడిగాడు.

"లలిత" అన్నాను.

"ఆమెకు నువ్వు కూడా బాయ్ ఫ్రెండువా?" ప్రశ్నించాడతను.

నవ్వాను.

"క్షమించాలి. నేనామెకు బాయ్ ఫ్రెండును కాను. రవికాంత్ ఆమెను ఒకసారి చూడమంటే యిలా వచ్చాను" అన్నాను.

"ఆమె రవికాంత్‌కు తగ్గదో కాదో చూడ్డానికి వచ్చావన్నమాట!" అన్నాడతను నవ్వుతూ.

"అవి వాళ్ళు తేల్చుకోవలసిన విషయం. ఆమె నా కళ్ళకు ఎలా వుందో చూసి రవికాంత్‌కి చెప్పగలను."

"మిస్టర్ నీ పేరు?"

"గిరి" అన్నాను.

"మీ ఫామిలీ గురించి విన్నాను. వి. వి. గిరిగారు ఒకప్పుడు మన ప్రెసిడెంట్ గా!"

నవ్వుతూ అతడివైపు చూశాను.

"ఆ గిరిగారు వేరు" అన్నాను.

అప్పుడే ఒక యువతి మెరుపులా లోపలకు వచ్చింది.

"అదుగో ఆమే లలిత!" అన్నాడు వృద్ధుడు.

ఆమె టేబుల్ వైపు వెళ్లాను. నవ్వుతూ ఆమెవైపు చూశాను.

"రవికాంత్ నిన్ను చూడమన్నాడు!"

"ప్లీజ్, కూర్చోండి" అందామె.

ఎదురుగా కుర్చీలో కూర్చుని ఆమెవంక చూశాను. లలిత చాలా అందమైన యువతి. ఆమెవైపు చూస్తూంటే యెంతో ఆనందంగా వుంది. రవికాంత్ కి సరైన పిల్ల.

"మీ పేరు?" అందామె.

"గిరి."

"మీరు రవికాంత్ చుట్టాలా?"

"రవికాంత్ నా ఫ్రెండు. అతడి తల్లి హత్య చేయబడిందిగా, అందుకని అతడింటికి వెళ్లాను."

"ఆ వార్త యివాళే నాకు తెలిసింది. చాలా బాధపడ్డాను."

ఆమెవైపు సూటిగా చూశాను.

"నిన్న సాయంత్రం మీరు ఎక్కడున్నారు?"

"ఆఫీసు నుంచి ఐదింటికి బయటకు వెళ్ళాను. రవికాంత్ బస్టేండులో నాకోసం ఎదురుచూస్తూ వున్నాడు. ఇద్దరం పిక్నిక్ హోటల్ కి వెళ్ళి టిఫిన్ తిన్నాం. తర్వాత బీచ్ కి వెళ్లాం. ఎనిమిదిదాకా బీచ్ లో కూర్చున్నాం. నన్ను మా ఇంటిముందు దిగబెట్టి రవికాంత్ అదే ఆటోలో

తన ఇంటికి వెళ్ళిపోయాడు" అందామె.

"ఆ తర్వాత అతడు నీతో ఎప్పుడు మాట్లాడాడు?"

"నేను ఆఫీసుకు రాగానే అతడికి ఫోన్ చేశాను. ఇద్దరం చాలాసేపు మాట్లాడాం. అప్పుడు తన తల్లి నెవరో హత్యచేశారని చెప్పాడు."

రవికాంత్ ఇంట్లో నేను వున్నపుడు అతడు ఫోన్‌లో మాట్లాడ్డం నాకు గుర్తుకొచ్చింది.

"లలితా, రవికాంత్‌కి యింకా ఉద్యోగంలేదు. అతడిని ప్రేమించి పెళ్ళాడదల్చావా?" అడిగాను.

"ష్యూర్, తప్పక పెళ్ళాడ్తాను. అతను చురుకైన యువకుడు. ఏదో ఉద్యోగం అతడికి త్వరలో దొరుకు తుంది."

కుర్చీలోంచి లేచాను. ఆమెవైపు నవ్వుతూ చూశాను.

"మీరిద్దరూ సుఖంగా జీవించాలని దేవుడిని ప్రార్థి స్తున్నాను."

"చాలా థాంక్స్, సార్" అందామె లేచి నిలబడి.

మెల్లిగా బయటకు నడిచాను. రవికాంత్, గోపీ ఈ హత్య చేసివుండరు. ఎవడో దొంగ ఈ హత్య చేసుం డాలి. ఆలోచిస్తూ వెళ్ళి టాక్సీలో కూర్చున్నాను.

"విన్‌సెంటు రోడ్డుకి పద!" అన్నాను టాక్సీ డ్రయి వర్‌తో.

గేటు దాటి టాక్సీ కాంపౌండులో ఆగింది. ఒక పేరు పొందిన లారీ కంపెనీ ఆఫీసది. కాంపౌండులో చాలా లారీలు వున్నాయి. రవికాంత్ ఇంటికి వెనకవైపున విన్‌సెంటు రోడ్డుంది.

లారీ పక్కనుంచి బిల్డింగ్ వెనుక వైపుకు వెళ్ళాను. ప్రహరీ గోడ దగ్గర నిలబడి అటువైపుకు చూశాను.

నుయ్యి, అరటి చెట్లు కనిపిస్తున్నాయి.

రవికాంత్ ఇంటి వంటగది తలుపు మూసి వుంది. ఇక్కడనుంచి గోడదూకి రవికాంత్ పెరట్లోకి వెళ్ళొచ్చు.

వెనక్కు తిరిగాను. లారీ ఆఫీసు టైమింగ్స్ చూశాను. రాత్రి తొమ్మిదిదాకా అది తెరిచి వుంటుంది. అనేకమంది వెళ్ళి పార్సిల్సును బుక్ చేస్తూ వుంటారు.

ఏ పార్సిలో బుక్ చేయడంకోసం వెళ్ళినట్లు హంతకుడు లోపలకు ప్రవేశించి వుండాలి. ప్రహరీ గోడ దగ్గర అతడు నిలబడి వుండాలి. వంటవాడు గోపీ తలుపు తీశాక అతడు లోపలకు వెళ్ళుండాలి!

గేటువైపు వడిచాను. వాచ్‌మన్ వైపు చూశాను.

"ఏం కావాలి సార్?" అన్నాడతను.

నా జేబులో వున్న మూడు ఫోటోలు అతడికి చూపించాను. వాటివైపు అతడు పరీక్షగా చూశాడు.

"ఆ ఫోటోల్లోని వాళ్ళెవరేనా నిన్న యిక్కడకు వచ్చారా?" ప్రశ్నించాను.

అతడు రెండు ఫోటోలు నాకు తిరిగిచ్చేశాడు. ఒక ఫోటోవైపు చూస్తూ వుండిపోయాడు.

"నిన్న రాత్రి ఇతడు రావడం చూశాను" అన్నాడతను.

నా ఆశ్చర్యానికి అంతులేదు. అతడివైపు సూటిగా చూశాను.

"సరిగ్గా చూసి చెప్పు!" అన్నాను.

"ఇతడు వచ్చాడు సార్. ఏదో పార్సిల్ తర్వాత వస్తుందని నాతో చెప్పాడు. ఇతడు గుర్తున్నాడు" అన్నాడు వాచ్‌మన్.

నా పరిశోధన జయించింది. వేగంగా వెళ్ళి యీ

వార్త వాలిగారికి చెప్పాలి! వాచ్‌మన్‌కి ధన్యవాదాలు అర్పించి టాక్సీలో కూర్చుని తలుపు మూశాను.

## 7

హోటల్ గదిలోకి వుషారుగా నడిచాను. ఇన్‌స్పెక్టర్ రామన్ వాలిగారి కెదురుగా కూర్చుని వున్నాడు.

"వాలిగారూ, డాక్టర్ రిపోర్టుబట్టి ఆమె 7-45, 8 మధ్య మరణించి వుండాలి. నిన్న టి.వి.లో సినిమా చూసిన వాళ్ళను అడిగి కొన్ని విషయాలు తెలుసుకున్నాను. ఆమెను హత్యచేసిన సమయంలో హీరో, విలన్‌ల మధ్య భయంకరమైన యుద్ధం సాగుతుందట" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

వాలిగారు మౌనంగా విన్నారు. చుట్ట పొగ పీల్చి వదులుతున్నారు. నేను కనుక్కున్నది ఇన్‌స్పెక్టర్ వెళ్ళాక చెప్దామని సోఫాలో కూర్చున్నాను.

"రామన్ భాయ్, వంట గదిలో గోపీ తాళ్ళతో కట్టబడి వున్నాడు. హాల్లోని ఇతర శబ్దాలను సినిమాలోని యుద్ధం చప్పుళ్ళు మింగేశాయి" అన్నారాయన.

"రైట్, సార్" అన్నాడు రామన్.

"రామన్ భాయ్, సాధారణంగా ఏ దొంగా ఏడు, ఎనిమిది ప్రాంతంలో ఇంట్లోకి ప్రవేశించడు. కాని ఈ హంతకుడు ఏడు, ఎనిమిది ప్రాంతంలో ఇంట్లోకి వచ్చాడు. ఆ ఇంటిని గురించీ, ఆ ఇంట్లో వుండే వాళ్ళను గురించీ అతడికి బాగా తెలిసి వుండాలి."

"దొంగతనాలు చేసేముందు దొంగలు యిళ్ళను కొన్ని రోజులపాటు పరీక్షిస్తూ వుంటారు సార్" అన్నాడు

ఇన్‌స్పెక్టర్ రామన్.

వాలిగారు కొంతసేపు కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ వుండిపోయారు. అమాంతంగా ఆయన పడక కుర్చీలోంచి లేచారు.

“[illegible] ఖాయమ్. రా[illegible] [illegible] [illegible]దం విచిత్రంగా వుంది. గొప్ప బలమైన [illegible] కాని [illegible] హంతకుడిని ఎదిరించలేక పోయింది. రాత్రి కూడా అతడిని ఎక్కువగా ఎదిరించి వుండదు. ఎదిరించే శక్తి ఆమెకు లేదు. [illegible] [illegible] హంతకుడు ఆమెను ఎందుకు చంపాడు?” అన్నారు వాలిగారు [illegible].

“అది పెద్ద ప్రశ్నే!” అన్నాడు ఇన్‌స్పెక్టర్.

“ఆ ప్రశ్నకు జవాబు నాకు తెలుసు. ఆమెను చంప వలసి వచ్చింది. అతడికి కావలసింది ఆమె నగలు కాదు, ఆమె ప్రాణం!” అన్నారాయన.

“నగలు కాదని మీరెలా అనగలరు?” ఇన్‌స్పెక్టర్ రామన్ అడిగాడు.

“నగలకోసం అతడు వెళ్ళుంటే అవి తీసుకొని, ఆమెను కట్టేసి అతడు పారిపోయేవాడు.”

“అవును, సార్” అన్నాడు రామన్.

“ఆమె నగలు పట్టుకుపోయి, వాటికోసం యిదంతా జరిగినట్లు మనల్ని నమ్మించడానికి అతడు ప్రయత్నించాడు. ఆమె సినిమా చూస్తూ వుంటుందని అతడికి తెలుసు. అందుకే ఆ సమయంలో ఇంట్లోకి వెళ్ళి తన పని ముగించి అతడు పారిపోయాడు. ఆమె బ్రతికుంటే అతడికేదో ప్రమాదం రావచ్చు! అందుకే అతడామెను హతమార్చాడు” అన్నారు వాలిగారు.

“ఇంతకీ ఈ హత్య ఎవరు చేసివుంటారు, సార్?”

ప్రశ్నించాడు రామన్.

"రవికాంత్, గోపీలు అయివుండరు" అన్నాను.

వాలిగారు నా వైపు విచిత్రంగా చూశారు.

"వాళ్ళు కాకపోతే మరెవరున్నారు?" అడిగాడు ఇన్స్పెక్టర్ రామన్.

నవ్వుతూ వాలిగారు పడక కుర్చీలో కూర్చున్నారు.

"రామన్ భాయ్, తొందరపడకు! హంతకులు అనుక్షణం భయపడుతూనే వుంటారు. రాధమ్మను చంపిన వ్యక్తి గుండె దడ నా చెవులకు వినపడుతుంది!" అన్నారు వాలిగారు సగర్వంగా.

ఇన్స్పెక్టర్ రామన్ ఆయనవద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

వుషారుగా ఆయన కెదురుగా వెళ్ళాను. నేను కనుక్కున్నదంతా ఆయనకు చెప్పాను.

"వాచ్ మన్ కి మూడు ఫోటోలూ చూపించాను, అతడు ఒక ఫోటోలోని వ్యక్తిని గుర్తుపట్టాడు. అతడు నిన్న రాత్రి లారీ ఆఫీసుకు వెళ్ళాడు. ఏదో పార్శిల్ తర్వాత వస్తుందని చెప్పి అక్కడ వున్నాడట" అన్నాను.

"ఎవరా వ్యక్తి?"

మూడు ఫోటోల్లో ఒక ఫోటో తీసి ఆయన కిచ్చాను. ఆయన విచిత్రంగా నవ్వారు.

"నా అనుమానం సరైన తోవమ్మట వెళ్ళిందని ఇది రుజావు చేస్తోంది" అన్నారాయన.

ఫోటోను ఆయన తీసుకున్నారు.

"గిరీ, ఇటుపైన మన పరిశోధన చక్రాలమీద నడుస్తున్నట్లు సాగుతుంది. ఈ వ్యక్తిని మనం వీలైనంత వేగంగా పట్టుకోవాలి! అతడి కోసం మనం వెతుక

తున్నట్లు తెలిస్తే పారిపోతాడు" అన్నారాయన.

"ఏం చేయాలో చెప్పండి!" అన్నాను.

"బోనులోంచి పారిపోయిన పెద్దపులిని మళ్లా బోనులోకి పంపడం అంత సులువైన పనికాదు. మనం రహస్యంగా ఆ పనికి వుపక్రమించాలి."

"అవును సార్" అన్నాను.

"ఈ ఫోటోకు 500 కాపీలు వెంటనే తీయించు. వెంటనే కాపీలు ఇచ్చే ఫోటో స్టూడియోలు యీ పట్నంలో ఎన్నో వున్నాయి. వాళ్ళకాపని అప్పగించు. కాపీలు వచ్చాక ఏం చేయాలో చెప్తాను."

ఆయనవైపు చూశాను.

"వాలిగారూ, ఈ ఫోటోను పత్రికల్లో ముద్రిస్తే బాగుంటుందేమో" అన్నాను.

"మన పని ఫలించదు. పత్రికల్లో ఈ ఫోటో వస్తే అతడు బెదిరిపోయి ఎక్కడికో ఎగిరిపోతాడు. ఒక చేప కోసం చెరువులో వెతకటం సులువు. అదే చేపకోసం అట్లాంటిక్ సముద్రంలో వెతకడం కష్టతరమవుతుంది" అన్నారాయన.

"మీరు చెప్పింది నిజమే. కాని ఈ ఫోటో కాపీలతో అతడిని ఎలా పట్టుకుంటాం?" ప్రశ్నించాను.

"కొత్త పద్ధతుల్లో వెళ్ళి కనుక్కుందాం. ప్రతిపాల డిపోకూ, రేషన్ షాపుకూ ఈ ఫోటో పంపుతాం. ఈ వ్యక్తి ఎక్కడో పాలు కొనాలి, ఎక్కడో రేషన్లు కొనాలి. అతడిని ఎవరేనా పోల్చవచ్చు. గిరీ పాల డిపోకు, రేషన్ షాపుకు అతడికి బదులు ఏ నౌఖరో వెళ్ళొచ్చు. ఈ ఫోటోను ఆ నౌఖరు పోలుస్తాడు."

"మంచి పద్ధతి సార్" అన్నాను.

"బస్సు కండక్టర్స్‌కు కూడా ఫోటో కాపీలు ఇస్తాం. ఎవరేనా పోల్చవచ్చు."

"రహస్యంగా పోల్చవచ్చు" అన్నాను.

"అదే మనకు కావలసింది" అన్నారు వాలిగారు.

"కాని 500 కాపీలు చాలకపోవచ్చు!"

"అవసరాన్ని బట్టి ఎక్కువ కాపీలు తీయించుదాం" అన్నారాయన.

ఫోటో తీసుకుని హుషారుగా బయటకు నడిచాను.

## 8

పట్నంలో నేను మోటార్ సైకిల్ మీద తిరుగుతున్నాను. కొన్ని వందల కిలోమీటర్లు ప్రయాణం చేసుంటాను.

అనేక షాప్ డిపోలకు వెళ్లాను. మా ప్రయత్నాలు ఫలించలేదు.

ప్రతి బస్ కండక్టర్ చేతిలోనూ అతడి ఫోటో వుంది. మొత్తం ఐదు వేల ఫోటో కాపీలను పంపిణీ చేశాం.

సివిల్ సప్లయిస్ షాపుముందు మోటర్ బైక్ ఆపి లోపలకు వెళ్లాను. బిల్లు చెల్లించేవాళ్ళు ఆ ఫోటో వైపు చూస్తున్నారు.

"ఇంకా యెవరూ పోల్చలేదు సార్" అన్నాడు గుమస్తా.

బయటకు నడిచాను. మోటర్ బైక్‌ని పోనిచ్చాను. వార్ ఫుటింగ్ మీద అతడిని పట్టుకోడానికి అనేక ప్రయత్నాలు సాగిస్తున్నారు.

నా మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. మేం ఎంత రహస్యంగా చేసినా అతడికోసం వెతుకుతున్నట్లు

తెలుసుకోకుండా వుంటాడా?

ఒక మందుల షాపునుంచి వాలిగారికి ఫోన్ చేశాను.

"హలో వాలి స్పీకింగ్!" అన్నారాయన.

ఆయన గదిలో అరడజను టెలిఫోనులు టెంపరరీగా అమర్చబడ్డాయి. అనేకమంది ఆయనకు రిపోర్టు చేస్తూ వుండాలి.

"గిరిని, సార్" అన్నాను.

అటువైపు మరో ఫోన్ మ్రోగింది.

"కాస్సేపు ఆగు" అన్నారాయన.

సిగరెట్ పీలుస్తూ నిలబడ్డాను. కొంతసేపయ్యాక ఆయన కంఠం వినబడింది.

"గిరీ, చెప్పు!"

"అనేక చోట్లకు వెళ్లాను. సిటీజోన్స్ 7, 8, 9, 10 పూర్తిగా చూశాను. పోల్చినవాళ్ళు ఎవ్వరూ లేరు."

"ఇంకా 11, 12, 13, 14 జోన్స్ నువ్వు చూడాలి" అన్నారాయన.

"అక్కడికి వెళ్తాను."

"గుడ్ లక్" అని ఆయన రిసీవర్ పెట్టేశారు.

జోన్ 11లో ఒకతను ఫోటోను పోల్చాడు. పాల డిపో మేనేజర్ ఆ వ్యక్తి అడ్రెసును నాకిచ్చాడు.

"మీరు వెళ్ళి అతడిని కల్సుకోండి. ఆ ఫోటోలోని మనిషి గురించి అతడు చెప్తాడు" అన్నాడతను.

తిరువేగంగా మోటర్ బైక్ని అతడిచ్చిన అడ్రెసుకు పోనిచ్చాను. ఒక గుడిసెలో వుంటున్నాడతను.

మోటర్ బైక్ చప్పుడు విని అతడు పరుగెత్తుకొచ్చాడు.

"ప్రేమ్‌రాజు నువ్వేనా?" అడిగాను.

"అవును సార్, నేనే."

"ఆ ఫోటోలోని మనిషిని నువ్వు పోల్చేవట!"

"అతడిని చూశాను, సార్."

"ఎక్కడ?"

"ఇందాకటినుంచి తల పగలగొట్టుకుంటున్నాను. కాని గుర్తు రావడంలేదు" అన్నాడతను.

మరో ఫోటోను అతడికిచ్చి పరీక్షగా చూడమన్నాను. అతను ఫోటోను కొంతసేపు చూస్తూ వుండిపోయాడు.

"ఇతడిని చూశాను, సార్."

"ఎక్కడ?"

జవాబు లేదు.

"టిఫిన్ తిన్నావా?"

"లేదు సార్."

"అలా వెళ్దాం పద" అన్నాను.

మోటర్ బైక్ని పోనిచ్చాను. అతను వెనక కూర్చున్నాడు. ఉడిపి లక్ష్మీ విలాస్ ముందు మోటర్ బైక్ ఆపాను.

ఇద్దరం లోపలకు వెళ్లాం. అతడి ముఖం చూస్తే ఆకలిగా వున్నట్లు కనిపిస్తున్నాడు.

బేరర్ రాగానే ఇడ్లీ, ఉప్మా, పూరీ వగైరా ఆర్డరిచ్చాను. వీర్రాజు ఆకలితో తినసాగాడు.

"నువ్వేం చేస్తున్నావు?"

"పాలపాకెట్లు ఇళ్ళకు ఇస్తూ వుంటాను, సార్."

"ఆ ఫోటోలోని మనిషి ఇంటికి పాలపాకెట్లు ఇస్తున్నావా?" అడిగాను.

"లేదు, సార్."

"అయితే ఎక్కడ చూసుంటావు?"

అతడికి హాట్ కాఫీ తెప్పించాను. ఇద్దరం కాఫీ

తాగుతున్నాం.

అమాంతంగా అతడు నా చెయ్యి పట్టుకున్నాడు.

"జ్ఞాపకం వచ్చింది, సార్" అర్చాడతను.

"చెప్పు" అన్నాను ఆత్రంగా.

"మీనాక్షి షేవింగ్ శలూన్‌లో చూశాను, సార్. అతడు నా పక్క కుర్చీలో కూర్చుని గడ్డం గీయించు కున్నాడు. నేను క్రాపు చేయించుకున్నాను."

"ఆ శలూన్ ఎక్కడుంది?"

"పదండి చూపిస్తాను" అన్నాడు వీర్రాజు.

పదినిమిషాల్లో శలూన్‌ముందు మోటర్ బైక్ ఆపాను. శలూన్ యజమానిని కలుసుకుని అతడికి ఫోటో చూపించాను.

"ఈయన పక్కనున్న స్ట్రీట్‌లో వుంటున్నారు, సార్. పేరు తిరుమలరావు" అన్నాడతను.

"ఇంటి నంబరు తెలుసా?"

"తెలియదు సార్. నీలిరంగు మేడ. ఆయన పైన వుంటున్నారు."

అతడికి థాంక్స్ చెప్పి బయటకు నడిచాను. వీర్రాజు చేతిలో ఐదురూపాయల నోటు పెట్టి వెళ్ళమన్నాను.

మోటర్ బైక్‌ను పక్కనున్న వీధమ్మట పోనిచ్చాను. మెల్లిగా వెళ్తూ ఇరువైపులా చూస్తున్నాను.

నీలిరంగు మేడ కనపించింది. మేడముందు మోటర్ బైక్ ఆపి నంబరు చూశాను.

నంబరు 112! వాణీ స్ట్రీట్! పూర్తి అడ్రెసు తెలిసింది. ఇప్పుడు ఏం చేయాలి? వాలిగార్కి రిపోర్టివ్వాలా? ఆలోచిస్తున్నాను.

వీర్రాజు పొరబడ్డాడేమో అన్న అనుమానం ఒక

వైపున నన్ను పీకు తింటోంది.

మోటర్ బైక్‌ను పోనిచ్చాను. వాలిగారితో మాట్లాడ్డం మంచిదనిపించింది.

ఒక మందుల షాపునుంచి వాలిగారికి ఫోన్ చేశాను.

"హలో, వాలి స్పీకింగ్ !"

"వాలిగారూ, అతడు దొరికాడు. వాణీ స్ట్రీట్, 112 నంబరు ఇంట్లో వుంటున్నాడు."

"పేరు మారుండాలి!" అన్నారాయన.

ఉలిక్కిపడ్డాను.

"అవును సార్. అతడి పేరు తిరుమలరావు."

"గిరీ, నువ్వు ఎక్కడున్నావు?"

"శబరీ మెడికల్ షాపు, వాల్‌టాక్స్ రోడ్డులో."

"నువ్వు అక్కడే వుండు. నేను వస్తున్నాను" అని ఆయన రిసీవర్ పెట్టేశారు.

ఫోను చేసినందుకు ఒక రూపాయి చెల్లించి రోడ్డు వారగా మోటర్ బైక్ మీద కూర్చున్నాను.

రెండు సిగరెట్లు కాల్చేశాను, కాని వాలిగారింకా రాలేదు. మూడో సిగరెట్ వెలిగించే ముందు ఆయన టాక్సీ కనిపించింది. సిగరెట్‌ని జేబులో పదేసుకుని టాక్సీ పక్కకు వెళ్లాను.

"గిరీ, కూర్చో!" అన్నారాయన.

టాక్సీలో కూర్చుని తలుపు మూశాను. టాక్సీ కదిలింది. ఎటు వెళ్లాలో డ్రయివర్‌తో చెప్పాను.

కాస్సేపట్లో నీలిరంగు మేడముందు టాక్సీ ఆగింది. ఇద్దరం కిందకు దిగాం. చిన్న గేటు తెర్చి లోపలకు వెళ్ళాం. పైకి వెళ్ళే మేడమెట్లు కుడివైపు నున్నాయి.

"నా వెనక నిశ్శబ్దంగా రా" అన్నారు వాలిగారు,

చప్పుడు చేయకుండా ఇద్దరం పైకి వెళ్లాం. తలుపు మూసి వుంది. వాలిగారు వేళ్ళతో తట్టారు.

కాస్సేపట్లో తలుపు తెరవబడింది. ముప్ఫయి ఏళ్ళ స్త్రీ మా వైపు విచిత్రంగా చూసింది.

"అమ్మాయి, తిరుమలరావు వున్నాడా?" వాలిగారు అడిగారు.

"లేరండి. ఆయన ఆఫీసుకెళ్లారు."

"ఎక్కడ పనిచేస్తున్నారు?"

"లక్ష్మీ ఏజన్సీస్ అనే కంపెనీని నడుపుతున్నారు."

"అదెక్కడుంది?"

"జార్జిటౌన్‌లో సాంబుదాస్ స్ట్రీట్‌లో."

"చిన్ననాటి మిత్రులం. అతడిని చూసిపోవాలని నా ఆశ" అన్నారాయన.

జేబులోంచి ఒక ఫోటో తీసి వాలిగారు ఆమెకు చూపించారు.

"ఈ ఇంట్లో వుండే తిరుమలరావు ఇతడేనా?"

ఆమె ఫోటో వైపు చూసింది.

"అవును, ఆయనే."

"ఆయన నీకేమవుతాడు?"

"నా భర్తండి."

"చక్కటి భార్యను సంపాదించాడు తిరుమలరావు" అన్నారాయన.

ఆమె ఫోటో వైపు యింకా చూస్తోంది.

"అమ్మాయి, ఏమిటంతగా చూస్తున్నావు?"

"నెలరోజుల క్రితం ఒక స్త్రీ ఇటువంటి ఫోటో తెచ్చి నాకు చూపించింది. ఆయన కావాలంది. లేరన్నాను. ఆమె ఎందుకో బాధపడ్తూ వెళ్ళిపోయింది" అందామె.

"ఆమె గురించి నీ భర్తకు చెప్పవలసింది."

"చెప్పాను సార్. ఆమెవరో తనకు తెలియదన్నారు."

వాలిగారు జేబులోంచి ఒక ఫోటోతీసి ఆమెకు చూపించారు.

"ఇక్కడికి కొచ్చింది ఈమేనా?"

"అవును, సార్, ఆమే!" అందామె.

"మీ పెళ్ళయి ఎంతకాలమైంది?"

"ఏడేళ్ళు దాటింది. మాకు యిద్దరు పిల్లలున్నారు" అందామె.

"సంతోషం. వెళ్ళొస్తాం" అని వెనక్కు తిరిగారాయన.

ఇద్దరం మెట్లు దిగాం. టాక్సీలో కూర్చున్నాం. టాక్సీ కదిలింది.

మోటర్ బైక్ పక్కనే టాక్సీ ఆగింది. కిందకు దిగాను.

"గిరి, టాక్సీ వెనకనే రా" అన్నారాయన.

టాక్సీ వేగంగా పోతుంది. వెనకనే మోటారు బైక్ని పోనిచ్చాను. వెనక అద్దంలోంచి వాలిగారి రూపం కనిపిస్తోంది.

సెంబుదాస్ స్ట్రీట్ లో ఒకచోట టాక్సీ ఆగింది. ఆయన కిందకు దిగారు. టాక్సీ పక్కనే మోటర్ బైక్ ఆపి, ఆయన వెనకనే లక్కీ ఏజన్సీస్ షాపులోకి వెళ్లాం.

విశాలమైన హాల్లో కొందరు గుమస్తాలు పనిచేస్తున్నారు. పక్కనున్న కాబిన్ మీద తిరుమలరావు పేరున్న ప్లాస్టిక్ బోర్డు వుంది.

వాలిగారు వెనక నేను అతడి కాబిన్ లోకి వెళ్లాం. మమ్మల్ని చూసి అతడు నవ్వుతూ కూర్చోమన్నాడు. ఇద్దరం కూర్చున్నాం.

"మీకేం కావాలి, సార్?" అన్నాడతను.

వాలిగారు జవాబివ్వలేదు. చుట్ట పొగ వదుల్తూ అతడివైపు చూశారు!

"నాకు చాలా పనులున్నాయి. ఏం కావాలో చెప్పండి."

"మేం మీతో వ్యాపారం చేయడానికి రాలేదు" అన్నారాయన.

పైకి ధైర్యంగావున్నట్లు నటించినా లోలోపల అతడు భయపడ్తున్నాడని చూపులు చాటుతున్నాయి.

అమాంతంగా వాలిగారు కుర్చీలోంచి లేచారు.

"రామారావు!" అన్నారు వాలిగారు.

అతడు అర్థంకానట్లు మావైపు చూశాడు.

"రామారావు ఎవరు?" అన్నాడతను.

"నువ్వే!"

"మీరు పొరబడుతున్నారు, సార్. యెక్కడికో వెళ్ళవలసినవాళ్ళు యిక్కడికొచ్చారు."

"మేం సరైన చోటుకే వచ్చాం."

అతడు కోపంగా బెల్లు మ్రోగించాడు. ఒక నౌఖరు కాబిన్‌లోకి రాబోయాడు.

"నిన్ను పిలవలేదు. పో బయటకు!" అన్నారు వాలిగారు కోపంగా.

నౌఖరు వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

"మిస్టర్ రామారావు, నువ్వు మాతో రావాలి!"

"ఎక్కడికి?"

"ఏడేళ్ళ క్రితం నువ్వు విడిచిపెట్టిన ఇంటికి."

"ఎందుకు?"

"అక్కడ అంతా తెలుస్తుంది" అన్నారు వాలిగారు,

"నేను రాను" అర్చాడతను.

అతడి చెయ్యి పట్టుకుని వాలిగారు బయటకు లాక్కు పోయారు. అతడిని టాక్సీలో కూర్చోబెట్టి ఆయన కూర్చున్నారు. టాక్సీ కదిలింది.

గుమస్తాలు మా వైపు గాభరాగా చూస్తున్నారు. టాక్సీ వెనకనే మోటార్ బైక్‌ని పోనిచ్చాను.

# 9

హాల్లో ఫ్లొరసెంట్ లైట్లు వెలుగుతున్నాయి. రవికాంత్ నా పక్కనే కూర్చున్నాడు. గోపీ ద్వారంలో నిల బడ్డాడు. వాలిగారి పక్కన ఇన్‌స్పెక్టర్ రామన్ కూర్చుని వున్నాడు.

ఒక కుర్చీలో కూర్చున్నాడు రామారావు. అతడికిరు వైపులా పోలీసులున్నారు.

"ఏం జరిగిందో చెప్పండి, సార్" అన్నాడు యిన్‌స్పెక్టర్ రామన్.

వాలిగారు అందర్నీ ఓసారి చూశారు.

"ఏడేళ్ళ క్రితం రాధమ్మ భర్త డబ్బుతో యేదో వ్యాపారంమీద వెళ్ళి మాయమయ్యాడు. అతడు ఎంతకూ తిరిగి రాలేదు. డబ్బు దోచుకుని యెవరో అతడిని చంపేసి వుంటారని రాధమ్మ భావించింది. కాని అతడు చావలేదు. తను ప్రేమించిన యువతిని పెళ్ళాడి, పేరు మార్చుకుని తిరుమలరావు పేరుతో సుఖంగా జీవిస్తు న్నాడు. ఇతడికి ఇంతకుముందే పెళ్ళయిందనీ, ఒక కొడుకు వున్నాడనీ, అతడి రెండో భార్యకు తెలియదు."

"ఆశ్చర్యంగావుంది"అన్నాడు ఇన్‌స్పెక్టర్ రామన్.

"సంవత్సరాలు దొర్లిపోయాయి. ఎక్కడో ఒకనాడు రాధమ్మ తన భర్తను చూసి వుంటుంది. అతడిని వెంటా

ఇల్లు కనుక్కుంది. అతను లేనప్పుడు ఇంటికి వెళ్ళింది. అతను మరో యువతిని పెళ్ళాడి సుఖంగా వున్నాడని స్వయంగా తెల్సుకుని. బాధపడుతూ ఆమె వెనక్కి వచ్చింది. ఇదంతా రామారావు విన్నాడు. తన జీవితం ఆనందంగా సాగిపోతోంది. రాధమ్మ తన ఇంటికి చిచ్చు పెడుతుందని అతను భయపడ్డాడు. అందుకే ఆమెను చంపవలసి వచ్చింది" అన్నారు వాలిగారు.

ఇన్‌స్పెక్టర్ రామన్ వాలిగారివైపు భక్తితో చూశాడు.

"రాధమ్మ భర్త ఈ హత్య చేసుంటాడని మీరు ఎలా వూహించారు?"

"ఆమెను చంపవలసిన అవసరం అతనికి తప్ప మరెవ్వరికీ లేదు."

"ఆమె గయ్యాళి. ఇక్కడ వున్నంతకాలం నన్ను పురుగులా చూసేది. అందుకే ఆమెను వదిలి వెళ్ళిపోయాను. ఆమె కంటబడ్డాక నాకిక సుఖం లేదని నాకు తెలుసు. ఆమె నన్ను వదలదు. రోడ్డుమీదకు ఈడుస్తుంది. అదంతా జరిగితే నేను సంఘంలో తలెత్తి తిరగలేను అందువలన తెగించి ఆమెను హత్యచేశాను" అన్నాడు రామారావు.

"వాలిగారూ, అతడి ఇల్లు సోదా చేశాం. రాధమ్మ నగలన్నీ ఒక పెట్టెలో మాకు దొరికాయి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రామన్.

వాలిగారు నావైపు చూశారు.

"గిరీ, రేపు అమృతసర్ వెళ్లాలి. ప్లేన్ టికెట్లు వెంటనే రిజర్వ్ చేయించు" అన్నారు వాలిగారు.

"అలాగే చేయిస్తాను, సార్" అన్నాను వినయంగా.

—:అయిపోయింది:—

# డేగ కళ్ళు

## బొమ్మిడి అచ్చారావు

"రిక్షాలో పోదాం!" అన్నాడు రామమూర్తి, సినిమా నుంచి బయటకు రాగానే.

"ఎందుకండీ డబ్బులు దండగ. నడిచే పోదాం. వెన్నెల రాత్రులు. పైగా మైలుకన్న మించని దూరం. సరదాగా సినిమా గురించి కామెంట్ చేసుకుంటూ వెళ్తే సరి!" అన్నది కమల.

భార్య వంక మురిపెంగా చూశాడు రామమూర్తి.

"అన్నివిధాల పొదుపు విషయంలో నాకు దీటైన దానివి. అయామ్ ప్రౌడ్ ఆఫ్ యూ!" అన్నాడు.

వాళ్ళుండేది చింతల్ బస్తీ. లక్డీ కాపూల్ వద్ద వున్న అమరావతిలో సినిమా చూసి వస్తున్నారు. దగ్గరేకదా అని రెండో ఆటకు బయల్దేరి వచ్చారు. పన్నెండుకు అయిదు నిమిషాల ముందుగానే షో వదిలేశారు.

జంక్షన్ దగ్గరకొచ్చారు.

ఒన్ వే ట్రాఫిక్ అక్కడ విడిపోయే జంక్షన్ అది.

రాత్రిపూట ట్రాఫిక్ రూల్సు పాటించరు చాలామంది వాహనం యజమానులు. ఓ రోడ్డు చుట్టు తిరిగి శ్యాం మీదుగా లక్డీ కాపూల్ ని టచ్ చేసుకుని టెలిఫోన్ భవన్ వైపు సాగిపోతుంది. ఓ రోడ్ ఖైరతాబాద్ వైపు రాజభవన్ రోడ్ కి, సోమాజిగుడాకి పోతుంది.

సరిగ్గా ఆ జంక్షన్ దగ్గర అనుకోని ఘోరం జరిగి పోయింది. అయోధ్యా హోటల్ వైపు నుంచి మహా వేగంగా దూసుకొచ్చిందో లారీ.

చెట్టాపట్టా లేసుకున్నట్టు అత్యంత సన్నిహితంగా నడుస్తున్న రామమూర్తి, కమల రోడ్డు ప్రక్కకు తొలిగి పోయారు.

అయినా .... లారీ నిర్దాక్షిణ్యంగా రామమూర్తిని కొట్టేసింది. అతను నేలమీద దొర్లిపోయాడు. లారీ అతన్ని చిత్తుగా తొక్కేసుకుని దూసుకుపోయింది.

కమల 'కెవ్వు'న అరుస్తూ రామమూర్తి మీద పడిపోయింది.

చెదురుమదురుగా రోడ్ మీద పోతున్న వాహనాలు ఆగిపోయి ఓ క్షణం ఆ దృశ్యం చూసి, తమకేం పట్టనట్టు దూసుకుపోతున్నాయి. అయితే, నడిచి వెళుతున్న వాళ్ళు బాగా దయగల వాహనాల యజమానులు మాత్రం ఆగిపోయి, రామమూర్తి చుట్టూ చేరారు.

హాస్పిటల్ కు తీసుకు వెళ్ళవలసిన అవసరం లేకుండా స్పాట్ లోనే ప్రాణాలొదిలేశాడు రామమూర్తి.

కమల గుండెలు పగిలేలా ఏడుస్తోంది. హృదయ విదారకంగా, అతి దయనీయంగా, చూసేవాళ్ళకు కంటనీరు తిరిగేలా అలా ఏడుస్తూనే వుంది.

# 2

"నువ్వా అమ్మాయి విషయం మర్చిపో! మన అంతస్థుకు సరితూగని వాళ్ళతో స్నేహం తగదని చెప్పాను కదా!" అన్నాడు మందలించే స్వరంతో రఘురామయ్య.

వేణుగోపాల్ కొద్ది క్షణాలు మౌనం వహించాడు. తండ్రి వంకే తదేక దీక్షతో చూస్తున్నాడు.

"నన్ను క్షమించు డాడీ! ఆ అమ్మాయిని మనసారా ప్రేమించాను. సుమ చాలా బుద్ధిమంతురాలు నాన్నా! మీరంటూరే సంప్రదాయం, వంశ గౌరవం—అంటూ—అవన్నీ ఆమెకు పుష్కలంగా వున్నాయి. పుష్కలంగా లేనిదల్లా డబ్బు మాత్రమే. అంతకుమించి అణకువ, నమ్రత, మంచితనం, చక్కటి నడవడి వున్నాయి. నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించింది. వాళ్ళ వైపునుంచి మా వివాహానికెలాంటి అభ్యంతరాలు లేవు. నువ్వు ఎస్సంటే చాలు!"

"గోపీ, నన్ను విసిగించకు. కుటుంబ సంప్రదాయం, సంస్కారంతో బాటు డబ్బుకూడా వుండితీరాలి! డబ్బు లేనివాడు నా దృష్టిలో యెందుకూ పనికిరానివాడు. వాడికి విలువలేదు. మాన్ విథౌట్ మనీ యీజ్ నథింగ్! గుర్తుంచుకో."

"మనకున్నది రెండు తరాలు కూచుని తిన్నా తరగదు కదా డాడీ! మీకు బ్రహ్మాండమైన వ్యాపారముంది. ప్రముఖ కంపెనీల్లో షేర్సున్నాయి. ఇంకా సంపాదించి ఏం చేసుకోవాలి? ఒక్కగానొక్క కొడుకును కదా, పెళ్ళివంటి ముఖ్యమైన ఘట్టం నా యిష్టంమీద జరగనివ్వకూడదా । డాడీ! డబ్బు మనిషికి సుఖాన్నివ్వగలదేమో

గాని, మానసికానందాన్నివ్వలేను డాడీ! రేపోసారి ఆ అమ్మాయిని తీసుకొస్తాను డాడీ! నీకు నచ్చకపోవట మంటూ జరగదు. గ్యారంటీ!"

రఘురామయ్య దీర్ఘంగా నిట్టూర్చి "ఇంతకీ యెవరా అమ్మాయి? తల్లీ తండ్రీ వున్నారా ?" అనడిగాడు.

తండ్రి అడిగిందే తడవు ఆమెగూర్చి చకచక వివరాలు ఏకరువు పెట్టాడు.

రఘురామయ్య తల పంకించి, "రేపు ఆ అమ్మాయిని యిక్కడకి తీసుకురా!" అన్నాడు.

"థాంక్స్ డాడీ, థాంక్స్ వెరీ మచ్!" అంటూ హుషారుగా బయటికి పరుగెత్తి స్కూటరు స్టార్టుచేసి మెరుపులా దూసుకుపోయాడు ప్రియురాలికి సందేశం అందించటానికి!

రఘురామయ్య ఏదో తీవ్రంగా ఆలోచించసాగాడు.

# 3

"పాపం, ఆ ఇల్లాలు దుఃఖం చూడలేకపోయాం. కరడు గట్టిన మా గుండెలే కరిగిపోయాయి" అన్నాడు క్రైం బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

అతని కెదురుగా డిటెక్టివ్ కిరణ్ కూచునివున్నాడు. ఇద్దరు గత రాత్రి జరిగిన లారీ యేక్సిడెంట్ గురించి మాట్లాడుకుంటున్నారు.

ఫైలులోంచి తలెత్తి చూశాడు కిరణ్. "ఇంతకీ యీ ప్రమాదం యేక్సిడెంటలా? లేక హత్యా ప్రయత్నమా?" అనడిగాడు.

"క్లియర్ యేక్సిడెంట్! అనుమానం లేదు."

"ఓసారి నేను స్పాట్‌ని చూస్తేనేగాని యే నిర్ణయం తీసుకోను!" అన్నాడు కిరణ్.

"దానికేం భాగ్యం, వెళ్దాం పద! .... డ్రైవర్ని పిలవనా?" అన్నాడు శ్రీనివాస్ లేచి హేట్ నెత్తిన పెట్టుకుంటూ.

"అక్కర్లేదు. నా టయోటాలో వెళ్దాం!"

"ఆల్ రైట్, పద!"

టయోటాని చింతల్ బస్తీకి పోయే అడ్డు రోడ్డువైపు తిప్పి నిలిపాడు కిరణ్. ఇద్దరు దిగారు.

ట్రాఫిక్కి అడ్డులేకుండా లారీ తీసేశారు గతరాత్రే. విపరీతమైన ట్రాఫిక్లో అసలు అక్కడ గతరాత్రి యేక్సిడెంట్ జరిగిన సూచనలేం కనిపించటంలేదు. అంతా యెవరి పనుల్లో వారు హడావిడిగా వాహనాలమీద ఉరుకులు పరుగులుగా పోతున్నారు. సైకిల్సు కూడా తక్కువేం కాదు! పట్టపగలు పచ్చి నెత్తురు రోడ్డుమీద కాల్వలు కట్టినా సర్వసామాన్యంగా భావించి పట్టించుకోకుండా పోవటం హైదరాబాదు నగరవాసుల ప్రత్యేకత!

"ఇదిగో లారీ యిలా వస్తోంది యీ డైరెక్షన్లో! ఆ దంపతులు యీ జంక్షన్ దగ్గర రోడ్డు క్రాస్ చేయబోయారు. లారీ యీ స్పాట్లో కొట్టింది రామమూర్తిని. వెంటనే ప్రాణం పోయింది!"

కిరణ్ శ్రీనివాస్ చెప్పిన వివరాలు వింటూ లారీ టైర్ల గురుతులు, యింకా పూర్తిగా ఆరని రక్తాన్ని లారీ రామమూర్తిని గుద్దిన స్థలంనించి, అతను లారీ చక్రాల కింద నలిగిపోయిన స్థలం వరకు వున్న దూరాన్ని పరిశీలనగా చూసి, కళ్ళతోనే అంచనావేశాడు.

దారినపోయే వాళ్ళెవరూ వాళ్ళిద్దర్నీ పట్టించుకోవటం లేదు. అంతా యెవరి పనుల్లో వారు హడావిడిగా సాగి

పోతూనే వున్నారు.

కిరణ్ అయిదు నిమిషాల తర్వాత టయోటావైపు నడుస్తూ "మీ పోలీసువాళ్ళు హత్యను, ఆత్మహత్యగానో, యేక్సిడెంట్ గానో తేల్చి పారేస్తారు. హంతకుడి బదులు నిర్దోషిమీద కేసు బనాయించేస్తారు. దోషి హాయిగా బయటి ప్రపంచంలో స్వేచ్ఛగా తిరుగుతూ తన ఓపికనంత మేరకు భూ భా రం తగ్గిస్తూంటాడు...." అన్నాడు నవ్వుతూ.

శ్రీనివాస్ కిరణ్ వాక్ప్రవాహాన్ని మధ్యలోనే ఆటంకపరిచి, "బ్రదర్, నీ మాటలతో నన్ను చంపొద్దు. ఈ కేసులో నేను పొరపాటేదయినా చేశానా?" అనడిగాడు.

"అద్దిలోనే రాంగ్ స్టెప్ వేశావు. ఇది యేక్సిడెంట్ కాదు. ప్లాన్డ్ మర్డర్!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ నోరు వెళ్ళబెట్టి, "అదేమిటి బ్రదర్ ...." అంటూ కిరణ్ చురుగ్గా చూడగానే ఆగిపోయాడు.

కిరణ్ విశదీకరించాడు. "యేక్సిడెంట్ అయితే లారీ కేవలం రామమూర్తిని మాత్రమే యెందుకు డాష్ యిచ్చింది? భార్యాభర్తలిద్దరు బాగా సన్నిహితంగా నడిచివెళుతున్నారు కదా! లారీ ప్రమాదవశాన డాష్ యివ్వటం జరిగితే యిద్దర్నీ కొట్టేసివుండేది. అదీగాక రామమూర్తిని డాష్ ఇచ్చాక అతను రోడ్‌కి పక్కగా పడిపోయాడు. వెంటనే బ్రేక్ వేశాడు డ్రయివర్. పైగా నల్లగా అరిగిన గురులు కనిపించటంలేదూ! డ్రయివర్ భయపడి పారిపోయేవాడే అయితే బ్రేక్ వెయ్యడు. వేసినా వెంటనే స్పీడు పెంచి పారిపోతాడు. ఈ కేస్‌లో అలా జరగలేదు. బ్రేక్ వేసి కావాలని లారీని రోడ్ మీద

నుంచి సైడుకి అంటే రామమూర్తి కిందపడిపోయిన సైడుకి దించి, రామమూర్తిని నుగ్గు నుగ్గుచేసి అప్పుడు పారిపోయాడు. చూసేవాళ్ళు యేక్సిడెంట్ అని చక్కగా నమ్మేసేలా జరిగిన హత్య ఇది!"

కిరణ్ టయోటా పోలీస్ స్టేషన్ ముందు ఆపి, "రామమూర్తి భార్య కమలను అడిగితే కొన్ని ముఖ్యమైన విషయాలు తెలియవచ్చు" అన్నాడు.

ఇంతలో సార్జంట్ శివం టయోటా దగ్గరకొచ్చి ఇద్దరికీ సెల్యూట్ చేసి, శ్రీనివాస్‌తో, "హోటల్ రాజ్‌లో హత్య జరిగిందని ఇప్పుడే సమాచారం అందింది సార్. మీకోసమే యెదురు చూస్తున్నాం!" అన్నాడు.

శ్రీనివాస్, కిరణ్ వంక తిరిగి, "టయోటా పక్కగా తీసి పెట్టు. జీప్‌లో వెళ్దాం! ప్లీజ్ ...." అన్నాడు.

కిరణ్ తలూపి, టయోటా పార్కు చేశాడు.

అప్పటికే ఫోటోగ్రాఫర్, వేలిముద్రల నిపుణుడు, పాథాలజిస్టు హెడ్‌క్వార్టర్సునించి వచ్చేలా చేశాడు శివం. సిబ్బంది అంతా జీప్‌లో కూచున్నారు.

జీప్ హోటల్ రాజ్ వైపు దూసుకుపోయింది.

## 4

హోటల్ రాజ్‌లోని ముప్పయితొమ్మిదో నంబరు రూం దగ్గర గుమిగూడిన జనం పోలీసుల్ని చూడగానే దారిచ్చేశారు. కొందరు మెల్లగా జారుకున్నారుకూడా.

కిరణ్, శ్రీనివాస్, గదిలోకి చొరబడ్డారు.

మంచంమీద అస్తవ్యస్తంగా పడివున్నదో స్త్రీ. ఆమె కాళ్ళు మంచంమీది నుంచి నేలమీదకు వాలివున్నాయి. వెల్లకిలా పడివున్నది. కనుగుడ్లు మూతలు పడకుండా ఇంకా దేన్నో చూస్తూన్నట్టే భ్రాంతి కలి

గిస్తున్నాయి చూసేవాళ్ళకు.

కంఠం దగ్గర రంధ్రం కనిపిస్తోంది నల్లగా. చుట్టూ రక్తం పేరుకుపోయి ఉన్నది. తెల్లటి పక్కమీద ఎర్రటి రక్తం జుగుప్స కలిగిస్తోంది.

ఆమె వయసు ఇరవై రెండేళ్ళుండవచ్చు. కనకాంబరం రంగు ప్రింటెడ్ చీర కట్టింది. మేచింగ్ బ్లౌజు వేసుకుంది. కట్టుబొట్టు తీరు చూస్తుంటే వెకిలితనం యెక్కడా కనిపించటంలేదు. మంచి కుటుంబంలో నుంచి వచ్చిన అమ్మాయిలాగానే ఉన్నది.

కిరణ్ వంగి ఆమె కంఠం దగ్గర పడిన రంధ్రం గురించి పరిశీలనగా చూసి, "చాలా దగ్గర్నుంచి పిస్తోలుతో కాల్చాడు హంతకుడు. వెంటనే ప్రాణం పోయి వుండాలి! బ్లడ్ ఫ్లూజింగ్ కొనసాగుతునే వుంది. రిగర్ మార్టిస్ ప్రారంభం కాలేదు. హత్య జరిగి ఆరేడు గంటలలోపే అయివుండాలి!" అన్నాడు.

పాథాలజిస్టు తలూపి, "యూ ఆర్ రైట్ మిస్టర్ కిరణ్! ఇప్పుడు ఉదయం పదకొండు గంటలు కావస్తోంది కదూ. హత్య తెల్లవారుఝామున నాలుగున్నర అయిదు గంటలమధ్య జరిగి వుండాలి!" అన్నాడు.

కిరణ్ హోటల్ మేనేజర్ని "ఈమె పేరేమిటి? ఈ గదిలో ఎప్పుడు దిగింది? ఈమె ఒక్కతేనా వెంట యెవరైనా వున్నారా?" అడిగాడు.

మేనేజర్ గొంతు సవరించుకుని, "ఈమె పేరు నిర్మల సార్! నిన్న రాత్రి బాగా పొద్దుపోయాక, అంటే పదిన్నర గంటలకు ఈమె మరొక యువకుడితో మా హోటల్ కొచ్చింది. ఆ యువకుడు అన్ని సౌకర్యాలున్న

సింగిల్ రూం కావాలన్నాడు. మేం ఆడవాళ్ళం ఎలవ్ చెయ్యమని చెప్పాం. ఈమె తన భార్య అనీ, జడ్చర్ల నుంచి వచ్చామనీ, రేపు యిక్కడ సెక్రటేరియట్‌లో పనుందని అది చూసుకుని రేపు సాయంత్రం జడ్చర్ల తిరిగి వెళ్ళిపోతామనీ చెప్పాడు. మేము అనుమానించ టానికి అవకాశం లేకపోయింది. ఈమె అల్లరి చిల్లర పిల్లలాగా చీప్‌గా కనిపించలేదు. షీ మిస్ వుమన్. అందుకే రూమిచ్చాం.

"ఉదయం ఆరు గంటలకి ఆ యువకుడు బయటికి వెళ్ళటం మా వాచ్‌మన్ చూశాడు. అంత ఉదయమే ఎందుకు వెళుతున్నాడోనని అనుమానం వచ్చినా అడ గటం భావ్యంకాదని వూరుకున్నాడట. ఉదయం డ్యూటీలోకి వచ్చిన రూం బాయ్ ఎనిమిది గంటల వరకు చూసి కాలింగ్ బజ్జర్ నొక్కాడట. జవాబు రాకపోవ టంతో ఇంకా నిద్రపోతున్నారనుకుని వూరుకున్నాడట. కాని పదిగంటలకి ఎందుకో అనుమానం వచ్చి తలుపు తోశాడట. వెంటనే తెరుచుకున్నాయట. బెడ్‌మీద ఈమె శవాన్ని చూడగానే గోలగా అరుస్తూ అందర్నీ పిలిచాడు. నేను విషయం తెలుసుకుని వెంటనే పోలీ సులకి ఫోన్ చేశాను" అన్నాడు.

కిరణ్ సాలోచనగా తలూపి, "ఆ యువకుడి పేరు....?" అన్నాడు.

"మన్మథరావు."

"ఇన్‌మేట్స్ రిజిష్టర్ తెప్పించండి" అన్నాడు కిరణ్.

మేనేజర్ తెప్పించిన రిజిష్టర్ నుంచి మన్మథరావు అడ్రసు నోట్ చేసుకున్నాడు కిరణ్.

"మన్మథరావు యెలా వుంటాడో వర్ణించి చెప్ప

గలరా?" అన్నాడు కిరణ్.

మేనేజర్ వివరించి చెప్పాడు. కిరణ్ శ్రద్ధగా విన్నాడు.

ఈలోపల తక్కిన సిబ్బంది తమ పనులు పూర్తిచేసుకున్నారు.

కిరణ్ గదినంతా పరిశీలనగా చూశాడు. ఒక ఏర్ బ్యాగ్‌లో 'లా'కు సంబంధించిన కొన్ని పుస్తకాలు ఓ చీర, లంగా, జాకెట్టు వున్నాయి. గదిలో యెక్కడా మన్మధరావు తాలూకు గుడ్డలుగాని, వస్తువులుగాని లేవు. లాబుక్స్‌మీద నిర్మల పేరు అందంగా రాయబడి వున్నది. అంటే యీమె లా కోర్సు చదువుతున్న విద్యార్థిని అన్నమాట!

గదిలో యెలాంటి ఆధారాలు దొరకలేదు. మన్మధరావు దొరకకుండా చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు. కాని .... కాని .... అతని పేరు కరెక్టు కాకపోవచ్చు. అడ్రసు కూడా తప్పుదే అయివుంటుంది! హత్య చేయాలనుకున్నవాడు తన కరెక్టు పేరు, అడ్రసు యెందుకిస్తాడు?

"జడ్జ్‌చర్ల వెళ్దామా?" అడిగాడు శ్రీనివాస్.

"మనం అనవసరం. సార్జెంటు నెవరినైనా పంపుదాం. నా ఊహే నిజమయితే యీ అడ్రసు, ఈ పేరు కూడా బోగస్‌వే కావచ్చు."

శ్రీనివాస్ తలూపాడు. అతనికీ ఆ విషయం అంతక్రితమే తట్టింది.

"అయితే....నిర్మల కాలేజి గర్ల్ అని తెలుస్తోంది కదా, 'లా'కాలేజికి వెళ్దామా?"

"వెళ్దాం! శవాన్ని మార్చ్యురీకి తరలించు!"

# 5

'లా కాలేజిలో యెంక్వయిరీ చేయగానే తెలిసిపో యింది నిర్మల అక్కడ చదువుతున్నట్టు.

"మన్మథరావనే కుర్రాడెవరైనా మీ కాలేజిలో చదువుతున్నాడేమో చెప్పగలరా?" అనడిగాడు కిరణ్ ప్రిన్సిపాల్ ని.

ఆయన నిర్మల క్లాస్ మేట్సుని యిద్దర్ని పిలిపించాడు. వారివల్ల మన్మథరావనే పేరుగల కుర్రాడెవరూ లా కోర్సులో లేడని తెలిసింది.

"మీ కభ్యంతరం లేకపోతే లా కోర్సు చదివే స్టూడెంట్సు నామినల్ లిస్టు ఇవ్వగలరా?" అన్నాడు.

ప్రిన్సిపాల్ సిన్సియర్ గా "బై ఆల్ మీన్స్! ఇంతకీ యెందుకో చెప్పారు కాదు!" అన్నాడు.

ఇన్ స్పెక్టర్ శ్రీనివాస్ హేట్ తీసి పట్టుకొని "సారీ టు యిన్ఫాం సర్, నిర్మల నెవరో హోటల్ రాజ్ లో హత్య చేశారు!" అన్నాడు.

నిర్ఘాంతపోయినట్టు చూశాడు ప్రిన్సిపాల్.

క్షణాలమీద యీ వార్త లా కాలేజిలో పాక్కి పోయింది. స్టూడెంట్సు ఒక్కుమ్మడిగా ప్రిన్సిపాల్ రూం వైపు దూసుకొచ్చారు.

ప్రిన్సిపాల్ వెంటనే హాలిడే డిక్లేర్ చేసి, సంతాప సభ ఏర్పాటు చేశాడు.

నిర్మల క్లాస్ మేట్సులో సునంద అనే అమ్మాయి ఆసక్తికరమైన విషయాన్ని తెలియచేసింది.

"నిర్మల మన్మథరావుని ప్రేమించిందో లేదో తెలీదు గాని, ఆ పేరుగల యువకుడితో క్లోజ్ గా మూవ్ కావటం నాకు తెలుసు. బహుశా యిద్దరు పెళ్ళిచేసు

కుంటారని అనుకున్నాం" అంది.

కిరణ్ శ్రీనివాస్ ఊపిరి బిగపట్టి విన్నారు.

"అయితే మన్మధరావు రోజా ఆమెను కలుసుకునే వాడా?"

"ఎప్పుడైనా వస్తుండేవాడు."

"అతని ఫోటో చూపిస్తే గుర్తుపట్టగలరా?"

"తప్పక!"

"మన్మధరావుండే దెక్కడో మీకు తెలుసా?"

"తెలియదండి. కాని యిక్కడే యెక్కడో పని చేస్తుండే వాడట!"

"హైదరాబాదులోనేనా?"

"అవునండి. యేం ఉద్యోగమో తెలీదు. ఆఫీసో, ఫ్యాక్టరీయో, యేదో తెలీదు. కేవలం ఉద్యోగి అని మాత్రం తెలుసు."

"నిర్మల మీ క్లాస్‌మేట్సు ఎవరితోనైనా క్లోజ్‌గా తిరిగేదా?"

"ఏమో, ఆ విషయం నాకు తెలియదు."

"నిర్మల కారెక్టర్ గురించి .... సారీ, అడగక తప్పటం లేదు...."

"ఫరవాలేదండి ...ఆమెకి స్వేచ్ఛాభావాలు ఎక్కువ. మగాళ్ళతో చాలా ఫ్రీగా మూవ్ అవుతుంది. స్వేచ్ఛగా తిరిగినంత మాత్రాన ఆమె బరితెగించి తిరుగుతుందేదని కాదు! ఆమె గురించి మా అందరికి సదభిప్రాయమే ఉండేది."

"చాలా థాంక్సండి. మంచి విషయాలు చెప్పారు. అవసరమైతే మళ్ళీ కలుస్తాం!" అన్నాడు కిరణ్.

సునంద నమస్కారం చేసింది.

# 6

కిరణ్, శ్రీనివాస్ స్టేషన్‌కి తిరిగొచ్చేసరికి జడ్చర్ల నించి సమాచారం తీసుకొచ్చాడు సార్జంటు శివం.

"సార్, మన్మథరావిచ్చిన అడ్రసు కరెక్టే! అతను జడ్చర్ల నివాసే. తల్లిదండ్రులు అక్కడే ఉన్నారు. అయితే ఓ సంవత్సరంనించీ అతను హైదరాబాదులోనే ఉంటున్నాడట ఉద్యోగరీత్యా. బాజార్ ఘాట్ ఏరియాలో ఓ రూం తీసుకుని వుంటున్నాడట. ఇంకా పెళ్ళి కాలేదు. ఈ మధ్య యెవరో అమ్మాయిని ప్రేమించానని, ఆ పిల్లని చేసుకుంటానన్నాడనీ అతని తల్లి చెప్పింది. ప్రతి ఆదివారం జడ్చర్ల వస్తుంటాడట" అన్నాడు.

కిరణ్, శివం దగ్గర అడ్రసు తీసుకుని చూశాడు.

"ఇన్‌స్పెక్టర్, మన్మథరావుని కలుసుకుని వద్దాం పద!" అన్నాడు కిరణ్.

బాజార్ ఘాట్‌లోని మన్మథరావు రూం పట్టుకోవటానికి యిరవై నిమిషాలకన్న పట్టలేదు.

ఆ గది మెయిన్ హౌస్‌కి కొంచెం దూరంగా విడిగా ఔట్ హౌస్‌లాగా వుంది.

తలుపులు లోపలివైపు గడియపెట్టినట్టుగా వుంది. బయట తాళం పెట్టిలేదు.

కిరణ్ తలుపు కొట్టబోయాడు. తలుపులు లోపల గడియ పెట్టిలేవు. కొడుతుంటే కొద్దిగా తెరుచుకున్నాయి.

తలుపులు తెరుస్తూనే విస్తుపోయి నిల్చుండిపోయాడు కిరణ్.

ఎదురుగా రెండు కుర్చీలు, ఓ టీపాయ్, దానిమీద స్కాచ్ విస్కీ బాటిలు, రెండు గ్లాసులు ఉన్నాయి. అదికాదు, కిరణ్‌ని ఆశ్చర్యపరచిన అంశం, ఓ కుర్చీమీద

ఓ యువకుడు ఒరిగిపోయి ఉన్నాడు. అతని కుడిచెయ్యి టీపాయ్‌మీద గ్లాసు పట్టుకునే వుంది. ఎడమ చెయ్యి నేలమీదికి తాకుతూ ఆనుకుని వుంది. అ స్తవ్య స్తంగా ఒరిగి వున్నాడతను.

శ్రీనివాస్ కిరణ్ భుజాలమీదుగా లోపలి దృశ్యం చూశాడు. "మై గాడ్, మన్మధరావు...." అంటూ లోపలికి గెంతాడు. నేలకు వాలిన చెయ్యి పట్టుకుని చటుక్కున వదిలేశాడు. మంచుగడ్డలా తగలగానే శరీరం కట్టెలా బిగుసుకుపోయింది. రిగర్ మార్టిస్ ప్రారంభమై చాలా సేపయినట్టు అర్థం చేసుకున్నారు.

కిరణ్ గదిని పరిశీలనగా చూశాడు. ఓ టూబ్యులర్ మంచం, రెండు కుర్చీలు, టీపాయ్, గోడ అలమారలో టేప్ రికార్డరు టు-యిన్-వన్, కాసెట్స్, ఓ సూట్ కేసు, ఓ ఎర్ బాగ్, కిటికీలో ఓ కూజా, గాజు గ్లాసు, గదిలో చెల్లాచెదురుగా పడివున్న ఖాళీ బీరు సీసాలు నాలుగు కనిపించాయి.

గోడకి రెండు అర్థనగ్న స్త్రీల చిత్రాలు, ఓ గ్రూప్ ఫోటో తగిలించబడి వున్నాయి.

శ్రీనివాస్ ఇంతలో సార్జంట్ శివాన్ని పిలిచి, "హెడ్‌క్వార్టర్సుకి ఫోన్ చేసి సిబ్బందిని పిలు! మరో కేస్" అన్నాడు.

శివం వెళ్ళిపోయాడు.

కిరణ్ ఫోటోలోని వ్యక్తుల్ని గుర్తు పట్టడానికి ప్రయత్ని స్తున్నాడు. అది బి.యస్సీ. ఫైనలియ్యర్ స్టూడెంటున్న గిన ఫోటో. కాలేజి బేచ్ నంబరు, మౌంట్ పైన డిగ్రీ వాళ్ళ పేర్లు మౌంట్ దిగువున ప్రింటు చేయబడి వున్నాయి.

మూడు వరసల్లో స్టూడెంట్సు నిలబడి వుండగా వాళ్ళ దిగువన కుర్చీల్లో స్టాఫ్ మెంబర్సు, క్లాస్ రిప్రజెంటేటివ్ కూచునివుంటే, గర్ల్ స్టూడెంట్సు దిగువ వరసలో స్టాఫ్ వాళ్ళ దగ్గరకొచ్చేలా కూచుని వున్నారు నేలమీద, తివాసీమీద.

మన్మధరావుని గుర్తుపట్టాడు కిరణ్ రెండో వరసలో. లేడీ స్టూడెంట్సులో, నిర్మలను గుర్తుపట్టాడు. అతనికి లింక్ విడిపోయినట్టనిపించింది.

నిర్మల, మన్మధరావు క్లాసు మేట్సు బియ్యేలో. తర్వాత నిర్మల లా చదువుతుంటే, మన్మధరావు మాత్రం చదువాపేసి ఉద్యోగంలో చేరివుంటాడు. కాని వాళ్ళ స్నేహం అలా కొనసాగుతునే వుంది.

అయితే, మన్మధరావు నిర్మలని ఉత్త పుణ్యానికి యెందుకు చంపినట్టు?.... ఇతన్నెవరు చంపారు?....ఎలా చంపారు?

కిరణ్ దృష్టి టీపాయ్‌మీదున్న రెండో గ్లాసుమీదకి పోయింది. అతని మెదడులో మెరుపులు మెరిశాయి. దగ్గరగా వెళ్ళి పరీక్షగా చూశాడు.

రెండు గ్లాసుల్లోను విస్కీ పోసి వున్నది. రెండో గ్లాసు సగానికి పైగా విస్కీతో వుంది. మన్మధరావు చేతిలోని గ్లాసులోని ద్రవం ఖాళీ అయింది. అయినా యింకా కొంత అడుగున మిగిలే వుంది.

కిరణ్, మన్మధరావు వంక పరిశీలనగా చూశాడు. శరీరం రంగు నీలి రంగుకి తిరిగి వుంది.

"ఆత్మహత్యంటావా?" అన్నాడు శ్రీనివాస్ దగ్గరగా వచ్చి కిరణ్‌తో.

కిరణ్ "నో, మర్డర్! ఆ రెండో గ్లాసు హంతకుడిది.

డాక్టరు రాగానే మన్మథరావు తాగిన గ్లాసు కెమికల్ ఎనాలిసిస్‌కి పంపు! నా ఊహే నిజమైతే ఆ విస్కీలో విషం కలిసింది" అన్నాడు.

తన అవివేకానికి నిందించుకున్నాడు శ్రీనివాస్, అంతదాకా ఆ రెండో గ్లాసు గురించి ఆలోచించనందుకు.

"విస్కీ బాటిల్ మీద, ఆ రెండో గ్లాసుమీద హంతకుడి వేలిముద్రలు దొరుకుతాయి. మందు పార్టీ అరేంజి చేసి, మన్మథరావు ప్రాణాలు తీశాడు. లేదా మన్మథరావు అరేంజి చేసివుంటే, అదును చూసి అతని గ్లాసులో సైనేడ్ కలిపి చంపేశాడు. తర్వాత తీరిగ్గా లేచి వెళ్ళిపోయాడు. యజమాని ఇల్లు దూరంగా ఉండటంవల్ల యెవరూ గమనించి ఉండరు— పోయిన రాత్రే జరిగివుండాలి! అందుకే రిగర్ మార్టిస్ కూడా ప్రారంభమయి చాలా సేపయింది" అన్నాడు కిరణ్.

సార్జంట్ శివం తిరిగొచ్చి "ఇన్ఫాం చేశాను సార్!" అన్నాడు.

కిరణ్ అతనివైపు తిరిగి "హోటల్ రాజ్ మేనేజర్ని వెంటనే రమ్మని పిలువు!" అన్నాడు.

శివం వెళ్ళిపోయాడు.

ఈలోపల ఫోటోగ్రాఫరు, డాక్టరు, వేలిముద్రల నిపుణుడు వచ్చి తమ పనుల్లో మునిగిపోయారు. వాళ్ళొచ్చిన పదినిమిషాల తర్వాత హోటల్ రాజ్ మేనేజర్ కార్లో వచ్చి దిగాడు.

మన్మథరావు శవాన్ని చూసి పెదవి విరిచి, "ఇతను మన్మథరావు కాదు సార్!" అన్నాడు మేనేజర్.

కిరణ్ నవ్వి, "ఈ శవం మన్మథరావుదే! మీ హోటల్లో దిగిన వ్యక్తి, అదే నిర్మలని హత్యచేసిన

వ్యక్తి పేరు మాత్రం మన్మథరావు కాదు....ఇదిగో, ఈ గ్రూప్ ఫోటోలో నిర్మల సోకాల్డ్ హజ్బెండ్ హంతకు డున్నాడేమో చూసి చెప్పండి" అన్నాడు.

మేనేజర్ గ్రూప్ ఫోటోను చూసి, "లేదు సార్! ఇందులో నిర్మలమాత్రమే ఉంది, అతను లేదు" అన్నాడు. అతను ఫోటోలో మన్మథరావుని, శవంతో పోల్చుకుని తల పంకించాడు.

"ఆల్ రైట్, మీరు వెళ్ళొచ్చు" అన్నాడు కిరణ్. మేనేజర్ కార్లో వెళ్ళిపోయాడు వెళ్తూ, "ఈ హత్య మూలంగా మా కష్టమర్స్ ఒక్కసారిగా తగ్గిపోయారు సార్! మా హోటల్లో రూం దొరకటమంటే గగనం. అలాంటిది దాదాపు అన్ని రూంస్ ఒకేసారి ఖాళీ అయి పోయాయి" అన్నాడు విచారంగా.

విస్కీ గ్లాసుని ఎనాలిసస్‌కి, శవాన్ని మార్చ్యురీకి పంపించే ఏర్పాట్లు చేశాడు శ్రీనివాస్. డాక్టరు కూడా కిరణ్ చెప్పినట్లే అది విషప్రయోగమని చెప్పాడు.

శ్రీనివాస్, కిరణ్‌తో ఏం చేద్దామన్నట్టు చూశాడు.

"నిర్మల ఇంటికి వెళ్ళిరావాలి!" అన్నాడు కిరణ్.

## 7

"సుమ కనిపించటంలేదు డాడీ!" అన్నాడు వేణు గోపాల్ దిగులుగా ముఖం పెట్టి.

రఘురామయ్య ఆశ్చర్యంగా చూశాడు. "ఎక్కడి కైనా వెళ్ళిందేమో, దానికింత ఆత్రుత దేనికి?" అన్నాడు.

"అలా అంటావేం డాడీ, సుమ ఇంట్లో చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళదు. నిన్న కాలేజికి వెళ్ళిన అమ్మాయి యింటికి రాలేదని వాళ్ళమ్మగారు ఒకటే కంగారు పడు తోంది. నాతో గాని యే సినిమాకైనా వెళ్ళిందేమో

ననుకున్నదట. రాత్రి రెండుగంటలైనా తిరిగిరాక పోవటం చూసి సుమ వాళ్ళన్నయ్య పోలీసు రిపోర్టిచ్చాడట. సుమ నాన్నగారు తాశీల్దారుతోబాటు కేంప్ వెళ్ళారట. మూడు రోజులలో ఆయన ఊళ్ళో లేడు! వాళ్ళకి కాళ్ళు చేతులు ఆడ్డంలేదు."

"మరి నిన్న సాయంత్రం నాకు చెప్పిం తర్వాత ఆ అమ్మాయిని కల్సుకోలేదా?"

"కల్సుకోవాలనే వెళ్ళారు. కాని అప్పటికి సుమ కాలేజినించి తిరిగిరాలేరు. ఆరుగంటలవరకు చూసి మళ్ళీ వెళ్దామనుకుంటే చిన్ననాటి స్నేహితుడు అనుకోకుండా బజార్లో తారసపడి, బలవంతంగా సినిమాకు లాక్కుపోయాడు. సినిమా అయ్యాక హోటల్లో భోజనానికి తీసుకుపోయాడు. అది ముగిసేసరికి రాత్రి పదకొండ యింది. ఆ టైంలో సుమ వాళ్ళింటికి వెళ్ళటం భావ్యం కాదని యింటికొచ్చేశాను.

"ఈ రోజు తెల్లవార్తూనే బయల్దేరి వెళ్ళాను కదా! తీరా వెళ్ళి అడిగేసరికి యిదీ సంగతి! ఈ రోజు ఆ అమ్మాయిని నీకు చూపిద్దామనుకున్నాను. ఇంతలో అనుకోకుండా ...." వేణుగోపాల్ మాటలు మింగేశాడు. అతని మనసు అస్థిరంగా వుంది. అతని కళ్ళు యెర్రగా వున్నాయి. రాత్రంతా కొడుకు నిద్రపోకుండా యీ రోజుకోసం ఎదురు చూశాడని రఘురామయ్యకి తెలుసు.

"పోలీసు రిపోర్టిచ్చారంటున్నావు కదా, విషయం తెలుస్తుంది కదా...."

"అలా అంటావేమిటి డాడీ. ఎప్పుడూ యిల్లు వదిలి వెళ్ళని అమ్మాయి కాలేజినుంచి యింటికి రాకపోతే యెలా వుంటుంది తల్లిదండ్రులకి? నా మటుకు నాకే

అప్పుడే ఏదో జరిగిపోయుంటుందని భయంతో చెమట్లు పట్టేసున్నాయి...."

"ధైర్యం వహించు. ఆమెకేం ప్రమాదంలేదు. యే స్నేహితురాలింటికైనా...."

"నో, డాడీ! నాకు తెలియని స్నేహితురాళ్ళెవరూ లేరామెకు. ఈ సంగతి తెలిసిన వెంటనే స్కూటర్ మీద వాళ్ళందరి యిళ్ళు తిరిగేశాను. నా దురదృష్టం కాకపోతే ఆ స్నేహితుడు నిన్నే కనపడాలా నాకు? వాడు యెదురుపడకపోతే నిన్ననే సుమను దక్కించుకునేవాడిని! నాతో ఏ రెండో ఆట సినిమాకో వెళ్ళిందని సుమ తల్లి, అన్న అనుకుని వుండకపోయే వాళ్ళు, అందరం తలోవైపు వెతికి పట్టుకునే వాళ్ళం!...."

"డోంట్ అప్‌సెట్ మై బాయ్. ఆమె యెక్కడో క్షేమంగానే వుంటుంది."

## 8

"ఎవరు నువ్వు? నన్నెందుకు తీసుకువచ్చావిక్కడికి?" కోపంగా అడిగింది సుమ.

అతను కోరగా చూశాడామె వంక.

"నేనెవరో నీకు తెలియకపోయినా నీ గురించి నాకు బాగా తెలుసు. కాబోయే తాసీల్దారుగారి ముద్దుల కూతురివి. నా శత్రువు వేణుగార్ని ప్రేమించిన వయ్యారివి...." నవ్వాడు.

సుమ చప్పున చల్లారిపోయింది.

"ప్లీజ్. నన్ను వదిలిపెట్టు. వేణుకి ఏక్సిడెంటయిందని నువ్వు చెబితే నిజమేనని గుడ్డిగా నమ్మేసి నీకూడా వచ్చేశాను. కారు ఎటు పోతూందో కూడా తెల్సుకోకుండా

వచ్చేశాను నీ వెంటపడి. నన్నిలా మోసం చేసి ఇక్కడకు తీసుకువస్తావనుకోలేదు.”

అతను వికృతంగా నవ్వాడు. నవ్వినపుడు పెదవులు నోటి చివరివరకూ చీలి అసహ్యం పుట్టిందామెకు. అతను దగ్గరగా వచ్చాడు. ఆమె కళ్ళల్లో కళ్ళు పెట్టి చూశాడు. భావయుక్తంగా నవ్వాడు.

“నిన్ను .... ఏమీ చెయ్యను. పెంచుకుంటాను” నవ్వాడు. “పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను. నీలాంటి అతిలోక సౌందర్యవతిని నేలమీద నడవనివ్వను. పరాయి వాళ్ళ కళ్ళు నీమీద పడితేనే మాసిపోతావనిపించే అపురూపమైన సౌందర్యం నీది! అది నా స్వంతం చేసుకోవా లనుకోవటం నా స్వార్థమా? ఉహుఁ! కాదు. ఆరాధన.. భక్తుడు దేవిని ఆరాధిస్తాడు, సేవిస్తాడు. నేనూ అంతే నీపట్ల!” కళ్ళు అరమూసి అతను ఏవేవో లోకాల్లో తేలిపోతూ అంటున్నాడు.

సుమకు, అతను — రాజకుమార్తెలను ఎత్తుకుపోయి తన మందిరంలో బంధించి వాళ్ళను పెళ్ళాడమని వేధించే జానపద కాలంనాటి మాంత్రికుడులా కనిపిస్తున్నాడు.

“ప్లీజ్, నన్ను మా ఇంట్లో దించెయ్యి. మా వాళ్ళు నాకోసం ఎదురుచూస్తుంటారు. నా వేణు నాకోసం పిచ్చెత్తిపోతాడు. మేమిద్దరం త్వరలో పెళ్ళిచేసుకో బోతున్నాం. నీకు చేతులెత్తి దణ్ణం పెడతాను. మా యిద్దర్నీ విడదీయకు! నీకు ఆజన్మాంతం ఋణపడివుంటాను, నన్ను మా యింట్లో దించెయ్యి!”

“వేణుకన్న అపురూపంగా చూసుకుంటాను. అతని కన్న నేనే ఐశ్వర్యవంతుడ్ని. అతనికన్నా అందగాడ్ని.

పైగా నువ్వంటే ఆరాధిస్తున్నవాణ్ని .... నీకు అన్ని విధాలా తగినవాణ్ని. నన్ను కాదనవని కొండంత ఆశతో వున్నవాణ్ని ....నీ కీ యింట్లో సకల మర్యాదలూ జరుగుతాయి. నీ యిష్టం లేకుండా నిన్ను బలవంతం చెయ్యను. ఇంకోగంటలో నీకు పంచభక్ష్యపరమాన్నాలతో భోజనం పంపిస్తాను. ఆరిగించి నన్ను కృతార్థుణ్ని చెయ్యి" నాటక ఫక్కీలో అంటూ ఆమె కళ్ళలోకి చూసి నవ్వాడు. అతడి రేగ కళ్ళను ఎదుర్కొనే ధైర్యం లేనట్టు సుమ కళ్ళు వాల్చేసుకుంది.

అతను వెళ్ళిపోయాడు.

ఫోం బెడ్ మీద కూలబడి పైన తిరుగుతున్న ఫేన్ వైపు చూస్తూ ఉబికివచ్చే దుఃఖాన్ని ఆపుచేసుకోవటానికి విఫల ప్రయత్నం చేసి, దిండులో తల దాచుకుని భోరుని ఏడ్చేసింది సుమ.

# 9

పాథాలజిస్టు పంపిన పోస్టుమార్టం పరిశీలనగా చూస్తున్నాడు కిరణ్.

అది నిర్మల పోస్టుమార్టం రిపోర్టు.

నిర్మల హత్య చేయబడటానికి ముందు రతిక్రియలో పాల్గొన్నది. ఆమెను బలవంతంగా ఎవరూ అనుభవించలేదని, ఐచ్ఛికంగా స్వచ్ఛందంగా ఆమె యిష్టంమీదే రతి జరిగినట్లు డాక్టరు స్పష్టం చేశాడు!

"దీన్నిబట్టి హంతకుడితో నిర్మలకు చాలా సన్నిహిత సంబంధమున్నదని రూఢి అయిపోయింది. మన్మథరావుతో విచ్చలవిడిగా తిరిగి వుండదు. హంతకుడు ఆమెను నమ్మించి, ఆమెతో సంబంధం పెట్టుకున్నాడు. ఆమెను చంపటానికి బలమైన కారణమేదో వుండాలి....ఆమెను చంపేముందు

స్వేచ్ఛగా ఆమెను అనుభవించాడు కూడా. అంతే. ఆమె మీద వ్యామోహం చాలా బలంగానే వుండివుండాలి" అన్నాడు కిరణ్ ఫైలు శ్రీనివాస్ ముందుకి జరుపుతూ.

"ఇంతకీ మన్మధరావుని చంపినవాడే నిర్మలను చంపాడనుకోవటానికి యేలాంటి ఆధారాలు లేవు. నిర్మలకన్న ముందు మన్మధరావుని చంపేశారు. నిర్మలని చంపిన హంతకుడు ఆమెతోబాటు హోటల్ రాజ్‌లో రాస క్రీడల్లో వున్నాడు. ఒకే వ్యక్తి అక్కడ మన్మధరావుతో మందు సేవిస్తూ, ఇక్కడ నిర్మలతో సెక్సువల్ ఇంటర్ కోర్సులో ఎలా వుండగలడు?"

"వెరీ సింపుల్. హోటల్ రాజ్‌కి, మన్మధరావు రూంకి దూరం ఎంతో లేదు గమనించావా? మన్మధరావుని బాగా తాగించి, తను మాత్రం తాగకుండా జాగ్రత్త పడ్డాడు. మన్మధరావుని చంపి, మళ్ళీ హోటల్‌కి చేరుకోవటం కష్టం కాదు...." టెలిఫోన్ తన ముందుకి లాక్కుని రింగ్ చేశాడు. అట్నుంచి యెవరో పలికారు.

"హల్లో హోటల్ రాజ్ యేనా? మేనేజర్ కావాలి."

"ఎస్. మేనేజర్ స్పీకింగ్!"

"గుడ్‌మార్నింగ్ మేనేజర్ సాబ్. నిర్మలని హత్య చేసిన వ్యక్తి ఆ రాత్రి మధ్యలో బయటకెక్కడికైనా వెళ్ళివచ్చాడేమో చెప్పగలరా?"

"ఒక్క నిమిషం లైన్లో ఉండండి సార్! ఆ రాత్రి డ్యూటీలో ఉన్న రిసెప్షనిస్టు నడిగి చెబుతాను...." అని ఓ నిమిషం తర్వాత, "హలో....ఆ రాత్రి పదకొండున్నరకి, అంటే నిర్మలని రూంలో వదిలిన గంట తర్వాత ఆ వ్యక్తి బయటకు వెళ్ళి ఓ గంటలో తిరిగొచ్చి తన

రూంకి వెళ్ళిపోయాడట ..."

మేనేజర్‌కి థాంక్స్ చెప్పి ఫోన్ పెట్టేశాడు కిరణ్. మన్మథరావు పోస్టుమార్టం రిపోర్టుతీసి, హాత్యా సమయం చూశాడు. రాత్రి పన్నెండు ఒంటిగంట మధ్య విష ప్రయోగం జరిగినట్టుంది రిపోర్టులో. శ్రీనివాస్ కి చూపించాడు.

"రెండు కేసుల్లోను హంతకుడు ఒకడే నన్నమాట కన్ఫర్మ్ అయింది....విస్కీ బాటిల్ మీద రెండో గ్లాసు మీద ఉన్న వేలిముద్రలు ఒకే వ్యక్తివనీ టాలీ అయింది. విస్కీ బాటిల్ మూతి దగ్గర మాత్రం ఒకచోట మన్మథరావు వేలిముద్రలున్నాయి. అయితే బాటిల్‌ని హేండిల్ చేసింది హంతకుడే! అతని వేలిముద్రలు స్పష్టంగా దొరికాయి. వాటిని తుడిచే ప్రయత్నం చెయ్యలేదు హంతకుడు" అన్నాడు శ్రీనివాస్.

"అంతేకాదు హోటల్ గదిలో దొరికిన వేలిముద్రలు మన్మథరావింట్లోని విస్కీ బాటిల్ మీద వేలిముద్రలతో టాలీ అయ్యాయి. దాన్నిబట్టే చెప్పెయ్యొచ్చు— రెండు కేసుల్లోను హంతకుడు ఒకడేననీ, మన్మథరావు ఆత్మ హత్య చేసుకోలేదు, హత్యచేయబడ్డాడనీను" అన్నాడు కిరణ్.

"అప్పటిదాకా హంతకుడ్ని సూచించే ఎలాంటి ఆధారాలు దొరకలేదు, వేలిముద్రలు తప్పితే."

"ఎస్. నిర్మల ఇంట్లో కూడా ఆమె మొగ స్నేహి తుల గురించి వివరాలు యెవరూ చెప్పలేకపోయారు. బహుశా చనిపోయిన కూతురు గురించి చెడుగా చెప్పు కోవటానికి ఆమె తల్లి మనసంగీకరించలేదనుకుంటాను."

# 10

"నువ్వా, యెందుకొచ్చావు? నా బతుకెలా మండి పోయిందో చూద్దామని వచ్చావా?.... వెళ్ళు, దయచేసి వెళ్ళిపో!" అన్నది కమల తర్జనితో వీధివైపు చూపిస్తూ.

తాపీగా కుర్చీ జరుపుకుని కూచుని, సిగరెట్ తీసి పెదాలమధ్య వుంచుకుని, లైటర్ తో వెలిగించుకుని గుండెలనిండా పీల్చుకుని రింగు రింగులు సీలింగ్ వైపుకు పొగ వదుల్తూ నవ్వాడు అతను.

ఆమె అసహ్యంగా చూసింది. ఆ రేగకళ్ళు చూస్తూనే వికారంగా ఉన్నట్టు ముఖం తిప్పుకుంది.

రేగకళ్ళ యువకుడు మళ్ళీ నవ్వాడు.

"డియర్, నన్నెందుకు ద్వేషిస్తావు? నిన్ను ఆరాధించిన ఆత్మీయుడ్ని, నిన్ను పెళ్ళి చేసుకోవటానికి ఒకప్పుడు ఉవ్విళ్ళూరి వూరి, నువ్వు పరాయి సొత్తు అయిపోవటంతో కుళ్ళి కుళ్ళి యేడ్చినవాడ్ని .... నువ్వు నమ్ముతావో లేదో నీమీద నాకున్న ప్రేమ నీ పెళ్ళయినా చెక్కు చెదర్లేదు. ఇప్పుడు నువ్వు వైధవ్యమనుభవిస్తున్నా నీమీద నా ప్రేమ రవంతకూడా తగ్గలేదు....కమలా, నిన్నిలా చూడాల్సివస్తుందని కల్లో కూడా అనుకోలేదు. దేవుడు నిన్ను చిన్న చూపు చూశాడు."

ఆ మాత్రం ఓదార్పుకే ఆమె కరిగిపోయింది. భోరున ఏడ్చేసింది. ఆమెని బాగా ఏడవనిచ్చాడు—ఆ తర్వాత ఆమెకు దగ్గరగా వచ్చి, ఆమె ముఖాన్ని చేత్తో ఎత్తి, కన్నీళ్ళు తుడవబోయాడు.

షాక్ తిన్నదానిలా చటుక్కున పక్కకు జరిగింది. వెంటనే మామూలుగా అయిపోయింది.

"నాకెవరి సానుభూతీ అక్కర్లేదు. నీ సానుభూతి

ముందే వద్దు. నా పెళ్ళికాకుండా చెయ్యటానికి దుష్ప్రచారం లేవదీశావు. నా భర్తతో నా గురించి చెడుగా చెప్పటానికి ప్రయత్నించావు ఆయన దేవుడు కాబట్టి అవన్నీ లెక్క చేయలేదు. మరొకడయితే నన్ను వదిలేసి మరోదాన్ని కట్టుకునేవాడు.

నేను ఆయనకు దూరమయితే నన్ను వశపర్చుకోవాలని నీ దురాశ, దురూహ. నాకు తెలుసు. ఇప్పుడు ఆయన పోగానే అవకాశం దొరికిందికదా అని దగ్గరకు చేరాలని వచ్చావు. పో, అవతలకి పో! భర్త పోయినంత మాత్రాన నీతిలేనిదాన్ని కాను. ఆయనతో గడిపిన జీవితం తల్చుకుంటూ ఎలాగో నా బతుకు నేను బతుకుతాను. నా జీవితంలోకి ప్రవేశించటానికి ప్రయత్నించకు. వెళ్ళు!" అన్నది కమల తీవ్రస్వరంతో.

దేగ కళ్ళు ఎరుపెక్కాయి. ముక్కుపుటాలు అదిరాయి. కాని అంతలోనే మామూలుగా అయిపోయాడు.

"పాపం, భర్త పోయిన బాధలో నీ ఆత్మీయులెవరో నీ శత్రువులెవరో అర్థం చేసుకోకుండా వున్నావు. కాస్త నెమ్మదించాక మళ్ళీ వస్తాను. ఒక్క మాట చెప్పి వెళ్తాను. ఈ సమాజంలో ఆడది ఒంటరిగా బతకలేదు, అందునా వయసులో వున్న ఆడది, పైగా మొగుడుపోయిన ఆడది-మహాకష్టం! సమాజం కబళించాలని ఉక్కు హస్తాలు చాచి, సమయం దొరగ్గానే పిడికిలి బిగిస్తుంది. నీ కా అగత్యం లేదు. నేనున్నాను. నువ్వు ఊఁ అంటే నిన్ను పెళ్ళి చేసుకుంటాను___నీకు అంతస్తు, హోదా, రక్షణ కలగజేస్తాను...."

కమల రెండు చేతులు జోడించి, "మరోసారి నువ్వీ

గుమ్మం తొక్కితే నేను తలకొట్టుకు చచ్చిపోతాను!....”
అన్నది తీవ్రస్వరంతో.

దేవకళ్ళ వ్యక్తి ఒక్కక్షణం ఆమెవంక సూటిగా చూసి బయటికి వెళ్ళిపోయాడు.

# 11

సుమవాళ్ళ తల్లితో మాట్లాడి బయటికొస్తున్నాడు వేణుగోపాల్. స్కూటర్ స్టార్టు చేస్తుండగా ఆ వ్యక్తి వచ్చి పక్కన నిల్చున్నాడు. అతనివంక ప్రశ్నార్థకంగా చూశాడు వేణు.

అతను మెల్లగా వేణుకి మాత్రమే వినిపించేటంత లోస్వరంలో అన్నాడు—“సుమ గురించి ఏమయినా తెలిసిందా?....” అని.

వేణు దిగ్గున తలెత్తి చూశా డతనివంక.

“మీకు తెలుసా? మీరెవరు? సుమ కేమవుతారు?” అన్నాడు గబగబ.

“అవన్నీ వివరంగా చెపుతాను. పదండి, పబ్లిక్ గార్డెన్సులో కూచుని మాట్లాడుకుందాం” అన్నాడతను.

అతని దేవ కళ్ళవంక ఓ క్షణం చూసి—“ఓ.కే. రండి!” అంటూ స్కూటర్ వెనుక కూచోబెట్టుకుని బయల్దేరాడు వేణు. అయిదు నిమిషాల్లో గార్డెన్ చేరుకుని, లోపలికి స్కూటర్ని పోనిచ్చి జవహర్ బాల భవన్ కెదురుగా వున్న ఆర్చి దగ్గర పార్కు చేశాడు.

మండపంలా వున్న ఆర్చిదగ్గర కూచున్నాక, “చెప్పండి. సుమ గురించి మీకేమయినా తెలుసా?” ఆత్రంగా అడిగాడు వేణు.

“తెలుసు” అన్నా డతను చాలా మామూలుగా.

“ప్లీజ్! చెప్పండి. ఆమె ఎక్కడుంది? ఎలా వుంది?

క్షేమంగానే వుంది కదా...."

"షి యీజ్ ఆల్ రైట్!"

"ఎక్కడుంది? ఏం చేస్తోంది?"

"నా యింట్లో క్షేమంగా వుంది. ఈ పాటికి చక్కటి భోజనం ఆరగించి హాయిగా నిద్రపోయి వుంటుంది."

"ప్లీజ్, నేను వెంటనే సుమను కలవాలి."

"ఓ, అదెంత భాగ్యం! కాని....అంత తేలిగ్గా ఆమెను కల్సుకోవటం కుదరదు."

"అంటే....ఏమిటి మీర నేది? నేను సుమని కల్సు కోవటానికి ఆంక్షలు పెట్టడానికి మీ రెవరు? అసలు మీ రెవరు, మీ యింట్లో సుమ వుండవలసిన అవసర మేమిటి? ఆమె తప్పిపోయి రెండు రోజాలుగా మేం వర్రీ అవుతుంటే యింత తాపీగా మాట్లాడుతున్నా రేమిటి?"

"శాంతించు బ్రదర్! ఆమె క్షేమంగా వుందని చెప్పానుకదా! తొందరపడతావేం? ఆమె నా సంరక్ష ణలో వుంది. నా పర్మిషన్ లేకుండా నా యింటినుండి ఒక్క అంగుళం కూడా కదలేదు. ఇక నే నెవర్నం టావా, అది నీ కనవసరం. టెరమ్స్ మాట్లాడుకుందాం సరేనా? ...."

"ఓ.కె! ఆమెని కిడ్నాప్ చేశావన్నమాట!"

"అంత పెద్దమాటలెందుకు? కొన్నాళ్ళపాటు ఆతిథ్య మివ్వాలని మా యింటి కాహ్వానించాను."

"మాటలతో సమయం వృధా చెయ్యొద్దు. సుమను సురక్షితంగా నా కప్పచెప్పటానికి నీ కేం కావాలి? డబ్బా....!? ఎంత కావాలి?"

"జస్టు, రెండు లక్షలు—అంతే సంతృప్తి పడి పోతాను."

"రెండులక్షలా?"

"ఓన్లీ టూ లాక్స్! చాలా చిన్న మొత్తం. ఇరవై నాలుగ్గంటల్లో నాకు అంద చెయ్యాలి. ఇక్కడే, యిదే స్పాట్ లో..."

"అంద చెయ్యకపోతే...."

"సుమని యిక శాశ్వతంగా చూడలేవు!"

"బెదిరిస్తున్నావా?"

"ఛఛ! చెక్క పెట్టెలో తీసుకుని శాశ్వతంగా నిద్ర పుచ్చి నీకు బహుమతిగా పంపిస్తాను."

"నీ కెందుకంత కక్ష?"

"ఆమెమీద నా కెందుకు కక్ష? బ్యూటిఫుల్ లేడీ! నిజంగా ఆమెను చూస్తూంటే నాకు మతిపోతున్నదనుకో! ఎప్పుడో తెలియకుండా ఆమెమీద పడిపోతానేమో నని పిస్తోంది...."

"డోంటాక్ నాన్సెన్స్! ఆమె గురించి అగౌరవంగా మాట్లాడితే సహించలేను."

"అగౌరవంగా మాట్లాడితే సహించలేవు. మాన భంగం చేస్తే ఏం చేస్తావ్?"

"స్టాపిట్. నీక్కావలసింది మనీయేగా. ఇస్తాను. ఆమెనేం చెయ్యొద్దు. భద్రంగా నా కప్పగించు!"

"ఛఛ, బంగారుగుడ్లు పెట్టే బాతును చంపుతానా? భద్రంగా ముట్టుకోకుండా నీ కప్పగిస్తాను. అయ్ వాంట్ మనీ, యూ వాంట్ హర్ సేఫ్! అంతే...."

"సరే, నీకు డబ్బిస్తాను."

"రేపు యిదే సమయానికి! ఇక్కడే?"

"అలాగే, సుమని యిక్కడికి తీసుకురా."

"నువ్వు డబ్బు తీసుకొచ్చాక మాట్లాడు ఆ సంగతి."

"తెస్తాను, తెస్తాను, తెస్తాను. నువ్వు మాత్రం సుమని జాగ్రత్తగా తీసుకురా."

"ఓ.కే.... ఆమె గురించి తప్పిపోయిందని పోలీసులకి రిపోర్టిచ్చినట్టున్నావు. పోలీసుల్ని తీసుకురావాలని ప్రయత్నించినా, వాళ్ళకీ సంగతి ఏమాత్రం చెప్పినా సుమని సజీవంగా చూళ్ళేవు!"

"నోనో! పోలీసులకీ సంగతి చెప్పనే చెప్పను. నువ్వు మాత్రం ఆమెకెలాంటి అపకారం తలపెట్టనని నాకు మాటివ్వాలి!"

"పిచ్చివాడా! నేను ఫక్తు వ్యాపారిని. నాకాక్కావలసింది ఆడది కాదు, డబ్బు—డబ్బు పడేస్తే సుమ కన్నా యిన్నోన్ రెట్లు అందగత్తెలు, సుకుమారులు నా కళ్ళముందు కుక్కల్లాపడుంటారు. నా పక్కలో దొర్లుతారు.... భయపడకు, నీ ప్రియురాల్నేం చెయ్యను!"

"థాంక్స్! అన్న మాటకు నిలబడితే చాలు!"

"నువ్వుకూడా అన్న మాటకు నిలబడు. పోలీసులకి దూరంగా వుండు రేపటివరకు."

"ఆల్ రైట్!"

# 12

"మన్మథరావు గురించి కొన్ని విషయాలడగాలని వచ్చాను" అన్నాడు డిటెక్టివ్ కిరణ్—మన్మథరావింటి యజమానితో.

"అడగండి!" అన్నాడాయన. ఆయనకి సుమారు ఏభై అయిదేళ్ళుంటాయి. సన్నగా పొడవుగా వున్నాడు. లాల్చీ, పైజామా వేసుకున్నాడు. ముఖంమీద స్ఫోటకం

మచ్చలు. "నా పేరు విక్టర్" అన్నాడాయన.

"మన్మథరావు చనిపోయిన రాత్రి అతనితో ఎవరైనా వున్నారేమో చెప్పగలరా?"

"మన్మథరావుంటున్న గది మా యింటికి దూరంగా వుండటం గమనించే వుంటారు.... ఆ గదిలోకి ఎవరైనా వచ్చినా యిక్కడికి కనిపించే అవకాశం లేదని—ప్రత్యక్షంగా అతని గురించి పరిశీలనగా పట్టించుకుంటే తప్ప! అతను చాలా కామ్‌గోయింగ్. ఒకరి గోలాగొడవా అక్కర్లేని మనిషి. నెలయ్యేసరికి ప్రతి ఫస్టుకి అద్దె తెచ్చి నాకిచ్చేసేవాడు. ఆ ఒక్కసారిమటుకే అతను మా గుమ్మం ఎక్కేవాడు."

"అది సరే, అతని క్యారెక్టర్ ఎలాంటిది?"

"మనిషికి దురలవాట్లు వున్నట్లు లేదు. కాని ఒకటి రెండుసార్లు ఓ అమ్మాయి అతనికోసం వచ్చివెళ్ళటం చూశాను. పగటిపూటే కాబట్టి నే నా విషయానికి ప్రాముఖ్యత నివ్వలేదు. రాత్రిళ్ళు అమ్మాయిలెవ్వరు రావటం నే చూడలేదు."

"అతనికి మందు మింగే అలవాటేదైనా...."

"ఆ విషయం మటుకు తెలవదు సుమండీ."

"మీ యింట్లో యెవరికయినా అతని గురించి గాని, ఆ రాత్రి యెవరయినా రావటం గురించిగాని తెలుసేమో...."

"మా యింట్లో వుంటున్నది యిద్దరమే! నేనూ, నా కొడుకు. వాడు యింట్లో వుండేది తక్కువ. ఎప్పుడూ వూరిమీద పడి తిరుగుతుంటాడు—"

"అలాగా! ఏం ఉద్యోగం లేదా?"

"నా ఉద్యోగం వాడికొచ్చే యేర్పాటు చేయాలను

కుంటున్నాను. ఈ కొత్త ప్రభుత్వం రూల్సువల్ల నాలుగు నెళ్ళ క్రితమే రిటైరయ్యాను."

"అలాగా! అబ్బాయి వుంటే ఓసారి పిలవండి."

"ప్రస్తుతం యింట్లో లేడండి. ఎంప్లాయిమెంటు ఆఫీసుకి వెళ్ళొస్తానని వెళ్ళాడు."

"ఎంతవరకు చదువుకున్నాడు?"

"బియ్యే రెండో సంవత్సరం చదువుతుండగా వాడి తల్లి చనిపోయిందండి. వాడు తల్లిని చాలా ప్రేమించాడు. ఆమె పోయిన బెంగతో చదువు మానేశాడు."

"పాపం, అలాగా! నే వస్తానండి. అబ్బాయి వస్తే ఓసారి క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్‌ని కలవమని చెప్పండి. నేను అక్కడే వుంటాను."

"అలాగే చెపుతాను బాబూ!" అన్నాడాయన.

కిరణ్ బయటికొస్తూ మన్మథరావు గదివైపు చూశాడు. తాళం పెట్టి సీలు వేశాడు శ్రీనివాస్ ఆ గదికి.

# 13

టయోటా స్టార్టు చేయబోతూ తుళ్ళిపడ్డాడు కిరణ్.

ఆటో ఆగింది. అందులోనుంచి సునంద దిగింది. తలపై నుంచి గుర్తు తెలీకుండా ముసుగు వేసుకుంది. కాని కిరణ్ దృష్టినుంచి తప్పించుకోలేక పోయింది.

ఆమె సరాసరి మన్మథరావు యజమాని యింటివైపు సాగిపోయింది ఎటూ చూడకుండా.

కిరణ్ అలాగే అయిదునిమిషాలుండిపోయాడు. తను కారుని దూరంగా ఆపు జేసి నడిచిరావటం మంచిదయింది. లేకుంటే యేదో వాహనం ఆగి వుందని భయపడి ఆమె ఆటోని ఆపకుండా వెళ్ళి పోయి వుండేది! తన కిప్పటికీ ఓ నగ్నసత్యం తెలీకుండాపోయేది!

తనతో సునంద మన్మధరావుంటే సలం తెలియదని చెప్పింది. మన్మధరా వేం చేస్తుంటాడో తెలీదని చెప్పింది. మరి మన్మధరావు వుండే యింటికి యెందుకు వెళ్తున్నట్టు? అక్కడ ఆమెకేం పని?

కిరణ్ మెదడులో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. ఇంతలో ఆమె తిరిగివచ్చేసింది. ఆటో ఆమె కోసం ఎదురుచూస్తోంది. దాంట్లో కూచుంది. ఆటో కదిలింది—వేగం పుంజుకుంది.

ఆటోని దృష్టినుంచి దాటిపోనివ్వకుండా తన టయోటాని దానివెనకే పోనిచ్చాడు. ఆటో బేగంపేట్ ఎయిర్‌పోర్టుకు పోయే రోడ్డు పట్టింది, ఖైరతాబాదు దగ్గర.

టయోటాని మెల్లగా దాని వెనకే పోనిస్తున్నాడు కిరణ్ — అకస్మాత్తుగా ఆటో ఓ గల్లీలోకి తిరిగి పోయింది.

కిరణ్ కారును గల్లీలోకి తిప్పాడు.

కానీ ఆటో జాడ యెక్కడా కనిపించలేదు!

కారు ఆపి ఆ వీధిని పరిశీలనగా చూశాడు. అది అరికంగా వెనుకబడ్డవాళ్ళు, టాక్సీ ఆటో డ్రయివర్లు, రిక్షావాలాలు వుండే గల్లీ. అన్నీ చిన్న చిన్న గదుల యిళ్ళే.

ఆటో యెలా యెక్కడ అదృశ్యమయిందో అర్థంకాలేదు కిరణ్‌కి. పది నిమిషాలు ఆ గల్లీలోనే కారుని అటు యిటు నడిపి పరీక్షగా యిల్లిల్లూ చూశాడు. కాని ఆటో యెలా తప్పించుకున్నదో అర్థంకాలేదు కిరణ్‌కి.

గల్లీలోని జనం బాగా తాగి ఒకళ్లనొకళ్ళు బూతులు తిట్టుకుంటున్నారు. అది సరయిన సమయంకాదని కారు

దిగలేదు కిరణ్. సునందలాంటి 'లా' స్టూడెంటుకి యీ గల్లీలో యేం పనో అర్థం కాలేదతని.

టయోటాను వెనక్కి తిప్పుకుని సరాసరి క్రైం బ్రాంచ్‌కి పోనిచ్చాడు. జరిగిన విషయాలు శ్రీనివాస్‌కి తెలియజేశాడు.

"మన్మథరావు యజమాని విక్టర్ యింటిని ముట్టడిద్దామా?" అడిగాడు శ్రీనివాస్.

"కంగారుపడకు. విక్టర్ గవర్నమెంటు ఉద్యోగం చేసి రిటైరయ్యాడు. గౌరవనీయుమైన వ్యక్తిలాగానే వున్నాడు. మనం తొందరపడి అవమానకరంగా ప్రవర్తిస్తే అదింకోలా పరిణమిస్తుంది. సునందని ఎలాగయినా కల్సుకుని ఆమెకు, ఆ యింటితో యెలాంటి సంబంధమో తెల్సుకోవాలి!"

"సునంద యింటి అడ్రసు తెలీదే ఎలా?"

"యూనివర్సిటీకి వెళ్దాం. లా కాలేజి ప్రిన్సిపాల్‌ని కలిసి అడ్రస్ సంపాదించలేమా?"

"ఆల్‌రైట్! సార్జంటుని పంపిస్తాను" అని అప్పటికప్పుడు శివాన్ని పంపించాడు శ్రీనివాస్.

"లారీ విషయం తెలిసిందా?"

"లేదు. ఆ లారీ నంబరు చూసినవాళ్ళు లేరు. కాని ఎర్ర రంగు బెంజీలారీ అని మాత్రం ఒకరిద్దరు చెప్పారు. కమల కూడా చెప్పింది."

"సరే, మనం ఒకసారి కమలను కలుద్దాం. ఈ మూడు హత్యలకి లింక్ వుండవచ్చు ననిపిస్తోంది నాకు. ఈ లోపల శివం తెచ్చిన అడ్రసును పట్టుకుని సునంద ఇంటికి వెళ్దాం."

అప్పుడు రాత్రి ఎనిమిది గంటలయ్యింది.

# 14

"చూడండమ్మా, మిమ్మల్ని బాధ పెట్టడం మా ఉద్దేశ్యం కాదు. ఒక్క విషయం తెల్సుకుందామని వచ్చాం" అన్నాడు కిరణ్ కమలతో.

ఆమె ఇంట్లో ఇంకా ఇద్దరు మనుషులున్నారు. "ఈమె నా తల్లి. ఆయన నా అన్న. నన్ను మా పుట్టింటికి తీసుకు పోతామంటున్నారు. రేపు ఉదయం వెళ్ళిపోతున్నాను" అన్నది కమల, వాళ్ళిద్దర్నీ పరిచయంచేస్తూ. ఆమె ముఖం బాగా పీక్కుపోయి వుంది. బాగా డీలా పడి పోయింది. ప్రాణాలు కళ్ళలో నిలుపుకున్నట్టుగా కనిపిస్తోంది. "అడగండి" అన్నది తర్వాత.

"మరేంలేదు. మీకుగాని, మీ వారికిగాని వ్యక్తిగతంగా శత్రువులెవరైనా వున్నారా?" కిరణ్ అడిగాడు. శ్రీనివాస్ మౌనంగా వింటున్నాడు.

"నాకు తెలిసి యెవరూ లేరండి."

"ఇలా అడుగుతున్నందుకు మరోలా అనుకోకండి. మీకు పెళ్ళయి ఎన్నాళ్ళయింది?"

"రెండేళ్ళ ఆరు నెలలు అవుతోంది."

"అంతక్రితం మిమ్మల్ని ప్రేమించటంగాని, లేదా మీ వల్ల ఎవరైనా అవమానింపబడటం గాని జరిగిందా? ప్లీజ్ ఏమనుకోవద్దు!"

"అనుకునేందుకేముందండి, నా జీవితం మట్టిపాలై పోయినాక!....విలియమ్స్ అనే స్నేహితుడో కతనుండే వాడు. ఇద్దరం క్లాస్ మేట్స్. నన్ను పెళ్ళిచేసుకోమని అడిగేవాడు. నే నిష్టపడలేదు. అతను క్రిస్టియన్, నేను హిందూ అనే భేదభావంతో కాదు; అతనికి మంచి అలవాట్లు లేవు. అటువంటివాడితో నా జీవితాన్ని పంచు

కోవటం యిష్టంలేక.

"తర్వాత నా వివాహం రామ్మూర్తిగారితో నిశ్చయమయింది. బియ్యే రెండో సంవత్సరం మధ్యలోనే నా చదువాగిపోయింది. నా భర్త రామ్మూర్తికి మా ఇద్దరికీ యిదివరకే పరిచయముందని అబద్ధాలు చెప్పి పెళ్ళి ఆపబోయాడు. కాని ఆయన విలియమ్స్ మాటలు నమ్మలేదు. మా పెళ్ళి జరిగిపోయింది.

"అయినా విలియమ్స్ వేటాడటం మానలేదు. వారిని వదిలేసి తనతో వచ్చేయమని చాలాసార్లు వెంటబడి వేధించాడు. నేను మా గుమ్మం ఎక్కవద్దని విలియమ్స్‌కి వార్నింగిచ్చాను. విలియమ్స్ రావటం మానేశాడు" ఆగిందామె ఓ క్షణం.

"ఆ తర్వాత అతను మళ్ళీ కనిపించలేదా?"

"నిన్న సాయంత్రం వచ్చాడు. ఇప్పుడయినా సరే తను నన్ను పెళ్ళిచేసుకోటానికి సిద్ధంగా వున్నానని నేనంగీకరిస్తే చాలని అన్నాడు. నేను బాగా తిట్టి మందలించి పంపేశాను."

"విలియమ్స్ వుండే దెక్కడో తెలుసా?..." అడిగాడు.

"వాళ్ళ దీ వూరే. బాజార్‌ఘాట్‌లో యెక్కడో వుంటున్నామని చెప్పాడు."

"మీ యిద్దరు బియ్యేలో క్లాసుమేట్సంటున్నారు. మీతోపాటు నిర్మల, మన్మథరావు ఆ నేవాళ్ళైవరయినా చదువుకునేవారా?"

ఆమె వెంటనే, "అవును. చదువుకునేవారు. మన్మథ

రావు సంగతేమో గాని. నిర్మల మొన్నీ వద్ద కనిపించి 'లా' చదువుతున్నానని చెప్పింది" అన్నది.

కిరణ్ కి సమస్య ఒకటొకటే విడిపోతున్నది.

"సునంద అనే అమ్మాయి తెలుసా?"

"తెలియదండి!"

శ్రీనివాస్ ఆశ్చర్యంగా, ఆసక్తిగా వింటున్నాడీ సంభాషణ.

కిరణ్, శ్రీనివాస్ వంక తిరిగి, "విలియమ్స్ విక్టర్ కొడుకు!" అన్నాడు. ఆ తర్వాత కమలవంక చూసి, "మీ స్నేహితురాలు నిర్మల ప్రాణాలు కోల్పోయింది. ఎవరో హత్య చేశారు. అలాగే మన్మధరావు కూడా!" అన్నాడు.

కమల కాసేపు యేమీ మాట్లాడలేకపోయింది. చివరికెలాగో గొంతు పెకల్చుకొని, "నేనే దురదృష్టవంతురాలి ననుకున్నాను. లోకంలో నాకన్న దురదృష్టవంతులున్నారు. ఇప్పుడే తెలుసుకున్నాను" అన్నది.

కిరణ్ లేచి, "చాలా థాంక్సమ్మా! మంచివిషయాలు చెప్పారు. వీలయితే మీ ప్రయాణం ఎల్లుండికి వాయిదా వేసుకోండి. మీ వారిని హత్యచేసిన రాస్కెల్ ని రేపు మీకు చూపిస్తాను!" అన్నాడు.

కమల ఆవేశంలో పిడికిళ్ళు బిగించి, "అలాగే వాయిదా వేసుకుంటాను. వాడ్ని చూపించండి — నా చేతుల్తో వాడ్ని చంపి, మావారి ఆత్మకు శాంతి చేకూరుస్తాను!" అన్నది.

కిరణ్ మెల్లిగా అన్నాడు. "ఆవేశపడకండి. అందుకు చట్టం వుంది. నేరస్తుడు తప్పించుకోలేడు!"

# 15

సార్జంట్ శివం సునంద అడ్రసుతో సిద్ధంగా వున్నాడు కిరణ్, శ్రీనివాస్‌లు తిరిగొచ్చేసరికి.

"ఇన్‌స్పెక్టర్, పద బేగంపేట్ వెళ్ళొద్దాం!" అన్నాడు అడ్రసువంక చూసి, మడిచి జేబులో పెట్టుకుంటూ కిరణ్.

టయోటా బేగంపేట్ వైపు దూసుకుపోయింది.

తను సాయంత్రం చూసిన గల్లీకి పక్క వీధిలోనే సునందవాళ్ళ యిల్లు.

ఇంట్లో సునంద తల్లిదండ్రులు, ఆమె చెల్లెలు వున్నారు.

పోలీసుల్ని చూడగానే సునంద తండ్రి కంగారుగా బయటికొచ్చాడు.

"సునందకోసం వచ్చాం, పిలిపించండి!" అన్నాడు కిరణ్.

సునంద తండ్రి బిక్క మొహం వేసుకుని "ఏం బాబూ, అదేం తప్పు చేసింది?" అన్నాడు భయంగా.

"తర్వాత చెప్తాం, పిలవండి."

"కాలేజినుంచి తిరిగిరాలేదు బాబూ! మొదటి ఆట సినిమాకు వెళ్ళిందేమో!"

"సాయంత్రం ఆరుగంటల ప్రాంతాల మీ అమ్మాయి ఆటోలో ఈ పక్క గల్లీనుంచి రావటం నేను చూశాను. వెంటనే బయటకు పిలిపిస్తారా, లేక మేమే వెతుక్కోవాలా?" గర్జించాడు కిరణ్.

"నిజం బాబూ! మీ దగ్గర అబద్ధమాడలేను. అమ్మాయి ఈ ఉదయం పదిగంటలకు కాలేజికి వెళ్ళింది. ఇప్పటిదాకా తిరిగిరాలేదు...."

సునంద తండ్రి మాటలు పూర్తి కాకుండానే కిరణ్

అతన్ని తోసుకుని లోపలకు వెళ్ళాడు.

లోపల నిజంగానే సునంద లేదు!

శ్రీనివాస్ కోపంతో అరిచాడు. "దాచేస్తావు కదూ! నిన్ను ముందు బొక్కలోకి తోసేస్తేగాని ఆ పిల్లను బయట పెట్టవు! పద స్టేషన్‌కి!.." అంటూ ముసలాయన రెక్క పట్టుకున్నాడు.

కిరణ్ శాంతపరిచి, సార్జంట్ శివం వంక తిరిగి "నువ్వు నలుగురు పోలీసులతో యీ చుట్టుపక్కల వెతికించు. ఆమె జాడ తెలిసినా తెలియకపోయినా ఓ గంట తర్వాత కంట్రోల్ రూంకి తెలియపర్చు" అంటూ శ్రీనివాస్ వంక తిరిగి, "కమాన్. చాలా అర్జంటుగా మనం ఓ చోటికి వెళ్ళాలి!" అంటూ నాలుగడుగుల్లో పోలీస్ వాహనం యెక్కాడు.

మరుక్షణం వాహనం పరుగెత్తింది.

# 16

బాజార్ ఘాట్‌లోని విక్టర్ ఇంటి దగ్గర ఆగింది పోలీసు వాహనం.

అప్పుడు రాత్రి పదయింది.

గేటు వేసి వుంది. చప్పుడు కాకుండా గేటు తెరిచి, ఇంటి వెనక వైపుకి అడుగులు వేశాడు కిరణ్, శ్రీనివాస్‌కి సైగ చేసి.

విక్టర్ ఇంటి తలుపులు మూసివున్నాయి.

వెనకవైపు గదిలో నుంచి వెలురు బయటకి పడుతోంది. ఎక్కడినుంచో సన్నగా మాటల సవ్వడి విని పిస్తోంది. ఒంగి నెమ్మదిగా పాకుతూ ఆ గది కింది భాగం వైపు జరిగాడు కిరణ్. శ్రీనివాస్ అతన్ననుసరించాడు.

సునంద గొంతులో ఏడుపుజీర ధ్వనిస్తోంది. మొగ

కంఠం ఆమె ననునయిస్తోంది.

"....అంతా బూటకం. నేనే నీకు కావలసి వుంటే మరో ఆడదాన్నెందుకు తీసుకొచ్చావు? నాకు అన్యాయం చేయాలనేకదూ!" అన్నది సునంద బెక్కుతో.

"నో డియర్! కల్లో కూడా నీకు ద్రోహం చెయ్యలేను, చెయ్యను....నన్ను నమ్ము! ఈ లోకంలో బతకటానికి డబ్బు కావాలి. అది సంపాదించాలంటే సక్రమ పద్ధతుల్లో నిజాయితీగా సంపాదించలేం! అందుకే నేనీ దారి వెతుక్కున్నాను!"

"నువ్వు దుర్మార్గుడివి. బతకటానికెన్ని మార్గాలులేవు? మనిద్దరం సుఖంగా బతకటానికి ఈ దారెన్నుకున్నానని నన్ను నమ్మించకు!...."

"నిజం సుమా, నా మాట నమ్మవా? ఈ పిల్ల ఒంటిమీద చెయ్యి వెయ్యలేదు. నాక్కావలసింది యీ పిల్లతో అనుభవంకాదు. రెండు లక్షలు! దీని ప్రియుడు డబ్బివ్వటానికి ఒప్పుకున్నాడు. రేపు దీన్ని వాడికప్పగించేస్తాను. డబ్బు తీసుకుంటాను—అంతే! ఆ తర్వాత మనిద్దరం ఫ్రీ బర్డ్సులా తిరగొచ్చు. నీ లా కోర్సు పూర్తవగానే పెళ్ళి చేసేసుకుందాం!"

"అలా అనే నా చేత కానిపనులు చేయించావు. నిర్మలతో నువ్వు నడిపిన ప్రేమాయణం, మన్మధరావును అడ్డు తొలగించటం—యివన్నీ కూడా నా కోసమే చేశావా? యెందుకింత పతనమైపోయావు?"

"అవన్నీ యిప్పుడొద్దు!...."

"నీకేం, నువ్వు మగాడివి, యెలాగైనా తప్పించుకోగలవు. ఏంచేసినా సంఘం హర్షిస్తుంది. నేను ఆడదాన్ని. తప్పటడుగు వేసిన ఆడదానికి సంఘంలో స్థానంలేదు....

సాయంత్రం ఎవరిదో కారు నా ఆటో వెనకపడితే నే నెంతగా హడలిపోయానో తెలుసా? మా ఇంటికూడా వెళ్ళకుండా తప్పించుకుని పక్క గల్లీలోని ఆటో డ్రయివర్ ఇంట్లోకి పారిపోయాను ఆటోతో బాటు. కారు వెళ్ళిపోయేవరకు ప్రాణాలు అరచేత్లో పట్టుకున్నాను.

కార్లో ఉన్న వ్యక్తి పోలీసు మనిషే, నాకు గుర్తుంది. మొన్న మా కాలేజికి వచ్చిన పోలీసుల్లో అతనొకడు. నా సంగతి పసికట్టాడనుకుంటున్నాను. అతను వెళ్ళి పోయాక సరాసరి ఆర్టీసీ క్రాస్ రోడ్సువరకు అదే ఆటోలో వచ్చాను. నువ్వు సంధ్య థియేటర్ దగ్గర ఉంటానన్నావు, కాని యెందుకో నువ్వు లేవు! నాకు ఓ పక్క భయం! చివరికి ఆ థియేటర్లోకి టికెట్ కొనుక్కొని పోయి కూచున్నాను. సినిమా అయేవరకు నీకోసం చూసి, చివరికి ఇక్కడికే పరుగెత్తుకొచ్చాను మా ఇంటికి వెళ్ళే ధైర్యంలేక!...."

"హేండ్సప్ మిస్టర్ విలియమ్స్!" అన్నాడు వెనక నించి కిరణ్.

విలియమ్స్, సునంద, చేతులు వెనక్కి విరిచి కట్టబడి స్పృహా కోల్పోయిన స్థితిలో ఉన్న సుమ, ముగ్గురే ఉన్నారా గదిలో.

విలియమ్స్ చటుక్కున పక్కకు ఒంగబోయాడు.

"కదిలావంటే కాల్చేస్తాను! బుద్ధిగా చేతులెత్తి ఇటు రా!" అరిచాడు కిరణ్.

సునంద బిర్రబిగుసుకుపోయింది.

విలియమ్స్ నిస్సహాయంగా చేతులు ఎత్తాడు. అతని రేగ కళ్ళలోకి సూటిగా చూస్తూ "నేర సుడు తప్పించుకోలేడు మిస్టర్ విలియమ్స్! ముగ్గుర్ని హత్యచేసిన నేరానికి

నిన్ను అరెస్టు చేస్తున్నారు....కమల భర్త రామమూర్తిని అడ్డుతొలగించి, ఆమెను లొంగదీసుకోవాలని ప్లాన్ వేసి, అతన్ని లారీ చక్రాలకింద నిర్దాక్షిణ్యంగా నుగ్గు నుగ్గు చేశావు.

"మన్మథరావు నిర్మలతో తిరుగుతున్నాడనే ద్వేషంతో వాళ్ళిద్దర్నీ చంపేశావు.

"పాపం, యీ అమాయకురాలు సునంద నిన్ను నమ్మి తన స్నేహితురాళ్ళకు ద్రోహం చేసింది. వాళ్ళ వార్తలు నీకు, నీ వార్తలు వాళ్ళకు అందచేసి నీ దారి సుగమం కావటానికి తోడ్పడింది. ఈలోపల సుమను కిడ్నాప్ చేసి, ఆమెకు రెండు లక్షల విలువ నిర్ణయించి వేణుగోపాల్‌ని బ్లాక్ మెయిల్ చేశావు. డబ్బు సంపాదించటానికి తప్పుదోవ పట్టావు.

"కాని మిస్టర్, నేరస్థుడు యెన్నటికీ తప్పించుకోలేడు!" అన్నాడు కిరణ్ సూటిగా చూస్తూ.

విలియమ్స్ శేక కళ్ళు నేలని కరుచుకున్నాయి.

—: అయిపోయింది —

సీరియల్

బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

అభిలాష్ తిరస్కారంగా చూశాడు.

కార్తీక్ చిన్నగా నవ్వి, "నామీద నీకున్న అభిమానానికి కృతజ్ఞుడ్ని. నా దీప్తిని శాశ్వతంగా నీదాన్ని చేసుకోబోతున్నందుకు నీకు అభినందనలు! నా దీప్తి సుఖంకోసం నేను నీకు సాయం చెయ్యటానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు.

"గుడ్, వెరీగుడ్! నిన్ను మరణయాతనకు గురిచెయ్యకుండా వెంటనే ప్రాణంపోయేలా చంపుతాను. అదే నీకు నేను చేయగల సాయం!" అంటూ తన జోక్‌కి తనే విరగబడి నవ్వాడు రెడ్‌సన్. తర్వాత కార్తీక్ కట్లు విడదీశాడు.

"ఇదిగో, ఈ కాగడా నువ్వు తీసుకో! నువ్వు ముందు నడు. నేను వెనక నడుస్తాను. తల తిప్పటానికిగాని, నామీద తిరగబడటానికిగాని ప్రయత్నించకు! నా రివా

ల్వర్ నీ వెన్నువు అనుకోనే వుంటుంది!" అన్నాడు రెడ్ సన్ హెచ్చరికగా.

కాత్రీక్ మందహాసం చేసి, "ఇంకా నన్ను నమ్మటం లేదా? ఈ సమయంలో కూడా నామీద అనుమానం కలిగివుండటం నా దురదృష్టం!" అన్నాడు.

ముందు కాత్రీక్, వెనుక రెడ్ సన్ ఆ నిశీధిలో ముందుకు సాగిపోయారు.

* * *

రెడ్ సన్ రాగిరేకు బయటికి తీసి గుర్తులు పరిశీలించాడు. బాణం గుర్తు వేసిన దారినే పోతున్నట్టు గ్రహించి సంతృప్తిగా తలాడించాడు.

ఓ రెండు ఫర్లాంగులు నడిచారు. కాత్రీక్ ఆటో మాటిక్ వాచిలో టైం చూసుకున్నాడు. రేడియం డయల్లో ముళ్ళు పన్నెండు అంకెను సమీపిస్తున్నాయి. అర్ధరాత్రి!

"కాత్రీక్, మనం దాదాపు అరమైలు నడిచి వుంటాం కదూ!" అన్నాడు రెడ్ సన్.

"అవును."

"మరి ఈసరికి మనకి కొండల బారు, దాని వెనుకగా లోయలు కనిపించాలే, ఏం కనపడటం లేదు!"

"రెండు మైళ్ళు నడవాలి కదా!"

"రెండు మైళ్ళు నడవకుండానే నాలుగోవంతు దారి గడచేసరికి ఇవి వున్నట్టు గుర్తింపబడ్డాయి!"

"ఇంకా ముందుకి నడిచి చూద్దాం!"

"లోయలు పక్కగా ఏవో మరుగుజ్జు చెట్లు వాటి నానుకొని సెలయేరు వస్తాయని వసంతవర్మ చెప్పాడు కదా! సారంగంలో సెలయేరు ఎలా ప్రవహిస్తుంది?"

"నీరు పుట్టేది భూమి లోపలే కదా! సొరంగం తొలిచినపుడు నీటిబుగ్గ పైకి వచ్చి అది సెలయేరుగా ప్రవహిస్తూ వుండి వుండొచ్చు!"

"అవును, నువ్వు చెప్పిందీ సబబుగానే వుంది!"

కార్తీక్ నడుస్తూనే తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. చేతనున్న కాగడాతో రెడ్‌సన్ మీద తిరగబడితే ఎలా వుంటుందని ఆలోచిస్తున్నాడు. ఏమాత్రం బెడిసికొట్టినా నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాడు రెడ్‌సన్. తర్వాతయినా తనని చంపకుండా వదలడని తెలుసు! తను అతనితో బయలుదేరింది అతనికి భయపడి కాదు. ఏమాత్రం అవకాశం దొరికినా అతన్ని మట్టుబెట్టాలని!

తను ఈ అవకాశాన్ని వినియోగించుకోలేకపోతే రెడ్‌సన్ దీప్తిని చెరబట్టి తీసుకుపోతాడు! తమందర్నీ పిట్టల్ని కాల్చినట్టు వరసగా నిల్చోబెట్టి కాల్చేస్తాడు. అదే జరగబోతోంది! ఈ దారుణాన్ని జరక్కుండా చెయ్యగల అవకాశం, తనొక్కడికే వుంది! తనవాళ్ళు తనమీద కొండంత ఆశ పెట్టుకొని వున్నారని చివరిగా చూసినపుడు వాళ్ళ ముఖాల్లో స్పష్టంగా చూశాడు తను!

ఇంతలో వాళ్ళ కళ్ళముందు ఏవో మెరుపులు మెరిశాయి! కార్తీక్ అకస్మాత్తుగా ఆగిపోయాడు!

"ఏమిటి, ఏమిటా వెలుగు?" అన్నాడు రెడ్‌సన్ కళ్ళు నులుపుకుంటూ.

"అదే నాకూ అర్థంకావటం లేదు. నిధి తాలూకు కాంతి విరజిమ్ముతున్నదేమో అక్కడ!"

"జోక్ చెయ్యకు...." అని రెడ్‌సన్ అంటుండగానే వాళ్ళ కళ్ళముందు ఓ గుహ కనిపించింది.

"ఇవేమిటి? సెలయేరు, సన్నటి దారి, మరుగుజ్జు చెట్లు కనపడకుండా నే గుహ ప్రత్యక్షమైందేమిటి?" రెడ్ సన్ రాగిఫలకాన్ని పరీక్షగా చూస్తూ అన్నాడు.

కా ర్రీక్ క్రీగంట అతనివంక చూశాడు. పొరపాటున కూడా రెడ్ సన్ రివాల్వర్ జేబులో పెట్టుకుంటాడేమో, తిరగబడదామనుకున్న అతని ఆశ నిరాశే అయింది!

రెడ్ సన్ రాగిరేకును దుస్తుల్లో దాచుకొని మళ్ళీ ముందుకు దృష్టిసారించాడు. ఎదురుగా యెవరో నించు న్నట్టు, నవ్వుతున్నట్టు భ్రాంతి కలిగింది!

గాల్లో ఏవో చప్పుళ్ళు! సన్నని గాలిని కోస్తున్న ధ్వనులు, యెవరో చెవిలో గుసగుసగా మాట్లాడుతున్న అనుభూతి!

రెడ్ సన్ కి చెమట్లు పోశాయి! ఈ శబ్దాలు గతంలో తను విన్నాడు! అవును.... మాంత్రికుడి అనుచరులు తమని బంధించబోయే ముందు, ఆ తర్వాత కూడా యిలాంటి శబ్దాలు తను విన్నాడు.

"కా ర్రీక్, నీకేమైనా శబ్దాలు వినిపిస్తున్నాయా?" అనడిగాడు రెడ్ సన్.

కా ర్రీక్ కి కూడా రెడ్ సన్ కి ఎదురైన అనుభవమే యెదురైంది. అతనికి తెలుసు, అ దేమిటో! కాని, కావాలనే మాట మార్చాడు. "అబ్బె, నాకేమీ విని పించటంలేదు! భయంకరమైన నిశ్శబ్దమే రాజ్యమేలు తున్నట్టుంది అంతటా! నిశ్శబ్దం చాలా భయంకరంగా వుంటుందన్న నిజం ఇప్పుడే తెలిసింది నాకు!" అన్నాడు రెడ్ సన్ ప్రశ్నకు సమాధానంగా.

"ఎదురుగా అన్నీ కొండలే కనిపిస్తున్నాయి! బహుశా యిదే అయివుంటుంది. రాగిరేకు చూడండి" అన్నాడు

మళ్ళీ కార్తీక్.

"ఎదురుగా కొండలుకాదు, గుహ కనిపిస్తోంది! ఇంకా మైలుపైగా నడిచేగాని కనపడని గుహ యిప్పుడే కనిపిస్తోంది!" అన్నాడు రెడ్‌సన్ అయోమయంగా.

కార్తీక్ ధైర్యం కోల్పోలేదు. కాగడా పట్టుకొని అలాగే నడుస్తున్నాడు.

అకస్మాత్తుగా వాళ్ళ ముందు ఏవో నీడలు కనిపించాయి. ఉన్నట్టుండి విపరీతమైన గాలి వీచసాగింది.

నీడలు ఆ గాలికి అనుగుణంగా నృత్యం చేస్తున్నాయి. కలగాపులంగా కీచుగా మాట్లాడుకుంటున్న సవ్వడి!

నీడలు నృత్యం చేయటం చూసిన మరుక్షణం రెడ్‌సన్ గొంతు పెగల్లేదు. ఎలాగో మాట అతని నోటినుంచి వచ్చింది. "కార్తీక్, నీకు నీడలు డాన్స్ చేయటం కనిపిస్తోందా?"

కార్తీక్‌కి కనిపిస్తున్నాయి. అయినా ఆ విషయం ఒప్పుకోదలచుకోలేదు.

"అబ్బే. నాకేం కనిపించటంలేదు. కొండలు, మరుగుజ్జు చెట్లు కనిపిస్తున్నాయి!" అన్నాడు కార్తీక్.

"ఓ గాడ్! నాకేమయింది? నా కళ్ళకు అంతా విపరీతంగా కనిపిస్తోందే!"

కార్తీక్ లోలోన నవ్వుకున్నాడు. కాసేపు యిలాగే కొనసాగితే రెడ్‌సన్‌కి పిచ్చిపట్టడం ఖాయం! పిచ్చి పట్టిన కోతిలా గంతులు వేస్తే అది అవకాశంగా తను వీడి పని పట్టాలి—అనుకొంటూ నడుస్తున్నాడు కార్తీక్.

ఒక్కసారిగా ఎవరో మీద దూకినట్టు అనిపించి పక్కకి తప్పుకున్నాడు కార్తీక్. కార్తీక్ పక్కకు తొలగగానే ఆ ఆకారం సరాసరి రెడ్‌సన్ మీద పడింది.

రెడ్‌సన్ ఆశ్చర్యంనించి తేరుకొని ఆ ఆకారంమీద గురిచూసి కాల్చాడు. ఆ నిశబ్ద నిశీధిలో రివాల్వర్ చప్పుడు ప్రతిధ్వనించింది.

గాల్లో ఎవరో గలగల నవ్విన శబ్దం!

రెడ్‌సన్ చుట్టూ చూశాడు. ఎవరూ కనిపించలేదు. ఎదురుగా కొండలబారు కనిపించింది.

"ఏమిటి మిష్టర్ రెడ్‌సన్, ఎందుకో నెర్వస్‌నస్ ఫీలవుతున్నారు?" అన్నాడు కార్టిక్.

"అఁ అఁ! నథింగ్! ఏదో మనసు అన్‌సెటిల్డుగా వుండటంవల్ల! నిధి దొరుకుతుందన్న ఆనందంతో యేదో చేస్తున్నాను ఆలోచనలో పడి" అంటూ బలవంతాన నవ్వు తెచ్చుకున్నాడు రెడ్‌సన్.

ఇంతలో ఎక్కణ్ణుంచో పెద్ద పెద్ద బండరాళ్ళు విరిగి పడుతున్న చప్పుడు వినిపించింది. ఇద్దరు ఉలిక్కిపడి అటు చూశారు.

వాలుగా వున్న కొండచరియమీదుగా దొర్లి వస్తున్నాయి బండరాళ్లు. ఒకటి కాదు, రెండు కాదు—ఒకేసారి పది బండరాళ్లు! అంతదాకా ఎక్కడున్నాయో తెలియని బండరాళ్లు వరసగా దొర్లుకుంటూ మహావేగంగా వాళ్ళిద్దరిమీదకూ వస్తున్నాయి.

అటు, యిటు తప్పుకోటానికి వీల్లేకుండా రాళ్ళు దొర్లుకుంటూ వస్తున్నాయి. ముందునుంచి వెనుకనుంచి, పక్కల నుంచీ ఒకేసారి పెద్ద చప్పుడుతో దొర్లుతూ వాళ్ళమీదకు శరవేగంగా వచ్చేస్తున్నాయి!

ఏం చెయ్యాలో అర్థంకాక నిర్ఘాంతపోయి నిల్చుండిపోయారు—కార్టిక్, రెడ్‌సన్.

* * *

"మనం వీలైనంత త్వరగా యిక్కడ్నుంచి తప్పించుకోవాలి!" అన్నాడు అభిలాష్ స్నేహితులవైపు సాభిప్రాయంగా చూస్తూ.

దీప్తి, అశ్విని, హిమవంత్ అతనివైపు చురుగ్గా చూశారు.

"కార్తీక్ కి యేదైనా ఆపద తలపెట్టడు కదా, రెడ్ సన్!" అన్నాడు హిమవంత్.

"కార్తీక్ ఒక్కడే కాదు, మనమందరమూ ఆపదలో వున్నాం! తన స్వార్థం కోసం రెడ్ సన్ కార్తీక్ ను తీసుకువెళ్ళాడు. అతని పని పూర్తవగానే మనందర్నీ వరసపెట్టి కాల్చేస్తాడు" అన్నాడు అభిలాష్.

"అతని దగ్గర బుల్లెట్సు ఎన్నో లేవు. లోడ్ చేసుకున్నవి కాక మరో రౌండుకొస్తాయి, అంతే!" అన్నాడు అశ్విని. బుల్లెట్సు అంతదాకా అతని దగ్గరే వున్నాయి కాబట్టి అతను వాటిని కచ్చితంగా అంచనా వెయ్యగలిగాడు.

"ఒక్కసారిగా అతను నిధినంతా బయటకి చేరవెయ్యలేడు! పైగా ఇక్కడికి రెండు మైళ్ళు. మళ్ళీ ఇక్కడ్నుంచి బైగర్ హిల్స్ వరకు మరో నాలుగైదు మైళ్ళు. చాలా దూరం! ఒక్క మనిషి ఇన్ని కోట్ల విలువచేసే ధనరాశుల్ని కొండదిగి వేన్ లోనో జీప్ లోనో లోడ్ చేసుకోవటం సాధ్యమయ్యే పనికాదు!" అన్నాడు అభిలాష్.

"అయితే, అతని అవసరం తీరేవరకు మనల్ని ప్రాణాలతో వుంచటం ఖాయమే! కాని మిస్ దీప్తిని రక్షించవలసిన బాధ్యత మనమీద వుంది. ఆ రాక్షసుడి దేగ చూపు ఈమెమీదే వుంది!" అన్నాడు హిమవంత్.

"అది ఎలాగూ జరిగే పనికాదు. దయచేసి ముందుగా

నన్ను చంపెయ్యండి! మిమ్మల్ని వాడు ప్రాణాలతో వదలడు! మీరు లేకపోయాక నన్ను నేను రక్షించుకోవటంగాని, ఆత్మహత్య చేసుకోవటంగాని రెండూ సాధ్యపడవు. ఈలోపల వాడి చేతుల్లో నేను...." దీప్తి మాటల్ని దుఃఖం మింగేసింది.

స్నేహితులు ముగ్గురు ఆమెవైపు జాలిగా చూశారు. అభిలాష్ ఓదార్పుగా అన్నాడు. "మీరు అధైర్యపడకండి దీప్తీ! మన అదృష్టం బావుంటే కార్తీక్ చేతిలో రెడ్ సన్ చస్తాడు. కాని పక్షంలో వాడు బంగారాన్ని తీసుకుపోయే ప్రయత్నంలో వుండగా మనం ఎలాగైనా తప్పించుకొని వాడ్ని నరికిపారేద్దాం! ఎదురుగా వసంత వర్మ శవం మనకి కర్తవ్యాన్ని, ధైర్యాన్ని గుర్తుచేస్తోంది. అతని కత్తి మనకి సందర్భంగా ఉపయోగపడ్తుంది!" అన్నాడు అశ్విని పొడవాటి వసంతవర్మ కత్తినే దీక్షగా చూస్తూ.

"గుడ్ బాగా గుర్తుచేశావు. మనం దొర్లుకుంటూ ఆ కత్తిదాకా పాకగలిగితే మన బంధాలు తొలగించుకోవటం పెద్ద కష్టంకాదు! కత్తిని కోసుగా నిలబెట్టి దానికి ఈ తాడును ఆనించి కోసేస్తే కాసేపట్లో మనం బంధవిముక్తులం అవుతాం!" అన్నాడు అభిలాష్.

"ఎలా? చేతులు వెనక్కి విరిచి కట్టి, కాళ్ళకు చేతులకు కలిపి బంధనాలు వేశాడు. మళ్ళీ ఒకరినుంచి మరొకరికి సీరియల్ గా కట్టేసి రెండు కొనల్ని బండకి బలంగా బిగించి కట్టేశాడు. మనం దొర్లటానిక్కూడా అవకాశం లేకుండా చాలా ప్లాన్ డ్ గా బిగించేశాడు. ముందు బండనుంచి ముడి విడిపోయేలా ప్రయత్నం చెయ్యాలి!" అన్నాడు అశ్విని.

నలుగురు నిరాశగా ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. అప్పుడే రెడ్‌సన్, కార్తీక్ బయల్దేరి ఓగంట పైగా గడిచిపోయింది. రెండు మైళ్ళు యిటు, రెండు మైళ్ళు అటు — నాలుగు మైళ్ళు నడవటానికి గంటా గంటన్నర పడ్తుంది! అక్కడి కార్యక్రమం మరోగంట చేసుకున్నా, యింకా గంటన్నర వ్యవధి వుంది!

ఈలోపల తప్పించుకునే ప్రయత్నం చెయ్యాం!

నలుగురు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. దృష్టిసారించి ఆ బిలంలో వెతుకుతున్నారు, తమ బంధాలు తొలగించే సాధనం ఏముందా అని!

• • •

కార్తీక్, రెడ్‌సన్ కొద్ది క్షణాలు దిక్కుతోచక అలాగే నిల్చుండిపోయారు. బండరాళ్ళు దొర్లుతున్నాయి.

కార్తీక్ అటు యిటు చూశాడు. నాలుగువైపుల నుంచి రాళ్ళు దొర్లి వస్తున్నాయి. ఇంకొన్ని క్షణాల్లో తామిద్దరు ఆ రాళ్ళమధ్య నలిగి చావటం ఖాయం!

రెడ్‌సన్ అరిచి చెప్పాడు. "ఒక్కసారిగా బండల మీదినుంచి గెంతుతూ అవతలకు పరుగు పెట్టు కార్తీక్!" అంటూ అటో కాలు, ఇటో కాలు వేస్తూ బండలకింద కాళ్లు పడకుండా ఎగిరి గంతేస్తూ చాలా వేగంగా కప్పదాట్లు వేస్తూ ముందుకి పరుగెత్తాడు రెడ్‌సన్. అతనికంటె వేగంగా కార్తీక్ రాళ్ళమీదుగా గెంతుతూ ముందుకి ఉరకలు వేశాడు.

బండరాళ్ళ ఉధృతం తగ్గిపోయింది! మరి కొద్దిక్షణాల తర్వాత అక్కడ యెలాంటి రాళ్ళు కనిపించలేదు!

రెడ్‌సన్ కళ్ళు చికిలించి చూసి, "ఇదంతా యేదో మాయలా వుంది! ఎవడో మనల్ని కనికట్టుతో కట్టి

పడేస్తున్నాడు....ఆఁ, గుర్తొచ్చింది. ఇది ఆ కళ్యాణస్వామి పనే అయివుంటుంది. తన చీప్ విద్యల్ని మన మీద ప్రయోగిస్తున్నాడు” అన్నాడు.

కార్తీక్‌కి ఈ విషయం మొదట్లోనే తట్టింది. తప్పించుకు పారిపోయిన మాంత్రికుడు కళ్యాణస్వామి ఏ మూలనుంచో ఏ క్షణంలోనైనా విరుచుకు పడవచ్చునని అతను అనుమానిస్తూనే వున్నాడు. అతను పారిపోయే సమయంలో తన ఎముకతో పారిపోయాడు! దానితో తమమీద క్షుద్రవిద్యలు ప్రయోగిస్తూ వినోదం చూస్తున్నాడు!

ఇదేగాని నిజమయితే యిక తననుకాని, రెడ్‌సన్‌నుగాని ప్రాణాలతో అతను విడిచిపెట్టడు! హింసించి, భయపెట్టి, పిచ్చివాళ్ళనుచేసి, తమ ప్రాణాలు తామే తీసుకునేలా ప్రేరేపిస్తాడు! తను తియ్యకుండానే తమ ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయేలా చేస్తాడు.

కార్తీక్‌కి భయం వెయ్యటం లేదు! నిష్కారణంగా క్షుద్ర శక్తులకి బలయిపోవటం అతనికి సంతోషంగా లేదు! ముఖాముఖి ఎదుర్కొని శత్రువుతో పోరాడి చావటంలో వున్న ఆనందం, యిలా నికృష్టంగా చావటంలో లేదు!

కార్తీక్ రెడ్‌సన్ వైపు చూసి, “ముందుకు వెళ్దామా?” అన్నాడు.

రెడ్‌సన్ వ్యంగ్యంగా నవ్వి, “వెనక్కు పోవటం భీరువుల లక్షణం! నేను పిరికివాడ్ని కాదు!” అన్నాడు దర్పంగా.

సరిగ్గా అదే సమయంలో ఎక్కడినుంచో సెలయేటి

గలగల వినిపించింది. మరికొద్ది క్షణాల్లో యిద్దరు ఓ సెలయేటి ఒడ్డుకు వచ్చేశారు.

రెడ్‌సన్ ఆనందంగా యీల వేసి, "ఇదిగో సెలయేరు! అవిగో రాళ్ళ గుట్టలు!! ఇంకా స్త దూరంలోనే మనకి సన్నని బాట, నిధి వున్న గుహా కన్పిస్తాయి! మనం గమ్యానికి చాలా దగ్గరలోకి వచ్చేశాం!" అన్నాడు.

కార్తీక్ మౌనంగా నడుస్తున్నాడు. సెలయేరు ఎంత లోతుందో! చటుక్కున రెడ్‌సన్ని సెలయేట్లోకి తోసేస్తే....! సెలయేట్లో జారుతూనే తనని గురిచూసి కాల్చేస్తాడేమో! అలాకాకున్నా సెలయేరు మనిషి మునిగేటంత లోతు లేకపోతే, రెడ్‌సన్ తనని మరుక్షణం శవంగా మార్చేస్తాడు.

ఎలా....? నిధి దాచిన ప్రదేశం దగ్గరై పోతున్నకొద్దీ కార్తీక్‌లో ఆరాటం పెరిగిపోతోంది. రెడ్‌సన్ నిధిని సమీపించేలోపల అతన్ని అంత మొందించగలడా తను? తన చేతిలో కాగడా తప్ప, వేరే సాధనం లేదు. ఆయుధం లేదు! రెడ్‌సన్ చేతిలో మారణాయుధం వుంది! దాన్లో యింకా అయిదు బుల్లెట్స్వున్నాయి. అతని జేబులో యింకా ఎన్ని గుళ్ళున్నాయో! బుల్లెట్సన్నీ వ్యర్థమయిపోయేలా చేయగలిగితేగాని, రెడ్‌సన్ నించి తనకు ప్రమాదం తప్పినట్టు కాదు!

ఇంతలో అకస్మాత్తుగా వాళ్ళిద్దమీదా ఏవో వస్తువులు పడటం ప్రారంభమయింది.

అవి సన్నటి పురుగులు! రెండడుగుల పొడవున్న తీగల్లాంటి పురుగులు. వర్షంలా ఒక్కసారిగా వాళ్ళిద్దరి మీదా ఏకధాటిగా పడుతూనే వున్నాయి. రెడ్‌సన్, కార్తీక్ దుస్తులు దులుపుకోవడంలో అటు యిటుగా

అయ్యారు ఆ పురుగులు తమని కుట్టడంలేదు కాని విప రీతమైన ఎలర్జీని సృష్టించాయి. ఒళ్ళంతా ఒకటే జిల! భరించలేని దుర్వాసన!

ఒళ్ళు జలదరించింది వాళ్ళకు. ఒక్కసారిగా అవి యెక్కడ్నుంచి వచ్చిపడుతున్నాయో తెలీకుండా వుంది! వాటినుంచి తప్పించుకోవటం బ్రహ్మప్రళయంలా వుంది! దులుపుకునే కొద్దీ యింకా ఒంటినిండా వచ్చి పడుతునే వున్నాయి!

రెడ్సన్ ఇరిటేషన్తో కేకలు పెట్టాడు. "గాడ్, యిలాంటి బాధ పగవాడికూడా వద్దు! ఇవి ఎక్కడి నుంచి వచ్చి పడుతున్నాయి, ఏం చెయ్యబోతున్నాయి?" అంటూ.

చూస్తూండగానే తీగెల్లాంటి ఆ పురుగులు పొడవాటి తాడులాగా అల్లుకుపోయి వాళ్ళిద్దర్నీ కాళ్ళు చేతులు బంధించేశాయి.

ఈ విడ్డూరానికి ఆశ్చర్యపోతూ పురుగులు అల్లిన ఆ తాడును తెంచుకోవటానికి రెడ్సన్ విశ్వప్రయత్నం చేస్తూంటే, కార్తీక్ ఈ క్షుద్ర విద్యలు ప్రదర్శిస్తున్న వ్యక్తి కళ్యాణస్వామేనా, కాక మరెవరయి వుంటారా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

అతని చేతిలోని కాగడా, బంధనాలు తప్పించుకునే ప్రయత్నంలో నేలమీద పడిపోయింది! రెడ్సన్ మాత్రం రివాల్వర్ ఫర్మ్గా పట్టుకొని పురుగుల బంధాలు తెంచుకోవటానికి శక్తినంతా వినియోగిస్తున్నాడు.

•  •  •

"ఆఁ, అయిడియా! ఆ కాగడా చూశారా.... దాన్ని యెలాగైనా బండమీద కట్టిన తాడు ముడిమీద పడే

లాగా చెయ్యగలిగితే ఆ మంటకు నైలాన్ తాడు కరిగి పోయి, బండనుంచి కట్లు వూడిపోతాయి! తర్వాత దొర్లు కుంటూ అదే కాగడాకి గాని లేక కత్తికి గాని మన బంధాలు తాకిస్తే బంధవిముక్తుల మవుతాం!" అన్నాడు అభిలాష్.

తక్కిన ముగ్గురికీ అతని సలహా నచ్చింది. కాని కాగడా బండమీదకి పడేలా చేయటం ఎలా? కాగడాను బండ రాయికి పక్కగానున్న ఓ పొడవాటి రాతికి కట్టి వుంచాడు వసంతవర్మ. ఆ రాతినుంచి బండమీదికి ఆ కాగడా పడేలా చేయగలిగితే అది బండరాతికి కట్టిన తాడును కాల్చేస్తుంది. తాడు కరిగిపోయి వూడిపో తుంది!

అశ్విని మెదడు చురుగ్గా పనిచేసింది. నేలమీద చెదురుమదురుగా చిన్న చిన్న రాళ్ళున్నాయి. కాలితో రాళ్ళు దగ్గరగా లాక్కున్నాడు. కుడికాలు బొటన వేలిని, రెండో వేలికి మధ్య రాళ్ళను గుచ్చిపట్టి కాగడా కట్టబడివున్న పొడవాటి రాయిమీదకు విసిరాడు.

పది పన్నెండుసార్లు రాళ్ళు వ్యర్థంగా పక్కకి పడి పోయాక పదమూడోసారి అతని ప్రయత్నం ఫలించింది! కాగడా సూటిగా వచ్చి బండరాయిమీద పడింది. నైలాన్ తాడుకొస కొద్దికొద్దిగా కరుగుతూ, కాసేపటికి బండకి కట్టబడ్డ తాడు రెండు చివరలు కాలిపోయాయి.

అంతే, బండనుంచి వాళ్ళకు విముక్తి దొరికింది.

"థాంక్యూ అశ్వనీ!" అన్నాడు అభిలాష్ ప్రశంసా పూర్వకంగా.

"ఇప్పుడు నేలమీద దొర్లుదాం. నేను కాలితో నేల మీద ఫ్లాట్‌గా వున్న కత్తిని కోసుగా చెయ్యగలను.

మీరొక్కొక్కరు ఆ కత్తికి మీ కట్లను రాపాడించి, తెంచేసుకోగలరా?" అన్నాడు అశ్విని.

"దానికన్న కాగడా మంటకే కట్లు తాకించి, సులువుగా కట్లు వూడదీసుకోవచ్చు ననిపిస్తోంది నాకు!" అన్నాడు అభిలాష్.

"అదే తేలిక! కత్తి చాలా పదునుగా వుంది. ఎంత జాగ్రత్తగా వున్నా సర్రున చేతులు తెగిపోయే ప్రమాద ముంది!" అన్నాడు హిమవంత్.

"కాగడా మంటకూడా ప్రమాదమే! చేతులు కాలే ప్రమాదముంది. ప్రయత్నిద్దాం. ముందు కాగడా తో ట్రయల్ చేద్దాం!" అన్నాడు అశ్విని.

నలుగురు ఒకరిమీద మరొకరుగా దొల్లుతూ కాగడా వున్న బండ దగ్గరికి చేరుకోవటానికి సర్వశక్తులు క్రోడీకరించి ప్రయత్నిస్తున్నారు.

• • •

"రివాల్వర్ ప్రయోగించండి మిష్టర్ రెడ్ సన్!" అన్నాడు కార్తీక్.

రెడ్ సన్ రివాల్వర్ వున్న చేతికూడా పురుగులు తాడులా అల్లుకుపోయే లోపల, చేతిని వెసులుబాటు చేసుకొని తాళ్ళవంటి ఆ పురుగుల్ని ఎలా కాల్చాలో అర్థంకాక సతమత మవుతున్నాడు.

"కార్తీక్, రివాల్వర్ ప్రయోగించటంవల్ల ప్రయోజనంలేదు. గుళ్ళు మన శరీరంలోకి దిగటం తప్పితే, యీ తాళ్ళు తెగవు. చాలా సన్నగా వున్నాయి!" అన్నాడు రెడ్ సన్.

కార్తీక్ అంతటి నిస్సహాయ స్థితిలోనూ రెడ్ సన్ పాట్లు చూసి లోలోపల నవ్వుకున్నాడు. తమని పురుగుల

కన్నా హీనంగా భావించి మాట్లాడిన రెడ్‌సన్ ఇప్పుడు అతి సన్నటి హీనమైన పురుగులకి బందీ అయ్యాడు.

కాలు కదపడానికి వీల్లేకుండా జలగల్లా పట్టేసుకున్న వింత పురుగుల్ని చూస్తుంటే, వాటినుంచి వస్తున్న దుర్వాసనను తల్చుకుంటే ఒళ్ళు కంపరమెత్తిపోతోంది కార్టిక్‌కి. అయినా భరిస్తున్నాడు.

ఇంతకీ ఎవరతను?

అకస్మాత్తుగా వికటాట్టహాసం వినిపించింది!

కార్టిక్, రెడ్‌సన్ నివ్వెరపోయి చూశారు.

ఎదురుగా కళ్యాణస్వామి! మాంత్రికుడు కళ్యాణ స్వామి! వికటంగా నవ్వుతున్నాడు!

కిందపడి మండుతున్న కాగడా వెలుగులో అతని ముఖం ప్రళయకాల రుద్రుడి ముఖంలా భగభగా మండుతున్నట్టు కనిపించింది వాళ్ళకు. అతను నవ్వుతున్నట్టు లేదు! నిప్పులు రాలుస్తున్నట్టు, మూడో నేత్రం తెరిచి భస్మం చేయబోతున్నట్టు కనిపించాడు!

రెడ్‌సన్ రివాల్వర్ ప్రయోగించాలని శతవిధాలా ప్రయత్నించాడు. కాని అప్పటికే పురుగుల తాళ్ళు అతన్ని కదలకుండా బంధించాయి! అతని చేయి స్తంభించి పోయింది. స్తంభించిపోయిన చేతిలో మారణాయుధం ఓ ఇనపముక్కలా నిరుపయోగంగా మిగిలి పోయింది!

కళ్యాణస్వామి రెడ్‌సన్‌కి దగ్గరగా వచ్చేశాడు. నూటిగా రెడ్‌సన్ కళ్ళలోకి చూస్తున్నాడు. అతని కళ్ళలోని అయస్కాంత శక్తికి మంత్రముగ్ధుడిలా అతని వైపే చూస్తూండిపోయాడు. నోటమాట రానట్టు, కదలిక లేనివాడిలా అలాగే నిల్చుండిపోయాడు!

కళ్యాణస్వామి వికటంగా నవ్వాడు. రెడ్‌సన్ దుస్తులు తడిమాడు. రాగిఫలకం వెతికాడు.

రెడ్‌సన్ ప్రతిఘటించాలనుకున్నాడు. అరవాలనుకున్నాడు. రివాల్వర్ ప్రయోగించాలనుకున్నాడు. కాని ఏ ఒక్కటీ చెయ్యలేకపోయాడు.

రాగిఫలకం అందుకొని ఒక్కసారి దానిలోకి పరీక్షగా చూశాడు కళ్యాణస్వామి త్వరగా వేగంగా అడుగులు వేస్తూ ముందుకి సాగిపోయాడు.

రెడ్‌సన్ నిస్సహాయంగా చూస్తూండిపోయాడు.

కా రీక్ రెడ్‌సన్ నిస్సహాయ స్థితిని చూస్తూ మనసులోనే సంతోషిస్తున్నాడు!

కళ్యాణస్వామి శరవేగంతో ముందుకు దూసుకుపోతున్నాడు. రాళ్ళ గుట్టలు దాటేసి సన్న బాటలోకి ప్రవేశించాడు.

ఎదురుగుండా గుహ అతనికి స్వాగతం పలుకుతున్నట్టుగా కనిపించింది. కళ్యాణస్వామి మహానందంగా గుహ లోపలికి అడుగు పెట్టాడు.

* * *

"గుడ్, ముళ్ళన్నీ వచ్చేశాయి. అన్నీ ఒక్కొక్కరివీ విప్పేసెయ్యి!" అన్నాడు అభిలాష్.

ముందుగా అశ్వని తాళ్ళు తెంచుకొని అభిలాష్‌ని, హిమవంత్‌ని, దీప్తిని వరసగా బంధాలనుంచి తప్పించాడు.

తాడు కట్టినంత మేరా రక్త ప్రసరణం లేక పాలిపోయిన శరీర భాగాలు మళ్ళీ రక్తాన్ని ప్రసారం చేయటం మొదలెట్టాయి. తిమ్మిరి తగ్గి అవయవాలు స్వాధీనంలోకి వచ్చాయి.

అప్పటికి కాగడా నేలమీదపడి పూర్తిగా మంటలు రేగి కాలిపోయింది.

బిలమంతా చీకటిమయమై పోయింది.

అశ్విని నేలమీద తడుముకుని కత్తిని చేత పట్టుకున్నాడు. నేలమీద బుల్లెట్లు లేని రెండు గన్స్ అభిలాష్, హిమవంత్ చేతి ధరించారు.

అవే తమ ఆయుధాలు! శత్రు సంహారానికి, తమకు ప్రస్తుతం ఆత్మరక్షణ సాధనాలు అవే!

"ఎలా, దారి కనిపించటంలేదు? కాగడాలు యింకా ఏమైనా వున్నాయేమో చూద్దామా?" అన్నాడు హిమవంత్.

"ఇక వెతికి లాభంలేదు. రెడ్‌సన్ వున్న కాగడా పట్టుకుపోయాడు. మనం ఇదే కాగడాకు నారబట్టలేమైనా కట్టి, అక్కడున్న పాత్రలోని చమురులో ముంచి తంటాలు పడేటంత వ్యవధిలేదు! రెడ్‌సన్ ఈపాటికి తిరిగి వచ్చేస్తూంటాడు! కార్తీక్‌ని ప్రాణాలతో ఉంచాడో లేదో కూడా తెలియదు! యేమాత్రం అవకాశమున్నా కార్తీక్‌ని రక్షించుకోవాలి!" అన్నాడు అభిలాష్.

అశ్విని దీప్తివంక చూసి, "మిస్ దీప్తి, మీరు మా మధ్యగా నడవండి! అభిలాష్, నీకు నిధికి పోయే మార్గం గుర్తుంది కదూ!" అన్నాడు.

"ప్రతి చిన్న విషయమూ గుర్తున్నాయి. కాకపోతే చీకట్లో దారి తప్పిపోతామని భయంగా ఉంది!" అన్నాడు అభిలాష్.

అందరు బిలంనుంచి బయటికొచ్చారు. బయట పచ్చగా వెలుగు కనిపిస్తోంది.

"ఫరవాలేదు, కళ్యాణదుర్గం మీద ఎక్కడినుంచో

పడ్తోన్న చంద్రకిరణాలు పచ్చటి వెలుగును వెదజల్లు తున్నాయి. ఆ వెలుగులో ముందుకు సాగి పోలేమా?" అన్నాడు అశ్విని.

అభిలాష్ తలూపి, "ఇదిగో యెడమవైపు రెండో ద్వారం కనిపిస్తోంది! దీని పక్కగా వెళ్తే దాదాపు రెండు మైళ్ళ అనంతరం నిధి దాచబడ్డ గుహ కనిపిస్తుంది! ఈలోపలే మనకు రెడ్ సన్, కార్తీక్ ఎదురుపడతారని వూహిస్తున్నాను" అన్నాడు ముందు తను దారితీస్తూ. అతని మెదడులో రాగిరేకుమీది గుర్తులు, సంకేతాలు ముద్రపడిపోయాయి. పైగా వసంతవర్మ యిచ్చిన వివరణ కూడా మనసుకు బాగా హత్తుకుపోయింది.

ఓ ఫర్లాంగుమారం నడిచేసరికి దీప్తి 'అబ్బా' అంటూ ఆగిపోయింది కాలు పట్టుకుని.

అందరు ఆగిపోయి, "ఏమిటి, ఏమయింది?" అంటూ ఆమె చుట్టూ చేరారు.

"ఏదో కాలిలో దిగినట్టనిపించింది. రక్తం స్రవిస్తోంది!" అన్నది.

అందరు అక్కడ పరిశీలనగా చూశారు. కోసుగా వున్న రాయి తెగింది!

అశ్విని "ఫరవాలేదు మిస్ దీప్తి! మేము ఏ పురుగు ముట్టించోనని భయపడ్డాం!" అన్నాడు తేలికగా వూపిరి తీసుకుని.

దీప్తి నీరసంగా నవ్వి లేవబోతూ పక్కకి తూలింది. అశ్విని ఆమెను పట్టుకునే లోపల ఆమె పక్కకు తూలి పడిపోయింది!

అంతే, ఒక్కసారిగా ఆమె క్రిందికి దిగిపోతున్న అనుభూతిని పొందింది!

"ఇది ఊబిలా వుంది, నన్ను పట్టుకోవటానికి ప్రయత్నించకండి, మీరు పడిపోతారు!" అన్నది గొంతు చించుకుంటూ. ఆమెను చేయి అందించి పట్టుకోబోయిన అశ్వానికి ఆమె చేయి అందలేదు.

అభిలాష్ సమయస్ఫూర్తితో ఆమెకు తన చేతిలోని గన్ తిరగేసి అందించాడు. కాని ఆమె అది అందుకునేలోపల అతి వేగంగా కిందికి కూరుకుపోసాగింది!

అంతదాకా తమ పక్కన వున్న ఆ పెద్ద ఊబిని గుర్తించలేకపోవటం అందరికీ బాధ కలిగించింది.

అశ్వాని మెరుపు వేగంతో బిలంవైపు పరుగెత్తుకుని వెళ్ళాడు.

దీప్తి తలవరకు ఊబిలో కూరుకుపోయింది.

నిస్సహాయంగా చూస్తూ ఒడ్డునే నిలుచుండిపోయారు అభిలాష్, హిమవంత్ — స్నేహితురాలికి తుది వీడ్కోలు యివ్వటానికి సిద్ధంగా వున్నట్టు!

దీప్తి రెండు చేతులు ఎత్తి ఒడ్డున వున్న స్నేహితులకి నమస్కరించింది. "మీ స్నేహితుడికి నమస్కారాలు చెప్పానని చెప్పండి! చివరి క్షణాల్లో ఆయనను చూడలేకపోయినందుకు బాధపడ్డానని చెప్పండి! నా గురించి బాధపడవద్దని చెప్పండి!" అంటూ ఆమె అప్పగింతలు పెడుతుంటే అభిలాష్, హిమవంత్‌కి కన్నీళ్ళు ఆగలేదు.

తమ కళ్ళముందే స్నేహితురాలు దుర్మరణం పాలవుతుంటే చూస్తూ నిల్చున్న తమమీద తమకే అసహ్యమనిపించింది.

అభిలాష్ తనూ ఉరికెయ్యాలనుకున్నాడు. కాని దీప్తి అప్పటికే వాళ్ళను హెచ్చరించింది — తనకోసం ప్రాణాలు బలిచేసుకోవద్దని! అయినా, ఆమె నల్లా

చూస్తూంటే వాళ్ళ మనసులు ఆగటంలేదు! హిమవంత్ కూడా అదే పరిస్థితిలో వున్నాడు!

* * *

కళ్యాణస్వామి గుహలోకి రాగానే ముందుగా కుడి పక్కన వున్న సంకేత స్థలంలో చకచక ఎముకతో తవ్వాడు! ఎక్కువ శ్రమపడనవసరం లేకుండానే రాగి రేకు బయల్పడింది.

కళ్యాణస్వామి ఆనందంతో పెద్ద కేక వేశాడు!

రాగిరేకును పైకితీశాడు. బాగా మట్టిపట్టి వున్నది. దాన్ని మట్టి దులిపి, గుహ బయటకు తీసుకొచ్చి పచ్చగా మెరుస్తున్న మసక వెలుగులో చూశాడు.

ముందు చూసిన రాగిరేకులాగే బాణాల గుర్తులు, సంకేతాలతో ఉన్న సంస్కృతంలో రాసిన అక్షరాలు చదువుకున్నాడు.

నిధి ఆ గుహలోనే యెడమువైపు నేలమాళిగలో ఉన్నట్టు సూచించబడింది.

కళ్యాణస్వామి పరుగు పరుగున గుహలోకి పరుగెత్తి ఎడమవైపు నేలమాళిగ గురించి వెతుక్కున్నాడు. సన్నటి రాతిపలక చేతికి తగిలింది. దాని చుట్టూ వున్న మట్టిని రాగిరేకుతోనే తొలగించి, గోళ్ళు జొనిపి, రాతిపలకను పైకిలేపాడు.

మనిషి దూరగల సన్నని బిలం కనిపించింది.

సరాసరి కిందికి మెట్లున్నాయి.

కిందినుంచి వెలుగు బిలంలోనుంచి పైకి ప్రసరిస్తోంది, ఏటవాలు కిరణంలాగా! అది కళ్యాణస్వామికి గుర్తే. అక్కడ నిధి వున్నది! మణి మాణిక్యాలు, వజ్ర వైడూర్యాలు కాంతిపుంజాలను వెదజల్లుతున్న వెలుగది!

బంగారు కాంతి! కొన్ని వేలకోట్ల రూపాయల నిధి వెదజల్లుతున్న స్వర్ణ కాంతి!

కళ్యాణస్వామి ఆనందంతో పెద్దగా కేక పెట్టాడు. మెట్లు రెండేసి చొప్పున దిగుతూ నేలమాళిగలోకి దూరి కాడు!

అంతే! ఒక్కసారిగా బుస్సుమన్న శబ్దాలు ఆ నేల మాళిగను ప్రతిధ్వనింప చేశాయి. ఒకటి రెండు కాదు, పదులు యిరవయిల సంఖ్యలో కాల నాగులు బుస్సు మంటూ పడగలు విప్పి అతని పైపైకి వచ్చేశాయి.

నేలమీద ఏమాత్రం ఖాళీలేకుండా అంతా సర్పాల మయం!

నిధిని సర్వదా కొన్ని కాలసర్పాలు కాచివుంటా యన్న నిజం ఆలస్యంగా గ్రహించాడు కళ్యాణస్వామి!

అప్పటికే అతన్ని చుట్టుముట్టేశాయి సర్పాలు. తెలుపు, నలుపు, గోధుమ, రక్తవర్ణాల సమ్మిశ్రితమయిన కాలనాగులు వజ్రవైడూర్యాల ధగధగ కాంతులు ప్రతి ఫలించి మహా భయంకరంగా కనిపిస్తున్నాయి.

కళ్యాణస్వామి చేతిని గాల్లో ఊపి యేవో ఉచ్చ రించాడు — కాని అతని మంత్రం పూర్తికానేలేదు. ఒక్క సారిగా అనేక సర్పాల కోరలు అతని శరీరంలోకి కస్సున దిగిపోయాయి!

క్షణాలమీద అతని శరీరమంతా విషపూరితమై పోయింది.

నల్లగా బొగ్గులా మారిపోయాడు. యే నిధికోసం అహోరాత్రాలు శ్రమించి, క్షుద్రశక్తులను వశపరచుకుని పన్నెండేళ్ళు అజ్ఞాతవాసం చేశాడో ఆ నిధి కళ్ళముందే కన్నుల పండుగ చేస్తోంది! రత్నాలు, మణి మాణిక్యాలు,

వజ్ర వైడూర్యాలు, గోమేధిక, పుష్పరాగాలు, బంగారం — కన్నులను మిరుమిట్లు గొలిపే కాంతితో వెలిగిపోతోంది!

కాని ఆ కాంతిని చూడటానికి కళ్యాణస్వామి కళ్ళల్లో యిప్పుడు జీవం లేదు! అవి గాజుకళ్ళులాగా నిధి వంకే చూస్తున్నాయి!

నిలువునా నేలమీద, నిధిని తాకుతూ నిట్టనిలువుగా పడిపోయాడు కళ్యాణస్వామి!

* * *

ఒక్కసారిగా తమ బంధాలు ఎవరో విప్పేసినట్టుగా వీడిపోవటంతో కార్తీక్, రెడ్‌సన్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు.

రెడ్‌సన్ రివాల్వర్‌తో పొజిషన్‌లోకి వచ్చేశాడు! అది ఇప్పుడు కార్తీక్‌కే గురిచేయబడి వుంది!

"ఆశ్చర్యం, ఇంతదాకా మనల్ని బాధించిన పురుగులు, అవి యేర్పరచిన బంధాలు అవన్నీ యేమైపోయాయి? కమాన్ కార్తీక్....హరియప్....కళ్యాణస్వామి యీ పాటికి నిధిని చేరిపోయి వుంటాడు. అది వాడికి దక్కనివ్వకూడదు, పరుగెత్తు" అంటూ వింటిని సంధించి వదిలిన బాణంలా ముందుకు దూసుకుపోయాడు రెడ్‌సన్.

మరుగుజ్జు చెట్లు దాటిపోయాయి, సెలయేరు దాటిపోయింది. రాళ్ళగుట్టలు దాటిపోయి, గుహ, సన్నటి బాట కన్నులపండువుగా కనిపిస్తోంది. తనతోబాటు కార్తీక్‌ని రెక్కపట్టుకుని లాక్కుపోతూనే వున్నాడు రెడ్‌సన్.

అనాసక్తంగా అతన్నే అనుసరిస్తున్నాడు కార్తీక్.

గుహలోకి అడుగుపెట్టాడు రెడ్‌సన్.

అతని చేతివేళ్ళు రివాల్వర్ మీద బిగుసుకున్నాయి.

సేఫ్టీ కాచ్ తప్పించాడు. వేలు ట్రిగ్గర్ మీద రెడీగా పెట్టి ఉంచాడు. కళ్యాణస్వామి ఇంకా అక్కడే వుంటే ఈసారి తనబారినుంచి తప్పించుకోలేడు! అక్కడే సజీవ సమాధి చేసెయ్యాలి—అనుకుంటూ గుహంతా కలియదిరిగి బిలం దగ్గరకు పరుగెత్తాడు.

బిలానికున్న రాతిపలక అంతక్రితమే తొలగించబడి వుంది!

బిలం కిందినుంచి వస్తున్న పచ్చటి, ఎర్రటి, ఆకుపచ్చ వెలుగులు రెడ్‌సన్ కళ్ళల్లో కోటి కాంతులు ప్రతి ఫలించాయి!

ఆనందంతో పెడబొబ్బ పెట్టాడు!

బిలం దగ్గరకు వెళ్ళాడు. కిందికి మెట్లు కనిపించాయి. అతనికాక్షణంలో ధనదేవత మంజీర నాదాలు మృదుమధురంగా, మనోరంజకంగా వినిపించాయేగాని, కరాళ నృత్యం చేస్తున్న మృత్యువు యినప గజ్జెల శబ్దం వినిపించ లేదు.

"కార్తీక్, నిధి దొరికింది. నిధి మనకే దొరికింది! నేను కిందికి దిగి నీకు అందిస్తాను. నువ్వు కిందికి రాకు!" అంటూ మెట్లుమీదినుంచి బిలంలోకి ఉరికేశాడు!

అంతే! ఒక్కసారిగా బుస్సుమన్న కాల సర్పాల ఛీత్కారాలు కార్తీక్ ఒళ్ళు జలదరింప చేశాయి. అదే క్షణంలో రెడ్‌సన్ చేతిలోని రివాల్వర్ అయిదుసార్లు గర్జించింది! ఆ తర్వాత ఆ బుల్లెట్ శబ్దాలను కూడా మించిపోయిన భయంకరమైన చావుకేక, రెడ్‌సన్ నోటి నుంచి హృదయవిదారకంగా వెలువడింది.

కార్తీక్ మోకాళ్ళమీద వంగి బిలంలోకి చూశాడు. అతని కళ్ళంతా ముచ్చెమట్లు పోశాయి! వెన్నున యేదో

జరజరమని పాకినట్టు అనుభూతి కలిగింది!

అక్కడ వజ్ర వైడూర్యాలు, గోమేధిక పుష్య రాగాలు, మణి మాణిక్యాలు కాదు అతని దృష్టి నాకర్షించినవి!

చచ్చిపడివున్న కళ్యాణస్వామి, ఇంకా ప్రాణంకోసం పోరాడుతూ నికృష్టంగా మరణయాతన ననుభవిస్తున్న రెడ్‌సన్!

ఎన్నో నిండుప్రాణాల్ని బలితీసుకున్న ఆ వేలకోట్ల రూపాయల నిధి, కేవలం విలువలేనిదిగా చిల్లి పెంకులుగా కనిపించాయి కార్తీక్‌కి!

దేశంకాని దేశంనించి, కేవలం ధన కాంక్షతో ఆంధ్ర దేశానికొచ్చి, అన్యాయంగా నిధిని వశపరచుకుని కుల కాలని దురాశతో వచ్చి, కనకంతోబాటు కాంతకోసం కలలు కని, చివరికి ఆ కల కల్ల కాగా నిర్జీవంగా పడి వున్న రెడ్‌సన్ ధనాశతో మగ్గిపోయే దురాశపరులకు సందేశాన్నిస్తున్నవాడిలా కనిపించాడు కార్తీక్‌కి.

అంతే! బిలం ద్వారానికున్న సన్నటి రాతిపలకని యథాస్థానంలో అమర్చి, గుహనుంచి బయటపడి వచ్చిన దారినే, తనవాళ్ళని బంధించిన వసంతవర్మ నివాసంవైపు బాణంలా దూసుకుపోయాడు కార్తీక్!

* * *

అశ్విని రొప్పుతూ వచ్చాడు, నైలాన్ తాడుతో. అంతదాకా తమను బంధించిన ఆ తాడే తమ ప్రియతమ స్నేహితురాలి ప్రాణం రక్షిస్తుందని వాళ్ళు అంతవరకు కనీసం వూహించనుకూడా లేదు.

అప్పటికి దీప్తి తలమాత్రమే మిగిలివుంది భూమికి సమాంతరంగా, ఆమె రెండు చేతులు ఇంకా నమస్కారం

చేస్తూ అలాగే వున్నాయి!

ఆ చేతుల్లోకి షదేలాగా అశ్విని తాడు విసిరాడు.

"దీప్తి, దాన్ని పట్టుకోండి!" అంటూ అరిచాడు.

దీప్తి చటుక్కున, అసంకల్పితంగా తాడును పట్టుకుంది!

అభిలాష్, అశ్విని, హిమవంత్ ఒక్కసారిగా తమ సర్వశక్తులూ క్రోడీకరించి ఆమెని ఊబినుంచి పైకిలాగటంతో కృతకృత్యులయ్యారు.

దీప్తి ఒంటినిండా బురద! కాని ఆమె కన్నుల్లో తేజస్సు! స్నేహితులపట్ల అంతులేని కృతజ్ఞతా భావం అంతకుమించి తను కార్తీక్‌ని చూడగలనన్న ఆత్మవిశ్వాసం, సంతృప్తి ఆమె కన్నులకి ఆ వింత తేజస్సును తెచ్చాయా అన్నట్టు కాంతిపుంజాల గనుల్లా, వెలలేని నిధిలా వున్నాయామె మీన నేత్రాలు!

సరిగ్గా అదే సమయానికి ఒగుర్చుకుంటూ, దూసుకొచ్చేడు కార్తీక్!

తనవాళ్ళని బంధవిముక్తులైన తన స్నేహితుల్ని ఆ పచ్చటి గడ్డివెలుగుల్లో వెంటనే గుర్తుపట్టలేక పోయాడు. గుర్తింపుకి రాగానే ఆనందంతో కేక వేశాడు.

స్నేహితులు కార్తీక్‌ని చూసి అంతకు మించి ఆనందంతో అరిచారు.

క్షణాల్లో జరిగిన విషయాలు ఒకరికొకరు చకచక చెప్పుకుని ఆశ్చర్యానందాలతో తబ్బిబ్బు అయ్యారు.

"ఇక్కడ యింకొక్క క్షణం కూడా వుండొద్దు. ఇప్పుడు రాత్రి నాలుగ్గంటలు. మరో రెండు గంటల్లో తెల్లవారుతుంది. తెల్లవారేవరకు యిక్కడ ఆగటం అనవసరం! టైగర్ హిల్స్ చేరిపోతే చాలు ముం!దు"

అన్నాడు కార్తీక్.

దీప్తి వంక చూసి "నడవగలవా?" అన్నాడు ఆర్తిగా.

ఆమె చీరంతా బురదగొట్టుకొని పోయింది. ఒళ్ళంతా బురద! అయినా ఆ పరిస్థితి అలాంటిది.

నీరసంగా నవ్వి తలూపింది.

"గన్స్ తీసుకొస్తున్నాం!" అన్నారు అభిలాష్, హిమవంత్.

"నేను కత్తి తెస్తున్నాను. ఏమో, మనం టైగర్ హిల్స్ చేరేలోపల మళ్ళీ ఏ అవాంతరాలు ఎదుర్కోవలసి వస్తుందో....!" అన్నాడు అశ్విని కత్తి గాలిలో ఝళిపిస్తూ.

ఎన్నో రోజుల తర్వాత అందరు ఆనందంగా నవ్వుకున్నారు!

* * *

టైగర్ హిల్స్ సమీపిస్తున్నాయనటానికి సూచనగా నేలమాళిగ లోపలికి బయటనుంచి సూర్యకిరణాలు లోపలికి పడుతున్నాయి.

అప్పుడు ఉదయం ఏడున్నర గంటలు కావస్తోంది.

ఆనందంగా కేక వేశాడు అశ్విని! "అవిగో టైగర్ హిల్స్!" అంటూ. అందరూ ఉత్సాహంగా కేరింతలు కొట్టారు.

సరిగ్గా గుహ బయటికి రాబోతూ అశ్విని అందరివంకా చూసి "ఆగండి! బయట ఎవరో మనుష్లున్నారు. చాలా హడావిడిగా వుంది!" అన్నాడు.

అందరు చటుక్కున ఆగిపోయి ఒకరిముఖా లొకరు చూసుకున్నారు. కొంచెంపతీసి మరో బేచ్ నిధికోసం తవ్వ

కాలు సాగించటం లేదుకదా!

చరిత్ర చర్విత చర్వణం కావటం లేదుకదా!

అందరిలోనూ యిదే ప్రశ్న! తేలుకొండీల్లాంటి ప్రశ్న! ఒక్కసారిగా అందర్నీ నిరాశానిస్పృహలు ఆవరించాయి. తమ కష్టాలు యింకా గట్టెక్కలేదా? తమకు విముక్తి లేదా?

అశ్విని గుహ ముఖద్వారం దగ్గరకు వెళ్ళి తొంగి చూశాడు. కొద్ది క్షణాలు అతనికేమీ అర్థం కాలేదు. తర్వాత ఆనందంతో చిన్నగా కేక వేశాడు.

"మన ప్రొఫెసర్స్, చింతపల్లె సర్పంచ్ గారు, గ్రామస్తులు — అంతా మనవాళ్ళే. రండి!" అంటూ గుహ లోపలికి కేక వేశాడు అశ్విని.

అందరు బిలబిల మంటూ గుహ బయటకి రావటం, అదే సమయంలో అంత దాకా అక్కడ పరిశోధిస్తున్న పోలీసులు, చింతపల్లె సర్పంచ్, గ్రామస్తులు, కార్తీక్ వాళ్ళ యూనివర్సిటీ ప్రొఫెసర్లు, కొందరు విద్యార్థులు అందరు ఒక్కసారిగా వాళ్ళను చుట్టుముట్టడం జరిగి పోయింది.

చింతపల్లె సర్పంచ్ ఆనందంగా చెప్తున్నాడు. "మీరంతా క్షేమంగానే వున్నారు కదా బాబూ! మీరు ఎన్ని రోజులయినా తిరిగి రాకపోగానే మాకు గుబులు పుట్టిపోయింది. ఈ లోపల మీ ప్రొఫెసర్లు కూడా వచ్చి మీ గురించి ఎంక్వయిరీ చేయటంతో మాకు కాలు చెయ్యీ ఆడలేదు. మీరు చింతపల్లె తిరిగి రాకుండా మీ వూరెళ్ళిపోయారేమో ననుకొంటున్న మాకు అనుమానం వచ్చింది. అందరం టైగర్ హిల్స్ కు వచ్చి చూద్దుము కదా, యిక్కడ ముక్కలు పగిలిపోయే దుర్వాసనతో

కుళ్ళిపోయిన శవాలు కనిపించాయి. వెంటనే పోలీసులకి కబురు చేశాము. అందరం కలిసి కొండ కొచ్చి చూస్తున్నాం. లోపలికి వెళ్ళాలా వద్దా అన్న ఆలోచనలో వున్నాం. ఇంతలో మీరొచ్చారు....”

ప్రొఫెసర్లు, విద్యార్థులు కార్తీక్ బృందాన్ని ప్రశ్నలతో ముంచెత్తేస్తున్నారు. ప్రొఫెసర్ శరశ్చంద్ర, డ్రయివర్ భరణి అకాలమరణాలు వాళ్ళను కొద్దిసేపు విచారసాగరంలో ముంచేసినా, కార్తీక్, అతని స్నేహితులు ప్రాణాలతో బయట పడటం ఆనందమే కలిగించింది.

కొన్ని వేల కోట్లరూపాయల నిధిని ప్రభుత్వానికి అందించిన కార్తీక్ బృందాన్ని దేశం ప్రశంసలతో ముంచెత్తింది.

—: సమాప్తం :—

---

అంకితం

నా ఆరాధ్య దైవం, కలియుగ దైవం,
కళ్యాణ చక్రవర్తి, సప్తచలాధీశుడు,
శ్రీనివాసుని పాదపద్మములకు
భక్తి ప్రపత్తులతో,

—రచయిత

# కొత్త సీరియల్ ప్రారంభం!



## ప్రతాప రవిశంకర్

రోనాల్డ్ అపార్టుమెంట్స్. ఇరవై నాలుగో ఫ్లోర్‌లోని ఓ గదిలో భారత్ హడావిడిగా ఏవో కొన్ని వస్తువులను సూట్‌కేసులలోకి సర్దుకుంటున్నాడు.

వెనక్కు వాలినట్టున్న కుషన్ ఛెయిర్లో బాగా వెనక్కు ఒరిగి అతడి చర్యలను నిశితంగా పరిశీలిస్తూ కూర్చుంది స్టెల్లా.

అప్పుడు సమయం ఐదుగంటలు కావస్తోంది.

సాయంత్రం. సూర్యుడి కిరణాలు అద్దాల కిటికీల్లోనించి పలుచగా లోపలకు పడుతున్నాయి.

ఒక్కసారి భారత్ వెనక్కు తిరిగి తననే చూస్తున్న స్టెల్లాని "ఏమిటలా చూస్తున్నావు?" అన్నాడు చిరునవ్వుతో.

"నీ అందాన్ని" నవ్వింది స్టెల్లా.

భారత్ మాట్లాడలేదు.

చేస్తున్న పనిని వదిలి ఆమె దగ్గరకు వచ్చి ముందుకు వంగి ఎర్రగా దొండపండులా వున్న ఆమె పెదవులమీద ముద్దు పెట్టుకుని "థాంక్ యూ డియర్" అన్నాడు.

"యూ ఆర్ స్వీట్ మై డియర్" అన్నదామె.

అతను తిరిగి తన పనిలో నిమగ్నమయిపోయాడు.

అతడి అందం స్టెల్లాను చెప్పలేనంతగా ఆకర్షించింది. అందుకే తను అమెరికన్ యువతి అయివుండీ కూడా భారతీయుడైన భారత్‌ను ప్రాణాధికంగా ప్రేమించింది.

భారత్ అందం యెంతోమంది అందమైన యువతు లనే గిలిగిలింతలు పెడుతుంది.

సీలింగ్ ఫ్యాన్ గిర్రున తిరుగుతోంది.

స్టెల్లా ఒక్కసారి ఛెయిర్‌లోనించి లేచి ఒళ్ళు విరుచు కుంది. ఎదురుగా వున్న మిర్రర్‌లో తన రూపాన్ని చూసుకుంది. గర్వంగా ఓసారి తన అందాన్ని చూసుకుని చిరునవ్వు నవ్వుకున్నది.

ఐతే భారత్ కు స్టెల్లా చేష్టలు ఏవీ పట్టలేదు. అతని దృష్టి వజ్రాలమీదే వున్నది. అతను రహస్యంగా కొన్ని వజ్రాలను కస్టమ్స్ అధికారుల దృష్టి పడకుండా దాచే ప్రయత్నంలో వున్నాడు. ఆ ప్రయత్నాలు అతనికి బాగానే తెలుసు.

భారత్ గత కొన్ని యేళ్ళుగా వజ్రాల వ్యాపారం భారీయెత్తున చేస్తున్నాడు. ఆ వ్యాపారంలో అతను కోట్లకొలదీ ఆస్తి సంపాదించాడు. ఐనా సంపాదించా లనే తపన అతనిలో చల్లారలేదు. అత్యంత విలువైన వజ్రాలను సంపాదించటం అతని జీవిత ధ్యేయం.

విండో దగ్గర నిలుచుంది స్టెల్లా. అక్కడినించి కిందిక

చూస్తుంటే రివ్వున దూసుకుపోతున్న మోటారు వాహనాలు కనపడుతున్నాయి.

ఆమె ఒక్కసారి వాచీకేసి చూసుకుని అదిరిపడుతూ "మైగాడ్ ....దిసీజ్ ఆల్ రెడీ ఫైవ్ థర్టీ" అన్నది.

"యస్ ....డియర్ .... నా పని పూర్తయ్యింది. నువ్వు నీ లగేజ్ అంతా సిద్ధం చేసుకున్నట్లేనా?" ఆమె దగ్గరగా వస్తూ అన్నాడు భారత్.

"ఎప్పుడో అయిపోయింది మేన్. ఐయామ్ వెరీ థాంక్స్ టు బి కమ్ విత్ యూ" అన్నది అతని భుజం మీద రెండు చేతులూ వేసి కళ్ళలోకి చూస్తూ.

"యూ ఆర్ క్రేజీ" అన్నాడు ఆమె బుగ్గలమీద వేలితో రాస్తూ.

"ఐయామ్ నాట్ క్రేజీ. ఐయామ్ ఇన్ లవ్ విత్ యూ...."

నిముషాలు గడుస్తున్నాయి.

భారత్—స్టెల్లా ఈ లోకంలో లేరు.

ఇద్దరూ ఒకరి కౌగలిలో ఒకరు వొరిగిపోయారు. స్టెల్లా అమితంగా ఆవేశపడిపోతోంది. భారత్ కూడా అదే స్థితిలో వున్నాడు కాని అతనిలో ఎన్నోరకాల ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి.

ముఖ్యంగా— కిరోన్ ....

ఆమె గురించే అతను భయపడుతున్నాడు.

ఉన్నట్టుండి అతను స్టెల్లాను వదిలాడు.

"వాట్ హేపెండ్!" ఆశ్చర్యంగా అడిగింది.

"నథింగ్ ....వుయ్ హావ్ టు స్టార్టు....ఇటీజ్ గోయింగ్ టు బి సిక్స్."

"నో... యు ఫెల్ట్ సమ్‌థింగ్ ....ప్లీజ్ టెల్."

స్టెల్లా అతన్ని వదల్లేదు. అతని కళ్ళలో ఒక్కసారిగా కదిలిన భయాన్ని ఆమె గ్రహించింది. ఇలాంటి విషయాలను పసికట్టటంలో ఆమె చాలా తెలివైనది.

"సారీ స్టెల్లా.... నేను కరోన్ గురించి ఆలోచిస్తున్నాను. తెలిసో తెలియకో నావల్ల ఓ పొరపాటు జరిగిపోయింది. ఇప్పుడు నా కేమిటి దారి?"

"ఓహ్" తల విదిలించింది.

"ఆ డర్టీ బీచ్ గురించి ఆలోచిస్తున్నావా? అది ఇక్కడకు రాకముందే మనం యిక్కడినించి బయట పడదాం."

"నో....ఇట్స్ నాట్ పాజిబుల్....కరోన్ నా కోసం ఏర్‌పోర్టుకే నా వస్తుంది...."

స్టెల్లా ఏదో మాట్లాడబోయింది.

కాని—

ఇంతలోనే కాలింగ్ బెల్ మోగింది.

"మైగాడ్....నో డౌట్....ఇటీజ్ కరోన్.... ముందు నువ్వు రూమ్‌లోకి వెళ్ళు" అన్నాడు భారత్.

స్టెల్లా పక్కనే వున్న ఓ గదిలోకి వెళ్ళి దాక్కుంది. తలుపులు మూసి బోల్టు బిగించి వెళ్ళి డోర్ ఓపెన్ చేశాడు.

• • •

ఎదురుగా—కరోన్ చేతిలో బరువైన సూట్‌కేసుతో నిలుచుని వుంది.

తలుపు తెరుచుకోగానే ఒక్కసారిగా లోపలకు దూసుకువచ్చి సూట్కేసును వదిలి అతని తల పట్టుకుని ముందుకు వంచి భారత్ పెదవులమీద గాఢంగా ముద్దు పెట్టుకుంది.

ఆ ముద్దుకు అతడు ఉక్కిరిబిక్కిరయ్యాడు. మరో సమయంలో ఐతే అతను యెంతో సంతోషం పొందే వాడు.

కాని—ఇప్పుడు అతను భయపడుతున్నాడు ఆమె గురించి—

ఆమె కూడా భారత్‌తో ఇండియాకు వస్తానన్నది. అతను తీసుకు వెళతానని ఆమెతో స్వర్గపు అంచుల్లో ప్రమాణం చేసేటప్పుడు చాలాసార్లు ప్రామిస్ చేశాడు.

అందుకే కరోన్ తనకున్న ఆస్తి నంతటినీ బంగారం—వజ్రాలుగా మార్చి అతనితో బయల్దేరటా నికి వచ్చేసింది.

"డియర్ భారత్....నువ్వు నా కోసమే యెదురు చూస్తున్నట్టున్నావు...." అంటూ అతను సర్దుకున్న లగేజ్‌ను చూస్తూ. "నువ్వు రెడీ అయినట్టున్నావు....ఇక బయల్దేరుదామా?" అన్నది.

భారత్ మాట్లాడలేదు.

అతని మౌనం కరోన్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది.

"వాటీజ్ దిస్ సైలెన్స్" అతడి కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"ఐయామ్ సారీ కరోన్....యు ఆర్ నాట్ కమింగ్ విత్ మి..." అన్నాడు.

కరోన్ ఉలిక్కిపడింది.

క్షణం తర్వాత "ఎందుకని?" అన్నది.

"ఈసారి ఇక్కడకు వచ్చినప్పుడు తప్పకుండా నిన్ను తీసుకువెళతాను."

"ఇప్పుడేమయ్యింది?"

"ఏమయ్యిందో నేను చెబుతాను."

గిరుక్కున వెనక్కు తిరిగింది కరోన్.

రూమ్ తలుపులు తెరుచుకుని వున్నాయి.

అక్కడ స్టెల్లా నిలబడి వుంది. ఆమె చేతిలో రివాల్వర్ వుంది. అది సూటిగా కరోన్ కే గురిపెట్టబడి వుంది.

"యూ...." ఆగిపోయింది కరోన్.

"అవును. ఐయామ్ స్టెల్లా.... భారత్ తో ఇండియాకు నేను వెళుతున్నాను."

రివాల్వర్ ను వూపుతూ అంది.

కరోన్ — భారత్ కేసి తిరిగి "యూ చీట్ ....నువ్వు ఇంత మోసగాడివని అనుకోలేదు. డర్టీ ఇండియన్" అంటూ వూహించలేనంత వేగంగా అతడిమీదకు పులిలా దూకింది.

ఆ విసురుకు వెనక్కుపడబోయి ఎలాగో ఆగిపోయాడు భారత్.

"స్టాపిట్ ....భారత్ ను వదులు. లేకపోతే షూట్ చేస్తాను" అరిచింది స్టెల్లా.

కరోన్ — స్టెల్లా హెచ్చరికను లక్ష్యపెట్టలేదు. ఆమెకు కసిగా వుంది, అతను తనని మోసగించినందుకు. ఎంతో ఆశతో వచ్చింది అతనితో ఇండియాకు వెళ్ళిపోవాలని.

కంపూచియా వచ్చినప్పుడల్లా భారత్ ఆమెను పిల్చివేస్తున్నాడు. ఓ బొమ్మలా వాడుకుంటున్నాడు తన పనులన్నింటికీ.

అందుకే కరోన్ గుండె మండింది.

ఆడపులిలా అతనిమీద విరుచుకుపడి అతడి గొంతును పట్టుకునే ప్రయత్నాన్ని చేస్తోంది.

"డోంట్ యూస్ ది రివాల్వర్" అరిచాడు భారత్.

కాని—అప్పటికే ఆలస్యమయ్యింది.

సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ పేలింది. బుల్లెట్ దూసుకువచ్చి కరోన్ వెన్నులో దిగబడిపోయింది.

కవ్వున అరుస్తూ భారత్‌ను వదిలేసింది. అతను పక్కకు తప్పుకున్నాడు.

బోర్లా పడిపోయింది కరోన్.

అప్పుడు స్టెల్లా ఆమె దగ్గరగా వచ్చింది.

"నువ్వు తొందరపడ్డావు. షూట్ చెయ్యకుండా వుండవలసింది" అన్నాడు భారత్.

నవ్వింది స్టెల్లా.

"నేను షూట్ చెయ్యకుండా వున్నట్లయితే ఈ డెవిల్ నీగొంతునొక్కి చంపేసి వుండేది."

అతను మాట్లాడలేదు.

నెత్తురు కారుతోంది కరోన్ వీపులోంచి. ఆమె గిలగిలా తన్నుకుంటోంది.

ఒక్కసారి తలెత్తి యిద్దరినీ చూసి చిన్నగా ఇలా అంది:

"ఇందుకు తగిన ఫలితం యిద్దరూ అనుభవిస్తారు. యూ ఆర్ డెవిల్స్.... ఈ పాపం మిమ్మల్ని వెంటాడుతూనే వుంటుంది."

ఇంకేదో అంటున్నప్పుడు "స్టాప్ నాన్సెన్స్" అంటూ మరోసారి ఆమె తలకేసి రివాల్వర్ పేల్చింది స్టెల్లా.

అంతే. కరోన్ తల వాల్చేసింది.

ఆ దృశ్యాన్ని, స్టెల్లా తెగువను చూసి చలించి

పోయాడు భారత్.

అప్పుడామె రివాల్వర్‌ను పర్సులో గుండెల మధ్య దాచుకుని "ఉయ్ హావ్ నో టైమ్....ముందు మనం ఈ శవం సంగతి చూడాలి" అన్నది.

"ఏం చేద్దాం?"

"ఇండియాకు తీసుకు వెళదామా?"

"డోంట్ కట్ జోక్స్ స్టెల్లా!....టేకిట్ సీరియస్."

"ఆల్‌రైట్....బాత్‌రూమ్‌లోకి ఈడ్చుకు వెళదాం. లాక్ చేసి వెళ్ళిపోదాం. ఇక్కడి పోలీసులకు ఈ వార్త తెలిసేసరికి మనం ఈ దేశం వదలి వెళ్ళిపోతాం."

"ఓకే...." అంటూ అతను ముందుకు వంగాడు.

ఇద్దరూ కేరోన్ శవాన్ని బాత్‌రూమ్‌లోకి ఈడ్చుకు వెళ్లారు.

పూర్తిగా ఓ కార్నర్‌లోకి ఈడ్చేశారు.

స్టెల్లా బాత్‌రూమ్‌లో వున్న ఎలక్ట్రిక్ బల్బును రివాల్వర్‌తో పగలగొట్టింది.

"ఎందుకు బల్బును పగలగొట్టావ్?"

"ఎవరైనా స్విచ్ నొక్కినా దీపం వెలగదు. లోపల వున్న ఈ డెవిల్ ఎవ్వరికీ వెంటనే కనపడదు."

"యూ ఆర్ జీనియస్."

భారత్ ఆమె తెలివిని మెచ్చుకున్నాడు.

ఐదు నిమిషాల్లో అక్కడి నెత్తురును నీళ్ళతో కడిగి ఏలాంటి ఆనమాలు లేకుండా తుడిచేసింది స్టెల్లా.... బాత్‌రూం లాక్ చేశారు.

అంతా అయిపోయిన తర్వాత "వుయ్ హావ్ డన్ ఎ గుడ్ థింగ్...." అన్నది.

"అవును. ఇక మనం బయల్దేరుదాం" అన్నాడు భారత్.

"ఓ.కె...." అంటూ తన లగేజ్‌ను తీసుకుంది.

భారత్ — కరోన్ సూట్కేసును అప్పుడే చూసి "జస్ట్ మినిట్" అని దాన్ని ఓపెన్ చేశాడు. అందులో మరో బాక్స్ వుంది.

దాన్ని తెరిచి "మై గాడ్! డైమండ్స్ .... గోల్డు కాయిన్స్" అన్నాడు సంతోషంగా.

"పూర్ కరోన్....ఎనీ హౌ థాంక్స్ టు కరోన్" అన్నది సెల్లా వాటిని చూసి.

"యూ ఆర్ లక్కీ" అంటూ అతను రెండు నిమిషాల్లోనే తన సూట్కేసులో వున్న రహస్య అరల్లో సర్దేశాడు వాటిని.

మరో పదినిమిషాలు గడిచాయి.

ఆ ఇద్దరూ లిఫ్ట్‌లో కిందికి వచ్చారు.

* * *

అప్పటికి వెలుతురు పూర్తిగా పోయింది.

చీకటి తెరలు అంతటా కమ్ముకున్నాయి.

చలిగాలి కూడా మొదలయ్యింది.

ఖాళీగా వెళుతున్న టాక్సీని ఆపింది సెల్లా.

అందులో ఇద్దరూ కూర్చోగానే "ఏర్‌పోర్టు" అన్నాడు భారత్.

చిన్న జర్క్‌తో ముందుకు కదిలింది టాక్సీ.

వీధులన్నీ సందడిగా వున్నాయి.

షాపుల్లో దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

టాక్సీ కొంత దూరం వెళ్ళిన తర్వాత పెద్దగా అరుస్తూ కొంతమంది మనుషులు రోడ్లమీద పరిగెత్తుకుంటూ వస్తూ

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే వి.పి. ద్వారా మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

అయితే, ఈ స్కీము అపన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేదనే విషయం నిర్ధారణ చేసుకోండి.



కనిపించాయి.

ఆగిపోయింది టాక్సీ.

కొంచెం దూరంలో ఓ మోటారుకారు తగలబడి పోతూ కనిపించింది.

మంటలు పైకి వస్తున్నాయి.

ఆ మంటల చుట్టూ తిరుగుతూ పెద్దగా అరుస్తున్నారు.

"ఏం జరుగుతోందక్కడ?" తల బయటపెట్టి చూస్తూ అడిగాడు భారత్.

టాక్సీని పక్కనే వున్న మరో వీధిలోకి తిప్పుతూ అన్నాడు డ్రైవర్.

"లిబరేషన్ సొసైటీ వాళ్ళు అల్లరిచేస్తున్నారు."

"ఇక్కడ ఈ సొసైటీ వాళ్ళ అల్లర్లు ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి. ఈసారి కొంచెం తీవ్రస్థాయిలో జరుగుతోంది. విప్లవం పేరుతో ఆస్తులను నాశనం చేయుటమే ఈ సొసైటీ వాళ్ళ లక్ష్యం."

చెబుతోంది స్టెల్లా.

టాక్సీ ఓ నాలుగురోడ్ల కూడలిలోకి వెళ్ళింది.

అక్కడే ఓ టర్నింగ్ తిరగబోయే ముందు ఎక్కడి నించో రాళ్ళు వచ్చి టాక్సీ వెనుక పడ్డాయి.

వేగంగా ముందుకు దూసుకుపోయింది కాబట్టి వెనుక అద్దం పగలేదు.

"మన స్టార్టింగ్ బాగోలేదు" అన్నాడు భారత్ వెనక్కి తిరిగి చూస్తూ.

ఇంకా కొంతమంది యువకులు రాళ్ళు విసురుతూనే వున్నారు.

షాపులు వరుసగా క్లోజ్ చేస్తున్నారు.

"మీ ఇండియన్స్‌కు సెంటిమెంట్స్ యెక్కువను కుంటాను" నవ్వుతూ అన్నది స్టెల్లా.

"అవును. ఇందులో రియాలిటీ వుంది. నీకు చెప్పినా అర్థంకాలేదు. నువ్వూ ఫీల్ అయినప్పుడే నీకు తెలుస్తుంది."

"ఆల్ రైట్ .... ఒప్పుకుంటున్నాను."

అతను నవ్వాడు.

కళ్ళముందు కెరోన్ రూపం కదులుతోంది. ఆమెను చంపకుండా వుండవలసింది. వజ్రాల సేకరణలో తనకు ఎంతగానో సహాయపడింది.

జీవితంలో యెన్నడూ మరచిపోలేనంత సుఖాన్ని ఇచ్చింది. తనతో ఇండియాకు వస్తానన్నది.

తను ఒప్పుకున్నాడు.

తన నే నమ్ముకుని వచ్చేసింది. కాని—

జరిగిందేమిటి?

హత్య.... చావును తెచ్చుకున్నది.

ఈ ఆలోచనల్లో భారత్ టాక్సీ ఏర్‌పోర్టు ముందు ఆగటాన్ని తెలుసుకోలేదు.

అప్పటికే స్టెల్లా దిగి ఫేర్ చెల్లించి "డియర్ సర్.. ఏర్‌పోర్టు వచ్చింది. ఇక దిగుతారా?" అన్నది.

అతను సిగ్గుపడి డోర్ తెరుచుకుని దిగాడు.

"ఏమిటి అంత సీరియస్‌గా ఆలోచిస్తున్నావ్?"

"కెరోన్ గురించే.... ఎందుకో ఆమె చావు నాలో ఓ విధమైన భయాన్ని కలిగిస్తోంది స్టెల్లా."

నవుస్తున్నదల్లా ఆగిపోయి "అసలు నిన్ను కూడా షూట్ చెయ్యాలి.... ఐనా దాంతో నీ తిరుగుళ్ళేమిటి? ఇడియాట్ నాకంటే అందంగా వుందనా?" అన్నది.

(సశేషం)

